# అందరికీ జ్యోతిషం

(చదవండి... ఆలోచించండి... అనుసరించండి)

రచన

డా॥ సాగి కమలాకర శర్మ

వేద సంస్కృతి పరిషత్

3-4-245/1, లింగంపల్లి, కాచిగూడ,హైదరాబాద్ - 500 027

ఫోన్ : 27550530

**అందరికీ జ్యోతిషం**

**రచన : డా॥ సాగి కమలాకర శర్మ**

ప్రథమ ముద్రణ - వైశాఖ పూర్ణిమ - మే, 2006
ద్వితీయ ముద్రణ - వైశాఖ పూర్ణిమ - మే, 2009

ప్రచురణ
**వేద సంస్కృతి పరిషత్, హైదరాబాద్**

**వెల : 50 రూపాయలు**

ప్రాప్తి స్థానం
3-4-245/1, లింగంపల్లి, కాచిగూడ,
హైదరాబాద్ - 500 027
ఫోన్ : 27550530

డి.టి.పి.
**కావ్యశ్రీ గ్రాఫిక్స్**
న్యూనల్లకుంట, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27550530

ముఖపత్రం
గోపి, ఆనంద్ ప్రింటర్స్, కాచిగూడ, హైదరాబాద్.
ఫోన్ : 2756 1270

ముద్రణ
శ్రీ సాయి ప్రాసెస్, నారాయణగూడ, హైదరాబాద్ - 29.
ఫోన్ 27563075.

అంకితం ....



.... అమ్మకు

శరదిందు సమాకారే పరబ్రహ్మ స్వరూపిణే
వాసరా పీఠ నిలయే సరస్వతి నమోస్తుతే

శారదా శారదాంభోజ వదనా వదనాంబుజే
సర్వదా సర్వదాஉస్మాకం సన్నిధిస్సన్నిధిం క్రియాత్

# విషయక్రమం

# నమోస్తు తే ...

జ్యోతిషం ప్రకృతి శాస్త్రం అన్నప్పుడు ప్రకృతిలో ఉన్న అన్ని అంశాలకు ఏదో అంతర సంబంధం ఉండి తీరుతుంది. ఈ సంబంధాలలో సక్రమమైన వ్యవస్థ కలిగిన అంశాలను ఎప్పటికీ గమనించడం వల్ల ప్రకృతిలో వచ్చే మార్పులను గమనించడానికి సాధ్యం అవుతుంది. ఎప్పుడు ఈ మార్పులు వస్తున్నాయో గమనిస్తే కాలం యొక్క మంచి, చెడులు దాని ప్రాధాన్యం మనకు తెలిసే అవకాశం ఏర్పడుతుంది. ఈ రెండింటినీ సమగ్రంగా తెలుసుకునే శాస్త్రం జ్యోతిషం. కాలాన్ని తెలుసుకుని ప్రవర్తించడమే జ్యోతిషమిచ్చే సందేశం. అయితే ఆ కాలంలో మంచి కాలం, చెడ్డకాలం అంటూ గుర్తించడం ఎలా? వ్యక్తికీ, వ్యక్తికీ ఆ విషయంలో తేడాలు ఉంటాయా? ప్రకృతిపైన ఉండే సాధారణమైన ప్రభావం వ్యక్తికీ, వ్యక్తికీ తేడాగా ఎందుకుంటుంది? ఈ మార్పులను మనం తెలుసుకోవడం, అధ్యయనం చేయడం ఎలా అనే విషయాలు అందరికీ కలుగుతున్న అనుమానాలే. ఈ అనుమానాలను సమగ్రంగా విశ్లేషించుకొని జ్యోతిషం అందరికీ తెలిసే విధమైన ప్రయత్నం చేయడం ఈ గ్రంథ లక్ష్యం.

సహజంగా జ్యోతిష పాఠాలు చెప్పడం చాలా సంవత్సరాలుగా అలవాటు కావడం వల్ల గ్రంథంలో కూడా విశ్లేషణకు అధిక ప్రాధాన్యమిచ్చే ప్రయత్నం జరిగింది. అయినా జ్యోతిషం మొత్తం అవగాహన చేయించడం కూడా అత్యంత శ్రమతో కూడుకున్నదే. కొంత అవగాహన కలిగిస్తే వారు మరింత ముందుకు వెళ్తారని, విషయ విశ్లేషణలో కొన్ని మూఢ అభిప్రాయాలు, కొన్ని అవిశ్వాసాలను పోగొట్టుకుంటారని ఈ ప్రయత్నం చేస్తూ దీనికి **అందరికీ జ్యోతిషం** అనే నామకరణం చేశాం.

ఈగ్రంథంలో విషయాన్ని సమగ్రంగా వివరించాలనుకోలేదు. కేవలం పరిచయం మాత్రం చేద్దామనుకున్నాను. మొదలు పెట్టిన భావం ఒకటి, పూర్తి అయిన భావం అదేనో కాదో పాఠకులు తేల్చి చెప్పాలి. జ్యోతిషాన్ని అర్థం చేయించే దిశలో నేను చేసే కృషి సార్థకమవుతుందో కాదో కాలమే నిర్ణయించాలి.

ఈ పుస్తకం చిన్నదే అయినా దీనికి ముఖ్య ప్రేరణ సోదరతుల్యులు శ్రీ భువనగిరి అమరనాథ శాస్త్రిగారిది. ఈ పుస్తకావిష్కరణం వారి పుట్టినరోజున జరగడం మరింత విశేషం.

తమ ప్రవచనాలతో భారతీయాత్మను పులకింపజేస్తున్న ప్రవచనాధురీణులు బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారి రామాయణ ప్రవచనాల మధ్య, కంచి పరమాచార్యులవారు పీఠాన్ని అధిరోహించి 100 సంవత్సరాలు పూర్తి అవుతున్న శుభసందర్భంలో, గౌరవనీయులు డా॥ సి.వి.బి. సుబ్రహ్మణ్యంగారి సన్నిధిలో ఆవిష్కరింపబడడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని తయారు చేయడంలో సహకరించిన అందరికీ పేరు పేరునా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ప్రారంభించిన **వేదసంస్కృతి పరిషత్** ద్వారా చేయదలచుకున్న ఆలయ నిర్మాణ కార్యక్రమాలు, పరిశోధనాత్మక కార్యక్రమాలలో అందరి సహకారాన్ని అపేక్షిస్తూ ... నమోస్తు తే.

ఈ గ్రంథాన్ని చదువులతల్లి **వాసర సరస్వతీ మాత** చరణాలకు ప్రణమిల్లుతూ అంకితం చేస్తున్నాను.

**- సాగి కమలాకర శర్మ**

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం సర్వధీస్సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి

# ఇది జ్యోతిషమంటే

**'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి'** అన్నది సామెత. జ్యోతిషార్థంలో దీపం అంటే వెలుగు అని, ఇల్లు అంటే శరీరం అనీ అర్థం. ఈ రెండింటిని సమన్వయపరిస్తే సమయాన్ని గుర్తించి కాలసద్వినియోగం చేసుకోవడమని దీని అర్థం. జ్యోతిషశాస్త్రం ప్రకారం గ్రహాదులు శుభకిరణాలను ప్రసారం చేసే సమయాన్ని గుర్తించి దానికి అనుగుణంగా శారీరక మానసిక ప్రకృతులకు సంబంధించి చేయాల్సిన విధి విధానాలను చేయడం అని అర్థం. ఇటువంటి అర్థాలు ఈ సామెతలో ఎన్నో ఉంటుంటాయి. సర్వం జ్యోతిర్మయం కావడం వల్ల, దీనికి ఎంతో పూర్వచరిత్ర ఉండడం వల్ల ఎన్నో పదాలకు జ్యోతిషార్థాలు మనకు కనిపిస్తుండడం సహజం. ఈ పరిధిలో జ్యోతిషాన్ని గూర్చి, జ్యోతిషం అందించే మార్గనిర్దేశనాన్ని గూర్చి ఒకసారి గమనిద్దాం.

## కాంతి స్వరూపమే జ్యోతిషం

జ్యోతి అంటే కాంతి అని అర్థం. కాంతిస్వరూపానికి అనేక అర్థాలు చెప్పవచ్చు. కాంతికి ప్రకాశం, జ్ఞానం అనే అర్థాలు కూడా ఉన్నాయి. వెలుగు ఎక్కడ ఉంటుందో అక్కడ ఆనందం ఉంటుంది. వెలుగు చీకటిగా మారినప్పుడు అక్కడ అంతా కోల్పోయిన భావన కలుగుతుంది. రాత్రి దాటిన తర్వాత సూర్యుని కాంతి, రాత్రి కాగానే దీపపు కాంతి ఆనందాన్ని కలిగించేవే. అంటే జ్యోతిషం జ్ఞానాన్ని కలిగిస్తుందనీ, ఆనందాన్నిస్తుందనీ అర్థం అవుతుంది.

కాంతి ఉంటేనే అక్కడ ఉన్న పదార్థ జ్ఞానం తెలుస్తుంది. కాంతి లేకుంటే అక్కడేముందో ఎవరికీ తెలియదు. తెలియని చోట భయం, తెలిసిన చోట ధైర్యం ఉంటుంది. లోకంలో తెలివిగా, తెలిసినవానిగా, ధైర్యంగా, ఆనందంగా మెలగాలంటే కాంతికి చెందిన జ్ఞానం ఉండి తీరాలి. ఏ కాంతులు ఎప్పుడు ప్రసరిస్తాయో, ఏవిధమైన భావాలను ప్రేరేపిస్తాయో, ఏ కాంతులు ఎటువంటి ప్రభావాలను చూపిస్తాయో తెలుసుకుంటే జీవితం ఆనందంగా సాగుతుంది. ఆనందంగా జీవితం గడిపేవాడు మరికొంత మందిని ఆనందమార్గంలో తీసుకు పోగలుగుతాడు. అందుకే కాంతి స్వరూపమే జ్యోతిషం.

నక్షత్రాలు, గ్రహాలు, ఉపగ్రహాలు అన్నీ కూడా వెలుగులను విరజిమ్మేవే. కొన్ని స్వయంప్రకాశమానాలు, మరికొన్ని వానిపై ఆధారపడి పరావర్తనం చెందించేవి. భూగ్రహంపైన, దానిపై నున్న జీవరాశిపై వెలుగుల ప్రభావం అధికంగా ఉంటుంది. సూర్యకాంతికి ప్రకృతి స్పందిస్తుంది. ప్రకృతిలోని మనిషి కూడా స్పందిస్తాడు. అదేవిధంగా చంద్రుని కాంతి కూడా భూమిపైన, ప్రకృతి పైన, జీవులపైన ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటుంది. ఈ ప్రభావాలు చూపే ఖగోళ పదార్థాలనన్నింటినీ ఒకచోట చేర్చుకొని దేని ప్రభావం ఎంత ఉంటుందో, ఏవిధంగా ఉంటుందో పరిశీలించేదే జ్యోతిషం.

ఒకరకమైన కాంతి ఒకరికి సంతోషం కలిగించేది కాగా, మరొకరికి అది ఇబ్బందికరం కావచ్చు. ఎటువంటి కాంతి ఏవ్యక్తికి, లేదా ఎటువంటి ప్రకృతికి మంచిని కలిగిస్తుందో గమనించి ఆ యా కాంతులలేమిని పూర్తి చేసే రూపంలో పరిశోధనలు జరిపి వ్యక్తికి ఆనంద మార్గాన్ని చూపించేది జ్యోతిషం. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ వ్యక్తిపై పరిపూర్ణ ప్రభావాన్ని చూపించేవి జ్యోతిస్సులే. అవి వెలువరించే కాంతులే.

ఎండాకాలంలో వేడిమి, చలికాలంలో చలి, వానాకాలంలో వర్షం రావడం సహజం. అయినా అన్ని కాలాల్లోనూ సామాజిక జీవితాన్ని వ్యక్తి గడపడం తప్పనిసరి. కాబట్టి ఆ యా కాలాలకు అనుగుణంగా ఎండా కాలంలో చల్లగాలికోసం వెతుక్కోవడం, చలికాలంలో స్వెట్టర్ వేసుకోవడం, వానా కాలంలో గొడుగు పెట్టుకోవడం వంటి జాగ్రత్తలు శరీర రక్షణకోసం తీసుకుంటాం. ఇటువంటి రక్షణలు ఏ సమయంలో తీసుకోవాలో తెలుసుకోవాలంటే ఏ సమయంలో అవి వస్తాయన్న పరిజ్ఞానం ఉండాలి. అదే కాలజ్ఞానం.

పగటికాలం వెలుగును, రాత్రికాలం చీకటిని కలిగి ఉన్నాయి. రాత్రికాలంలో భయం, పగటికాలం ఆనందాన్ని కలిగిస్తున్నాయి. భయాన్ని, ఇబ్బందులను కలిగించే కాలం పోయి ఆనందాన్నిచ్చే కాలం కోసం మనిషి ఎదురుచూస్తుంటాడు. తనకు తోచిన దీపం వెలిగించుకొని భయంనుండి దూరం కావడానికి ప్రయత్నిస్తుంటాడు. ఈ భయం కలిగించే కాలం ఎప్పుడు వస్తుందో, ఆ భయం తొలగి ఎప్పుడు ఆనందమయుడవుతాడో తెలుసుకుంటే వ్యక్తికి ధైర్యం కలుగుతుంది. ఈ భయం కలిగే కాలం ఎప్పుడొస్తుందో తెలుసుకోవడం, దాన్ని తొలగించుకునే ప్రయత్నం చేయడం, భయం తొలగిపోయి ఆనందంగా జీవించగలిగే కాలజ్ఞానమే జ్యోతిషం.

ప్రతి విషయంలో రెండే కాలాలుంటాయి. అవి మంచి, చెడు కాలాలు. శుభాశుభ కాలాలు. ప్రకృతిపైన, ప్రకృతిలోని జీవులపైన ఏ యే కాలాల్లో ఎటువంటి ప్రభావాలుంటాయో తెలుసుకునేది కాలజ్ఞానం. ప్రకృతిపై వేరు వేరు కాంతులు, మంచి ప్రభావం కలిగించే కాలాన్ని శుభకాలమనీ, చెడు ప్రభావం కలిగించే కాలాన్ని అశుభ కాలమనీ అంటాం. రాశులు, గ్రహాలు, భావాల ప్రభావాల వల్ల వేరు వేరు దశాకాలాల్లో వ్యక్తులకు శుభాశుభ ఫలితాలు కలుగుతూనే ఉంటాయి. ఏ కాలం శుభమవుతుందో, ఏది అశుభమవుతుందో

తెలుసుకొని మసలుకోవడం కాలజ్ఞానం. ఈ కాలజ్ఞానం అంతా జ్యోతిస్సులపైన, జ్యోతిషశాస్త్రం ద్వారా తెలియజేసే సూత్రాల పైన ఆధారపడి ఉంటుంది. మంచి కాలంలో మంచిని పెంచుకునే ప్రయత్నం, చెడ్డకాలంలో చెడును నిరోధించే మార్గంలో ఎక్కువ ప్రయత్నాలు చేయడం అవసరమవుతుంది. చెడుకాలాన్ని తెలుసుకొని జాగ్రత్తలు తీసుకోవడం, మంచికాలంలో తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాలు సాధించు కోవడం నేర్పరుల లక్షణం. జ్యోతిషం ద్వారా మాత్రమే ఈ కాలజ్ఞానం సాధ్యం. అందుకే కాలజ్ఞానమే జ్యోతిషం.

## సహజ జ్ఞానమే జ్యోతిషం

ప్రతిజీవికీ స్వయంచోదిత నాడీ వ్యవస్థయొక్క స్పందన లాగా తమకు తమ మార్గాలు, తమ గమ్యాలు తెలిసి ఉంటాయి. కాని సామాజికమైన ఇతర అంశాల ప్రభావాలతో అవి మరుగున పడిపోతుంటాయి. ఈ సహజజ్ఞానాలు వెలికి తీసుకొని చూసుకుంటే తనను తానే నడిపించుకునే ధైర్యం ఏర్పడుతుంది. లేకుంటే మరొకరిపై ఆధారపడవలసి వస్తుంది.

దిక్కు, దేశం, కాలం తెలుసుకోవడం అనేవి అన్ని జీవరాశుల సహజ జ్ఞానంలోని భాగాలే. ఈ జ్ఞానాన్నే జ్యోతిషంలో త్రిప్రశ్నాధికారం అని అన్నారు. ఏ దిక్కు తమకు మంచిని కలిగిస్తుందో చెప్పేది జ్యోతిషం. ఏప్రదేశం తమకు అనువైనదో తెలియజేసేది జ్యోతిషం. ఏ కాలంలో ఎటువంటి పనులు చేయాలో, ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలో తెలిపేది జ్యోతిషం.

దిక్కు అనేది సూర్యుని ద్వారానే తెలుస్తుంది. మన గణనకోసం సూర్యుడు ఉదయించే ప్రదేశాన్ని తూర్పు అనీ, అస్తమించేదిశను పశ్చిమమనీ పిలుస్తుంటాం. దిక్కు అనేది జ్ఞానపర్యాయవాచకంగా మారింది. దిక్కు లేనివాడికి దేవుడే దిక్కు అనడం వల్ల దిక్ శబ్దం రక్షణార్థంలో వాడబడింది. సూర్యుడు ఉదయించే

దిశ లేకపోతే వ్యక్తి ఏదిక్కుకు పోతున్నాడనే విషయం తెలుసుకోవడం ఆరంభ కాలంలో చాలా కష్టమని అందరికీ తెలిసిందే. రాత్రిపూట ధ్రువాది నక్షత్రాల పరిజ్ఞానం ఉంటేనైనా కనీసం ఉత్తరదిశ తెలుస్తుంది. ప్రస్తుతం కంపాస్ ద్వారా దిశను తెలుసుకునే అవకాశం ఉంది. తనకు మార్గం చూపించేది దిక్కు అనే అర్థంలో భగవంతుడు అందరికీ మార్గదర్శకుడు అనే భావంతో దిక్కు సహజ జ్ఞానంగా గుర్తించారు. వలసపక్షులు కూడా ఏ సమయానికి ఎక్కడ బయలుదేరాలో ఖచ్చితంగా పాటిస్తూ మళ్ళీ స్వస్థలాలకు కూడా ప్రత్యేక సమయాల్లో తిరిగి వచ్చేస్తుంటాయి. ఈ రకమైన ప్రయాణం వాటికి ఉన్న సహజ పరిజ్ఞానం వల్లనే సాధ్యం. ఈ పరిజ్ఞానం వల్లనే వాతావరణంలో వచ్చే మార్పులకు అనుగుణంగా వ్యక్తి జాగ్రత్తలు తీసుకోగలుగుతున్నాడు.

ఈ త్రిప్రశ్నాధికారమే జ్యోతిష పరిశీలనలకు దారి తీసింది. తానున్నది ఏ ప్రదేశం? తానే దిశకు వెళ్లాలి? ఎప్పుడు వెళ్ళాలి? ఈ మూడు అంశాలలోని లోతుల్ని పరిశీలించడమే జ్యోతిషలక్ష్యంగా మారింది. అదే ఇంత పెద్దనైన శాస్త్రంగా ఆవిర్భవించడానికి హేతువైంది. వెలుగువైపు వెళ్ళడానికి, సరియైన ప్రదేశానికి చేరడానికి, సరియైన సమయంలో చేసిన ప్రయత్నాదుల ఫలితమే జ్యోతిశ్శాస్త్రం. అందుకే వ్యక్తిలోని సహజజ్ఞాన స్వరూపమే జ్యోతిషం.

## ప్రకృతి జ్ఞానమే జ్యోతిషం

ప్రకృతి అంటే మన చుట్టూ ఉండేది. మనచుట్టూ ఉన్న విషయాలను మనం అర్థం చేసుకోవడమే ప్రకృతికి చెందిన పరిజ్ఞానం. చుట్టూ ఉన్న ప్రకృతిలో వచ్చే మార్పులను గమనించడం కూడా జ్యోతిష పరిజ్ఞానంలో భాగమే. సాధారణంగా ఇంగ్లీషు భాషలో పంచభూతాలతో కూడుకున్న ప్రకృతిని నేచర్ (Nature) అనీ, ప్రకృతి భావాలను పరిపూర్ణంగా శరీరం, మనస్సుల్లో నింపుకొని పాంచభౌతిక శరీరం కలిగిన వ్యక్తిని నేటివ్ (Native) అనీ పిలుస్తారు.

ఈ ప్రకృతిలో ఏముందో ఈ శరీరంలోనూ అదే ఉంటుంది. అందుకే ప్రకృతికి అనుగుణంగా శరీరం స్పందిస్తూ ఉంటుంది. ప్రకృతిలో మార్పుల వల్ల శరీర, మానసిక ప్రకృతులలో మార్పులు కలుగుతుంటాయి. ప్రకృతికి అనుగుణమైన మార్పులు కలిగి ఉంటే ఆ వ్యక్తి ఆ ప్రకృతిలో మనుగడ సాగించగలిగినవాడు అవుతాడు. ప్రకృతికి అనుగుణమైన మార్పులు పొందలేకపోతే ఆ వ్యక్తి ప్రకృతివరణం (Natural Selection) పొందలేక ఇబ్బందిపడతాడు. ఈ ఇబ్బంది ఒక్కోసారి ప్రాణాంతకం కూడా కావచ్చు. అందువల్ల ముందుగా ఇబ్బంది పడే అంశాన్ని గుర్తించి ఇబ్బందులు రాని విధంగా జాగ్రత్తలు తీసుకుంటూ మనుగడ సాగించి ప్రకృతికి అనుగుణమైన జీవితాన్ని సాగించుకునే అవకాశం ఉంటుంది. ఈ గుర్తించే విధానం ఒక్క జ్యోతిషం వల్ల మాత్రమే సాధ్యం. ఎందుకంటే ప్రకృతిని, ప్రకృతిలో భాగమైన వ్యక్తిని – రెండింటినీ శాసిస్తున్నవి జ్యోతిస్సులు మాత్రమే. జ్యోతిషశాస్త్ర సూత్రాలు వ్యక్తిని ఇబ్బందులనుండి దూరంచేసి ఆనంద మార్గగతుల్ని చేస్తాయి. అందుకే ప్రకృతికి అనుసారమైన జీవితం ఆనందాన్ని, ప్రకృతికి వ్యతిరేకమైన జీవితం ఇబ్బందుల్ని కలిగిస్తుంది. ప్రకృతితత్వం తెలుసుకుంటే జీవితాన్ని సుఖంగా గడుపుకోవచ్చు. అందుకే ప్రకృతి జ్ఞానమే జ్యోతిషం.

ఈ ప్రకృతి జ్ఞానం ఫలితజ్యోతిషాంశాలకు దారి తీసిన మానవుని ఆలోచనను ఇక్కడ గమనిద్దాం. ఆకాశంలో ఉదయించే ఒకానొక నక్షత్రం ఒక ప్రత్యేక సమయంలో ఒక ప్రత్యేక ప్రదేశంలో ఉన్నప్పుడు వాతావరణంలో పెద్ద మార్పు సంభవించి వర్షాలు కురిశాయి. ఆ వర్షాల ప్రభావం వల్ల ప్రక్కనే ఉన్న నదికి వరదలు అధికంగా వచ్చి తమవారిని కొంతమందిని పోగొట్టుకున్నవారు ఉండవచ్చు. వారికే మళ్ళీ సంవత్సరంలో కూడా అటువంటి ఆకృతి కలిగిన నక్షత్రాలే అక్కడే మళ్ళీ అదే సమయానికి కనిపించినపుడు అటువంటి సంఘటనే పునరావృతమై ఉండవచ్చు. ఈ విధంగా రెండు మూడు సార్లు జరిగేసరికి

తరువాత ఆ నక్షత్రం అక్కడ కనిపించే సమయానికి తమవారిని తీసుకొని ఆ నది దగ్గరనుండి దూరప్రదేశానికి వెళ్ళి సుఖంగా గడిపాడు. ఇక్కడ కూడా సరియైన ప్రదేశం వ్యక్తి సహజజ్ఞానంతో వెతుక్కున్నది కాగా కాలాన్ని సూచించింది మాత్రం నక్షత్ర ఉదయమే. అందువల్ల ప్రకృతిపై ప్రభావాలను గమనించడానికి జ్యోతిస్సులు వినియోగపడుతున్నాయి.

ఇక్కడ ప్రత్యక్షంగా ఆ యా నక్షత్రాల పాత్ర లేకున్నా ఆ నక్షత్రం ఆ సమయంలో అక్కడ కనపడితే ఈ భూమిపై ఇటువంటి మార్పు కలుగుతుందనే భావం మనకు ఏర్పడుతుంది. ఈ భావమే జ్యోతిస్సులు భవిష్యత్తును సూచన చేస్తాయనడానికి పునాది. ఇటువంటి భావంతోనే హోరాశాస్త్రంలోని ఫలిత విభాగమంతా ఏర్పడి విస్తృతి చెందింది. ఇక్కడ ముఖ్యంగా వేరు వేరు కాలాల్లో ప్రకృతిని అధ్యయనం చేయాల్సి ఉంటుంది. భూ ప్రకృతి జ్యోతిస్సుల యొక్క అయస్కాంత, కాంతి క్షేత్రాల ప్రభావితం కాబట్టి, ఈ భూ వాతావరణంపై దాని ప్రభావం అది చూపిస్తూనే ఉంటుంది. ఈ ప్రభావం అందరికీ సమానమే అయినా ఆ మారే ప్రభావాలు వేరు వేరు వ్యక్తులకు ఏవిధంగా ఉంటాయో పరిశీలించాల్సిన అవసరం ఉంది. వ్యక్తి జన్మజాతకాన్ని బట్టి ఆ వ్యక్తికి సంబంధించిన లక్షణాలు తెలుస్తుంటాయి. ఏ రకమైన వారు ఏ రకమైన వాతావరణానికి అనుకూలంగా స్పందిస్తారో, ఏ రకమైనవారు ఎటువంటి వాతావరణాన్ని వ్యతిరేకిస్తారో, ప్రకృతి, ఆ ప్రకృతి నుండి పుట్టిన (నేటివ్) వ్యక్తుల పరీక్ష ద్వారా సాధ్యం అవుతుంది. అందుకే ప్రకృతి జ్ఞానమే జ్యోతిషం.

ఒక హిమాలయ ప్రదేశానికి ఒకేసారి కొంతమందిని పంపామనుకోండి. ఆ చల్లదనానికి కొందరు వెంటనే ఇబ్బందులకు గురవుతారు. కొందరు వెంటనే పడిపోతే కొందరు మధ్యలో, మరికొందరు చివరలో పడిపోవచ్చు. ఎవరి శక్తి, రోగనిరోధక శక్తి ఎంత ఉంటుందో దాన్ని బట్టి ఆ వ్యక్తికి సంబంధించిన సామర్థ్యం

ఆధారపడి ఉంటుంది. ఈ సామర్థ్యం అధికంగా ఎప్పుడుంటుందో తెలుసుకోవాలన్నా, జాతకమాధ్యమంగా ప్రకృతి విజ్ఞానం తెలుసుకోవాలి. అందుకే ప్రకృతి విజ్ఞానమే జ్యోతిశ్శాస్త్రం అవుతుంది.

## నిత్య జీవితంలో జ్యోతిషం

జ్యోతిషం మనకు అర్థం కాదులే అని అందరూ సరిపుచ్చుకుంటుంటారు. శాస్త్రరీత్యా శ్రమలేక, శ్రమపడలేక తమకర్థం కాదులే అనుకుంటే ఇబ్బంది లేదు కాని స్థిమితంగా ఆలోచిస్తే మన జీవితవిధానం అంతా జ్యోతిషమేనని తెలుస్తుంది. మనలో ఉన్నదానిని, మనం అనుసరిస్తున్నదానిని జ్యోతిషమని గుర్తిస్తే మనమెంత జ్యోతిష్మతులమో మనకు అర్థం అవుతుంది. మనం నిత్యం అనుసరించే ఆచార వ్యవహారాలను ఒకసారి గమనించండి. మనం ఉపయోగించే భాషను ఒకసారి తరచి చూడండి. మనం దేనికి అధికంగా ప్రభావితం అవుతున్నామో అర్థం చేసుకోండి. ప్రతి విషయాన్ని కొంత లోతుగా, దాని మూలాల వరకు వెళ్ళి చర్చించండి. అప్పుడే తెలుస్తుంది నిద్ర లేచినప్పటినుండే కాక పడుకునే వరకుండే సామాజిక జీవితంలోనే కాక, అంతర్గతమైన స్వాప్నిక జీవితంలోనూ కూడా జ్యోతిస్సుల ప్రభావాలే కనిపిస్తుంటాయి. గుర్తించగలగడం గుర్తించగలగలేకపోవడం వ్యక్తియొక్క కృషిపై ఆధారపడి ఉంటుంది.

మన జానపదులంతా వ్యవసాయాన్ని జ్యోతిషం ఆధారంగానే చేసేవారు. మన కాలమంతా జ్యోతిష ఆధారమే. మనం పండుగలు, వ్రతాలు, పూజలు చేసేప్పుడు దేవునిపైన కట్టే పాలవెల్లి ఆకాశంలోని పాలపుంతకు, నక్షత్ర మండలానికి ప్రతి రూపమే. వేరు వేరు కాలాల్లో అంటే భాద్రపద శుద్ధ చవితికి వచ్చే వినాయక చవితి, ఆశ్వీజ శుద్ధదశమినాడు వచ్చే విజయదశమి, దీపావళి, సంక్రాంతి, రథసప్తమి, శివరాత్రి, ఉగాది మొదలైన పండుగలన్నీ

జ్యోతిష ప్రభావంతో చేసుకునేవే. మనం మాట్లాడే మాటల్లో ఎక్కువ భాగం జ్యోతిస్సులకు సంబంధించినవే. మనం పూజించే దేవతల బొమ్మలకు మూలం ఆకాశంలో నక్షత్రమండలాలే. మనం చదువుకునే పురాణాల గాథల వెనుక అంతర రూపం అంతా జ్యోతిస్సులు కనిపించే విధానమే. తరచి చూడండి. ఆలోచించండి, వివేచించండి. సర్వం జ్యోతిర్మయమే. మనం గుర్తించలేక దానిలో ఏమీ లేదనుకునేవారికి మనం ఏమీ చెప్పకపోతేనే మన హుందాతనం తెలుస్తుంది. తెలుసుకోవాలనుకునేవానికి ఎంతైనా, ఏమైనా చెప్పవచ్చు, వారి ప్రశ్నలకు సమాధానం ఇవ్వవచ్చు. తనను తాను గుర్తించలేక, తనకు తెలిసింది తనను రక్షించక, మంచి చెడులను విశ్లేషించలేని ఉత్తములు అన్నికాలాల్లోనూ మనకు కనిపిస్తూనే ఉంటారు. వారికి తెలిసిందెంతో వారికే తెలియదు, వారేం చేయాలో వారికే తెలియదు. ఈ తెలియనివారి మార్గనిర్దేశం కన్నా జ్యోతిస్సులను నమ్ముకుంటే వానిపై జరిగిన పరిశోధనలను నమ్ముకుంటే మనోధైర్యం కలిగి జీవితాన్ని సక్రమంగా గడపుకోగలిగే అవకాశం ఉంటుంది.

## లైఫ్ ప్లానర్ జ్యోతిషం :

మనకు సాధారణంగా డేప్లానర్, మంత్ ప్లానర్, ఇయర్ ప్లానర్ అనే భావాలు ఉంటుంటాయి. ఆ రోజులో చేయవలసిన పనులు, ఆ నెలలో చేయవలసిన పనులు, ఆ సంవత్సరంలో చేయవలసిన కార్యాలు అంటూ ఒక ముందుచూపు (విజన్) ను ఏర్పరచుకుని కార్యక్రమాలను క్రమంగా నిర్వహించడానికి ప్రయత్నిస్తాం.

ఉగాదినాడు పంచాంగశ్రవణం ద్వారా ఆ సంవత్సరం తనకు జ్యోతిస్సుల మార్గనిర్దేశనం ఏమిటో తెలుసుకొని, కృషి అధికంగా చేయాల్సిన సమయమా? తక్కువ శ్రమతో ముందుకు వెళ్ళాల్సిన సమయమా? తెలుసుకొని ముందుకు

సాగడమే పంచాంగశ్రవణ లక్ష్యం. ఏ విషయమైనా తెలుసుకుని ముందుకు సాగడం వల్ల కష్టనష్టాలపై ఒక విశ్లేషణ ఉంటుంది. రాబోయే ఇబ్బంది ముందుగా తెలిస్తే దానిని ఎదుర్కునే మానసిక స్థితితో, సామాజికమైన జాగ్రత్తలను మనం తీసుకుంటాం కదా! ఏ విషయమైనా తెలుసుకోవడానికి వెలుగు యొక్క సహకారం అవసరం. అదేవిధంగా జ్యోతిస్సులు దశల రీత్యా, గోచారం రీత్యా ఇచ్చే మంచి చెడు ఫలితాలు మనం ముందుగా తెలుసుకుని ప్రవర్తించడం ద్వారా ఆ సమయానికి చేయవలసిన పనుల ప్లానింగ్ తెలుస్తుంది. ఈ ప్లానర్ లేకుండా ప్రవర్తిస్తే కష్టమధికమై ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయే ప్రమాదం ఉంటుంది. తెలిసి ప్రవర్తిస్తే ధైర్యం కల్గి మంచిసమయం వచ్చేవరకు వేచి ఉండే మానసిక స్థితి పెంచుకుని ఆనందంగా జీవించే అవకాశం ఉంటుంది.

జాతకం పుట్టిన సమయంలో వేసుకునేది. పుట్టిన సమయంలోని లగ్నం, గ్రహాల స్థితులు ఒకచోట చేర్చితే అది వ్యక్తి జాతకం అవుతుంది. దానిప్రకారం దశల నిర్ణయం ఉంటుంది. దశలలో మంచిదశలు, చెడ్డదశలు ఎప్పుడు ఎలా వస్తాయో నిర్ణయం శాస్త్రం తెలియజేస్తుంది. మంచి చెడు సమయాలను గుర్తించి మంచి సమయాన్ని వేరు వేరు కార్యక్రమాలు అధికంగా చేయడానికి సద్వినియోగం చేయడం, చెడ్డసమయంలో జాగ్రత్తలు తీసుకుంటూ కార్యనిర్వహణకు ఎక్కువ కృషి చేస్తూండడం అనేది జ్యోతిష సందేశం. అంతేకాక జాతకస్థితిని బట్టి వ్యక్తి ఏ రకమైన శారీరక, మానసిక స్థితులను కలిగి ఉంటాడో గుర్తించి ఆ యా రంగాలలో ఆ వ్యక్తిని ప్రవేశపెట్టగలిగితే ఆ వ్యక్తి తన సేవల ఫలితాలను లోకానికి అధికంగా అందజేయగలుగుతాడు. లేకుంటే తనకోసమే పనిచేసి అందరినీ ఇబ్బందులకు గురిచేస్తాడు. జాతకం చెప్పే 12 భావాలలోని వేరు వేరు అంశాలను ముందుగానే గుర్తించి సమయానుకూలమైన నిర్ణయాలు తీసుకోవడమే లైఫ్‌ప్లానర్. జీవితాన్ని జ్యోతిస్సుల నేపథ్యంలో ఉత్తమ మార్గంలో తీర్చిదిద్దుకోవడమే లైఫ్‌ప్లానర్. అందుకే జీవితమార్గదర్శి జ్యోతిషం.

## జ్యోతిషం - ఉపయోగాలు

సమాజంలో వేరు వేరు వర్గాల వారికి ముందుజాగ్రత్తలను తెలియజేస్తూ వారు ప్రవర్తించాల్సిన విధానాన్ని తెలియజేస్తుంది జ్యోతిషం.

కాలానుగుణమైన జీవితవిధానాన్ని తెలియజేస్తూ శుభాశుభ కాలాల్లో ప్రయత్నించాల్సిన విధానాన్ని, జాగ్రత్తలు తీసుకునే విధానాన్ని పరిహార క్రియల రూపంలో తెలియజేస్తుంది జ్యోతిషం.

జ్యోతిషం ద్వారా మాత్రమే సృష్టివిజ్ఞానంలోని అంశాలను, అధ్యాత్మ అంశాలను గమనించవచ్చు. శుభాశుభ అంశాల ప్రత్యేక పరిశీలన జీవితానికి చక్కని మార్గదర్శకత్వం కాగలదు.

దశానుకూలమైన అంశాల ప్రాధాన్యమే జ్యోతిష ఫలితాలకు ముఖ్య హేతువు కావడం వల్ల ఆ యా దశలు, అంతర్దశలు, విదశలు క్రమంలో గమనిస్తూ వేరు వేరు సమయాలలో వర్తించాల్సిన విషయాలను, తీసుకోవలసిన జాగ్రత్తలను తెలియజేసేది జ్యోతిషం.

జీవితంలోని వేరు వేరు భాగాలలో చేసుకునే వేరు వేరు కార్యక్రమాలకు మంచి సమయాన్ని నిర్ణయించుకునే అవకాశాన్ని గ్రహగతులు, రాశి విశేషాల ద్వారా తెలియజేసేది జ్యోతిషం.

ఉద్యోగస్థులకు తమ జాతకం, గోచారాదులను పరిశీలించుకుంటూ ఉద్యోగాలలో జాయినింగ్ సమయాలు సరియైన ముహూర్తాలలో నిర్ణయించుకునే అవకాశం ఉంటుంది. సరియైన సమయాలు తెలుసుకుని చేసే కార్యకలాపాల వల్ల గౌరవం హోదాలు పెరగడమే కాక ఉద్యోగం ద్వారా లోకానికి మేలు [illegible]వారవుతారు. ఒకవేళ జాతక, గోచారాల రీత్యా ఈ విషయాలు తెలియకుండా చేసే ప్రయత్నాలు ఉద్యోగాలలో డిమోషన్స్‌కు,

టాక్స్ ప్రాబ్లమ్స్‌కు గురై ఉన్నది కోల్పోవలసి వస్తుంది. కాబట్టి అనుకూలమైన ప్రదేశాలను, కాలాలను గుర్తెరిగి ఉద్యోగులు ప్రవర్తిస్తే ఆనందప్రదమైన జీవితం ఉంటుంది.

వ్యాపారస్థులకు సమాజం వెంట పరుగెత్తి, సమాజం కన్నా ఒకడుగు ముందుకు నిలుచుని పనిచేయాల్సి ఉంటుంది. కొన్ని దశలలో ఈ వేగం కోల్పోవలసి వస్తుంది. అటువంటి సమయాలను తెలుసుకొని సరియైన ప్రయత్నాలు చేయడం, పరిహార ప్రక్రియలు చేసుకుంటూ ఉండడం వల్ల మళ్ళీ ఇబ్బంది లేకుండా వ్యాపారం చేసుకో గలుగుతారు. లేకుంటే ఉన్నది కోల్పోవడమే కాకుండా మళ్ళీ నిలదొక్కుకోలేనంతగా మారి అప్పులపాలై, అన్నీ అమ్ముకోవడం, అవమానం పాలు కావడం వంటి దుష్ట పరిణామాలకు గురి కావలసి ఉంటుంది. అందుకు వ్యాపారస్థులు కూడా నిరంతరం జ్యోతిష్కుని సంప్రదిస్తూనే ఉండాలి.

విద్యార్థులకు పోటీ పరీక్షలలో తాము సరియైన విధంగా నిలదొక్కుకునే సమయం, ఏ రంగంలో ప్రవేశిస్తే ఉత్తమంగా తీర్చి దిద్దబడతామో తెలుసుకునే అవకాశాన్ని జ్యోతిషం కలిగిస్తుంది. ఈ అంశం తెలియకుండా సమాజంలో అందరూ చేసినట్లే ప్రతి విద్యార్థి ప్రయత్నిస్తే మనసుకు నచ్చిన చదువులు చదువలేక ఇబ్బందులకు గురై వృత్తి, ప్రవృత్తులు ఒక్కటిగా ఉండక, చదివిన చదువులు సార్థకం కాకపోవడం వల్ల చేసే పనులు అసమర్థం కావడం వల్ల ప్రలోభాలకు లొంగి అవస్థల పాలు పడతారు. అందుకే తమ మార్గం ఏదైతే బావుంటుందో తెలుసుకొని ఆ రంగంలోకి విద్యార్థి దశలోనే మారిపోతే వ్యక్తి తనకు, సమాజానికి వినియోగపడి ఆనందమయ జీవితాన్ని ఆస్వాదిస్తాడు.

వివాహాదులు జరిగే సమయాలను జాతకాలలోని దశాంతర్దశల ద్వారా తెలుసుకుని మంచి సమయాలలో, యుక్తవయస్సులో తెలుసుకుని ఆ సమయంలో వివాహానికి ప్రాధాన్యం ఇవ్వడం ప్రస్తుత కాలపు అత్యవసరం.

విద్య, ఉద్యోగాది వేరు వేరు సామాజికాంశాల వల్ల వివాహాన్ని సరియైన కాలంలో కావాలని దూరంచేసుకుంటే, దానివల్ల శారీరక మానసికమైన ఇబ్బందులు అధికమై సమాజంలో ఒకరకంగా ప్రత్యక్ష పరోక్షమైన గందరగోళాలకు కారకులవుతారు. అందుకే సమయానుకూల ప్రవృత్తి వివాహార్థులకు అవసరం. అది సూచించగలిగేది జ్యోతిషమే.

అదేవిధంగా వివాహితులైన భార్యాభర్తలు తమ ఇద్దరికీ అనుకూలమైన సమయాలను ఎంచుకొని పిల్లలకోసం ప్రయత్నించాలి. అటువంటి సమయాలను ఎన్నుకొని చేసే ప్రయత్నాల వల్ల ఉత్తమమైన సంతానం, యోగ్యమైన సంతానం కలిగి సంతానం ద్వారా ఆనందం కలుగుతుంది. ఆ విషయం తెలుసుకోకుండా కావాలని ఆగడం ద్వారా, ఉద్యోగార్థమై దూరంగా ఉండడం మొదలైన ప్రక్రియల ద్వారా మంచి సమయం కోల్పోతే సంతానం విషయంలో జీవితాంతం ఎదురు చూస్తూ దబ్బులు అధికంగా కోల్పోవలసి ఉంటుంది. అందుకే సంతానార్థులకు సరియైన సమయాన్ని సూచించి సమాజానికి ఉత్తమ సంతానాన్ని అందించే శాస్త్రం జ్యోతిషమే.

రాబోయే కాలాలలో ఏవైనా అనారోగ్యాలు రాబోతున్నాయేమోనని ప్రతి 6 నెలలకు ఒకసారి చూపించుకోవడం ద్వారా అనారోగ్యాలనుండి కాపాడబడవచ్చు. అనారోగ్యాలు రాకుండా ఉండడానికి, ఏ గ్రహం ద్వారా ఆ రోగం రావచ్చో, ఎటువంటి రోగం వచ్చే అవకాశం ఉందో, ఏ భాగానికి ఇబ్బంది కలుగవచ్చో జ్యోతిర్వైద్యం లేదా వైద్యజ్యోతిషాదులు తెలియజేస్తాయి. వాటిని ముందుగా తెలుసుకుని పరిహారక క్రియలను ముందుగానే పాటించడం వల్ల వ్యక్తి ఆనందప్రదమైన జీవితాన్ని గడుపుతాడు.

ఈ విధంగా జీవితంలోని ప్రతికోణంలోనూ ముందుజాగ్రత్తలను తీసుకుంటూ చేసే ప్రయత్నాలన్నీ వ్యక్తికి ఆనందాన్ని కలిగిస్తాయి. ఈ ఆనందం

వ్యక్తులందరికీ కలిగితే అందరూ సమర్థులై వారి వారి కార్యక్రమాలను ఆనందంగా నిర్వహిస్తారు. తద్వారా దేశ పురోగమనానికి చక్కని మార్గం ఏర్పడుతుంది. అసమర్థుల వల్ల దేశం స్వార్థ పూరితమై అధోగతి పాలవుతుంది. కాలానుగుణంగా వ్యక్తిని ప్రేరేపించి, ఇబ్బందులనుండి దూరం చేసే శాస్త్రం జ్యోతిషం మాత్రమే.

## జ్యోతిష్కుని అవశ్యకత

జ్యోతిష్కుడు అంటూ ప్రత్యేకంగా ఉండాల్సిన అవసరం లేకుండా అందరూ జ్యోతిష్కులైతేనే అందరి జీవితాలూ ఆనందంగా సాగుతాయి. ప్రస్తుత కాలానికి అందరికీ జ్యోతిషం రావడమే అవసరం. దానిపై అవగాహన పెంచుకోవడం అత్యవసరం. కాని ఒక్కొక్కరూ ఒక్కో రంగంలో అధికంగా కృషి చేసేవారు కావడం వల్ల జ్యోతిషం అనే కొంత సబ్జెక్ట్‌ను మాత్రం ప్రత్యేకంగా కొందరు అధ్యయనం చేస్తున్నారు. వీరిని జ్యోతిష్కులు అని పిలుస్తున్నాం. ఏమీ విషయం తెలియకుండా తాము సిద్ధాంతులమనీ, జ్యోతిష్కులమనీ ప్రచారం చేసుకునేవారందరూ ఈ పేరుతో లోకాన్ని ఇబ్బందులకు గురి చేయడం స్పష్టంగా బాధాకరమైన అంశమే. అందరూ దానిని వ్యతిరేకించవలసిందే. ఎంతో కొంత తెలిసిన వారు కూడా అంతా తెలిసిన భావంతో ఆర్థిక ప్రయోజనాలకోసం జ్యోతిష్కుల రూపాన్నెత్తడం ఖండించాల్సిందే. ఎందుకంటే వ్యక్తులలోని లోపాలు క్రమంలో శాస్త్రలోపంగా పరిగణించబడి జ్యోతిషమంటే విరక్తిని కలిగిస్తున్నాయి. అందుకే జ్యోతిషశాస్త్ర భావాన్ని సంపూర్ణంగా తెలుసుకుంటూ సరియైన మార్గాన్ని ఎదుటివారికి తెలియజేయగలిగే కాలజ్ఞుడే జ్యోతిష్కుడు.

జ్యోతిష్కుడు లేకుంటే కాలం లేకుండా పోతుంది అని వరాహమిహిరుడు అంటాడు. సన్యాసులతో సహా జ్యోతిష్కుని సంప్రదించాల్సి ఉంటుందని అతను

చెప్తాడు. ఇక్కడ జ్యోతిష్కుడు లేకుంటే కాలం లేకుండా పోతుందని కాదు కాలానికి చెందిన శుభాశుభత్వం తెలియకుండా పోతుందని అర్థం. మంచి చెడు కాలాల అవగాహన ఉంటేనే మనుగడ సాధ్యం అవుతుంది. అది నిర్దేశించి విశ్లేషించి చెప్పేవాడు జ్యోతిష్కుడు. వేరు వేరు కార్యక్రమాలను వ్యక్తి చేసుకునే నేపథ్యంలో సరియైన నిర్ణయాన్ని ప్రకటిస్తూ సమయానుకూలమైన విధి విధానాలను ప్రోత్సహించేవాడు జ్యోతిష్కుడు.

కాలస్వరూపంపైన అవగాహన కలిగినవాడు జ్యోతిష్కుడు కావడం వల్ల సరియైన సమయాన్ని గుర్తించి వ్యక్తిని ఉత్తమమార్గంలో నడిపించేవాడు జ్యోతిష్కుడు. వ్యవసాయదారుడు వ్యవసాయం చేసుకోవాలంటే ఇష్టం వచ్చిన సమయంలో సేద్యం చేస్తే ఫలితం అంతంత మాత్రమే. ప్రకృతికి అనుగుణమైన సమయంలో చేసే కృషి మంచి ఫలితాలనిస్తుంది. అందుకే అదును ఎరిగి సేద్యం అంటారు. అంతేగాక ఆ సంవత్సరం ఎటువంటి పంటలు బాగా పండుతాయో సంవత్సర ఫలనిర్ణయాన్ని బట్టి నిర్ణయించుకోవడం మంచిది. ఈ విషయాలను తెలియజేయడానికి జ్యోతిష్కుని ఆవశ్యకత ఉంటుంది.

ఇంట్లో ఒక శుభకార్యక్రమాన్ని నిర్వర్తించాలంటే మంచి కాలం తెలియ జేసేవాడు జ్యోతిష్కుడు. ఏదైనా సంఘటన జరిగితే అది మంచినిస్తుందో, చెడ్డ నిస్తుందో విశ్లేషించేవాడు జ్యోతిష్కుడు. దానికి అనుగుణంగా జాగ్రత్తలను సూచించేవాడు జ్యోతిష్కుడు. జ్యోతిష్కుడే లేకుంటే ఏ సమయంలో ఏ పనులు చేయాలో తెలియక సందర్భంలేని పనులు చేసి లోకం ఇబ్బందులకు గురి అవుతుంది. మానసిక స్థైర్యం కోల్పోతుంది. అందుకే అందరికీ ఆనందాన్ని అందించే మార్గం జ్యోతిషం చెప్తే దాన్ని అనుసరించేమార్గాన్ని జ్యోతిష్కుడు వివరిస్తుంటాడు.

## ఆధునిక కాలంలో జ్యోతిష్కుని పాత్ర

జ్యోతిష శాస్త్రం ఒకటే అయినప్పుడు ఆధునిక కాలంలో ప్రత్యేకమేమిటి? అని ఆలోచిస్తే పూర్వపు సమాజ జీవితం కన్నా ప్రస్తుత సమాజజీవనం బాగా బలహీనమై పోయింది. రక్షణ బాగా అవసరమవుతున్న తరుణం ఇది. మానసిక మైన బలంపై ప్రక్కవారి దుష్ట ప్రభావాలు అధికంగా పడిపోతున్నాయి. చరిత్రలో రాజ్యాలను యుద్ధం చేసి గెల్చుకున్నట్లు సమాచారం. ప్రస్తుతం మానసిక సామ్రాజ్యాలను ప్రభావితం చేసేందుకు ఆర్థికమైన ఎరలెన్నో ఉన్నాయి. ఏటి ద్వారా వ్యక్తులు, వ్యక్తిత్వాలు బలహీనపడి లొంగిపోతున్నాయి. ఇబ్బందులకు గురవుతున్నాయి. ప్రతి వ్యక్తీ తమను ప్రక్కనున్న వారితో, సంబంధం లేని వారి స్థాయిలో ఊహించుకుంటూ బాధపడుతుంటాడు. తనకు మంచి జరగాలనే కోరిక ఉన్నా అన్నింటికీ ఆర్థిక జీవనమే ప్రాతిపదిక అయింది. పుట్టినప్పటి నుండి చదువు, ఉద్యోగం, వివాహం, సంతానం, చేసే కార్యక్రమాలు అన్నింటిలోనూ ఆర్థికస్థోమతలవైపే దృష్టిని సారిస్తున్నారు. దానివల్ల అన్ని స్థాయిల్లోవారూ ఇబ్బందులకే గురవుతున్నారు. ఏమీ లేక అనుభవించలేని వారు కొందరైతే, అన్నీ ఉండి అనుభవించలేనివారు చాలామంది. ఈ కాలపు తత్త్వం ఇది. వైశ్వీకరణ (గ్లోబలైజేషన్) ప్రభావం ఇది. ఇటువంటి సమయంలో మార్గదర్శనం చేసేవాడు స్పష్టమైన విధానాన్ని కలిగి ఉండాలి. అందుకే ఆధునిక కాలంలో జ్యోతిష్కుని పాత్ర మరింత విస్తృతం అయింది.

విద్య, వైద్యం, ఉద్యోగం, సామాజిక ఇబ్బందులు, ప్రభావాలలో ఎన్నో నూతనమైన మార్పులు వచ్చాయి. సాంఘిక జీవనవిధానంలో ఎన్నో ప్రత్యేకమైన మార్పులు చోటుచేసుకున్నాయి. రాజకీయ, ఆర్థిక జీవనం ఒత్తిడులను అధికం చేసింది. సౌకర్యాలు అధికమైనట్లుగానే సమస్యలూ అధికమైనాయి. వైద్యశాస్త్రం అభివృద్ధి అయిన దానికన్నా రోగాలు అధికమైనాయి. ప్రకృతికి మనిషి క్రమంగా

దూరం కావడమే ఇందుకు కారణం. ప్రకృతిని అనుసరించే మార్గం తెలుసుకొని ప్రవర్తింపజేయడమే నేటి జ్యోతిష్కుని బాధ్యత. వ్యక్తి ప్రకృతిని ప్రస్తుత సమాజానికి అనువర్తింపజేస్తూ దశా సమయాలను గుర్తించి సరియైన విధంగా దిశాదర్శనం చేసేవాడు జ్యోతిష్కుడు.

ఈ ఇబ్బందులను విశ్లేషించాలంటే ప్రస్తుతకాలంలో జ్యోతిష్కునికి కేవలం జ్యోతిషశాస్త్రం మాత్రం తెలిస్తే సరిపోదు. సమాజ అవగాహన అధికంగా ఉండాలి. మనస్తత్వ విశ్లేషణ అధికంగా తెలిసి ఉండాలి. దానివల్లనే సరియైన ఫలితాలను వివరించడం సాధ్యం అవుతుంది. ప్రస్తుత సమాజంలో చదువులను, వానిలోని విభాగాలను జ్యోతిష్కుడు తెలుసుకొని ఉండాలి. పాశ్చాత్య దేశాలకు అందరూ తరలుతున్న నేపథ్యంలో ఆ యా అంశాలకు సంబంధించిన అవగాహన ఉండితీరాలి. వైద్యంరీత్యా ఎన్నో రోగాలు వస్తున్న ప్రస్తుతకాలంలో వైద్యం, వైద్య విభాగాలను గ్రహరాశులకు అన్వయించగలగాలి. అందుకు ఆ యా అంశాల పరిజ్ఞానం ఉండాలి. ఒక్కమాటలో చెప్పాలంటే విద్య, వైద్య, ఉద్యోగాది అంశాలన్నింటిపై అవగాహన ఆధునిక జ్యోతిష్కునికి అత్యవసరం. చెప్పే విషయాన్ని అడిగేవాని మనస్సుకు చేరేటట్లుగా చెప్పి ధర్మాన్ని ఆచరించేటట్లు, మనస్సును ఒత్తిడులనుండి దూరం చేసుకునేవిధంగా ప్రోత్సహించాల్సిన అవసరం ఉంది. ఈ ఒక్క మార్పువల్ల అన్నిరంగాలలోని వారు కూడా తమ జీవనాన్ని ఆనందంగా, మరొకరికి స్ఫూర్తిదాయకంగా గడుపుతారు.

జ్యోతిస్సులు అందించే సందేశాన్ని జాగ్రత్తగా విశ్లేషించి కొత్తతరానికి వివరించగలిగితే వారు సమయానుకూలమైన నిర్ణయాలు సక్రమంగా తీసుకుంటారు. నిజానికి జ్యోతిష విశేషాలు పుట్టినప్పుడే తెలుసుకొని లైఫ్‌ను ప్లాన్ చేసుకోగలిగినా, పెరుగుతున్న అవసరాల రీత్యా తాత్కాలికమైన నిర్ణయాలు అత్యధికంగా తీసుకోవలసిన ఆవశ్యకత పెరుగుతుంది. అటువంటప్పుడు దశ,

అంతర్దశ, విదశలనన్నీ పరిశీలిస్తూ ఫలితాలను చెప్పాలి. అందుకే జ్యోతిష్కుని ఎప్పటికీ వారు కలుస్తూ ఉండాలి.

ప్రతి ఆరుమాసాలకు ఒకసారి జ్యోతిష్కుని కలవడం ఈ సమాజంలో అత్యవసరం అనిపిస్తుంది. ఇది ఒకరకంగా వైద్యంలోని జనరల్ చెకప్ వంటిది. ప్రత్యేకమైన నిర్ణయాలు తీసుకుంటున్నప్పుడు జ్యోతిష్కుని అవసరం తప్పనిసరి. ఈవిధంగా రెగ్యులర్‌గా కలవడం వల్ల ఆ జాతకంపై ప్రత్యేకమైన దృష్టిని ఏర్పరచుకుని తదనుగుణంగా, వచ్చిన వ్యక్తి జీవితవిధానానికి సరియైన మార్గాన్ని జ్యోతిషశాస్త్రరీత్యా వెదికి నిర్ణయాలను తెలియజేస్తాడు జ్యోతిష్కుడు. అంతేగాక తాము నమ్మిన ఒక్క జ్యోతిష్కుని వచనాలను మాత్రమే ఎప్పటికీ అనుసరించడం మంచిది. ఒక జాతకాన్ని పదిమందికి చూపించడం వల్ల అనేకులు అనేక రకాలైన కోణాలలో ఫలితాలను చెప్తే ఏం చేయాలనేది అర్థం కాక వ్యక్తి ఇబ్బందులను కొని తెచ్చుకున్నవాడై జ్యోతిష్కుని నిందిస్తుంటాడు. అందువల్ల ఫ్యామిలీ డాక్టర్ లాగా ఫ్యామిలీ ఆస్ట్రాలజర్‌ను ఏర్పాటు చేసుకోవడం శ్రేష్ఠం. ఫ్యామిలీ డాక్టర్ రోగం వచ్చినపుడు వచ్చి ఆ శరీర తత్వానికి అనుగుణంగా మందు ఇచ్చి వెళ్ళినట్లే **ఫ్యామిలీ ఆస్ట్రాలజర్** వ్యక్తికి సరియైన కాలంలో సరియైన మార్గనిర్దేశం చేయగలడు. ఇంకా ప్రత్యేకంగా **ఫ్యామిలీ ఆస్ట్రాలజర్** ద్వారా శరీర అనారోగ్యాలు ముందుగా తెలుసుకుని, నివారణ మార్గాలు, రోగనిరోధక శక్తిని పెంచుకునే మార్గాలు మొదలుపెడితే ఫ్యామిలీ డాక్టర్ సంప్రదింపు కూడా తగ్గిపోవచ్చు. రోగం వచ్చిన తరువాత డాక్టర్‌ను సంప్రదించి వైద్యం చేసుకుని ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా బలహీనం కావడం కన్నా జ్యోతిష్కుని ఎప్పుడూ సంప్రదిస్తూ ముందుజాగ్రత్తలు తీసుకుంటే ఆనందమే అంతర్యామి అవుతుంది. **ఫ్యామిలీ ఆస్ట్రాలజర్**ను ఏర్పాటుచేసుకోవడం కన్నా ఫ్యామిలీలో ఒకరైనా ఆస్ట్రాలజర్ ఉండే వారి జీవితం మరెంత ఆనందంగా ఉంటుందో

కదా! మూఢత్వానికి లొంగకుండా, విషయాన్ని శాస్త్రీయ విశ్లేషణతో, సమగ్రమైన జీవితాన్ని సమయానుకూలంగా గడపడానికి తగిన సూచనలనిచ్చేవాడు ఆధునిక జ్యోతిష్కుడు. ఈ బాధ్యత గురుతర బాధ్యత.

రోగం వచ్చిన తర్వాత వైద్యం చేయించుకోవడానికి లక్షలాదులు వెచ్చించడం కన్నా రోగం రాకుండా జాగ్రత్తలు తీసుకోవడమే మిన్న. Prevention is better than cure భావన అందరూ అర్థంచేసుకొని మనుగడ సాగించాల్సిన అవసరం ఉంది. జ్యోతిష్కునికిది తప్పనిసరి.

## జ్యోతిషం - ఇతర శాస్త్రాలతో అనుబంధం

జ్యోతిష పరిశోధనలే ఎన్నో శాస్త్రాల ఆవిర్భావానికి మూలం కావడం వల్ల అన్ని శాస్త్రాలకు జ్యోతిషానికి ప్రత్యేక అనుబంధం ఉండితీరుతుంది. దాన్ని గుర్తించి ముందుకు వెళ్ళడం అత్యంత అవశ్యకం. మనం ఉపయోగించే భాషలోని చాలా శబ్దాలకు జ్యోతిష మూలాలున్నాయి. వాటిని ప్రస్తుతం వెదికి తీయాల్సిన అవసరం ఉంది. ఆంగ్లంలో మాసాన్ని Month అని పిలుస్తుంటాం. ఇది Moonth అనే పదం నుండి వచ్చింది. చంద్రుడు ఒకసారి తిరిగి రావడానికి పట్టే కాలం ఇది అని అర్థం. మూన్ అంటే చంద్రుడు. సంస్కృతంలోనూ దీనికి సమానార్థంగా మాన అనే శబ్దాన్ని వాడుతారు. ప్రమాణంలోని మాన శబ్దం, కొలమానం, సమానం, అనుమానం మొదలైన అన్నిచోట్ల ఉపయోగించే మాన శబ్దం కొలతకు వినియోగపడేదే. కాలాన్ని మానంలోనే కొలుస్తున్నారు. సాయనమానం, సౌరమానం, చాంద్రమానం మొదలైనవి. ఇట్లా ఆలోచిస్తే మూలంలో భాషలపై ప్రభావం చూపించేది జ్యోతిషమేనని అర్థం అవుతుంది. శుక్ర శబ్దంనుండి ఏర్పడినదే చుక్క, గురు శబ్దం నుండి ఏర్పడిందే గౌరవం. గురుతరం. చెట్లలో పిండిపదార్థాలు ఏర్పడడానికి చేయవలసిన క్రియే కిరణ

జన్య సంయోగ క్రియ. ఇక్కడ కిరణజన్యమనేది జ్యోతిషభావమే. రోదసి నుండి మనకు వచ్చేది రౌద అవుతుంది.

కేవలం భాషాశాస్త్రమే కాకుండా ప్రస్తుత కాలంలో చరిత్రనిర్మాణానికి జ్యోతిషం అతి ముఖ్యమైన ఆధారం అవుతుంది. అయనాంశల రీత్యా వేరు వేరు కాలాల్లో ఉన్న నక్షత్రాది వివరాలను గుర్తిస్తూ వాటికి అనుగుణంగా సాహిత్యాదులను గమనించి కాల ఒక చారిత్రకాంశ కాలనిర్ణయం సాధ్యం అవుతుంది. వేదకాల నిర్ణయానికి బాలగంగాధర తిలక్ పండితుని నిర్ణయం అంతా జ్యోతిషంలోని అయనాంశ సంబంధమైన వివరణే.

## సాహిత్యం - జ్యోతిషం :

సాహిత్యం అంతా జ్యోతిర్మయమే కావడం మరో ప్రత్యేక విశేషం. వేరు వేరు నక్షత్రాదుల ఆకృతులు, అధిదైవాలు, ఉదయాస్తమయాలను దృష్టిలో పెట్టుకొని వేరు వేరు దేవతా ప్రతిరూపాలు ఏర్పడినాయి. శివునికి వాహనం నంది ఎందుకైనాడో జ్యోతిషం మాత్రమే వివరించగలదు. ఆకాశంలోని వృషభం, మిథున రాశుల అవగాహన దీనికి సంబంధించినదే. 360 డిగ్రీల క్రాంతి చక్రంలో కేవలం 180 డిగ్రీలు మాత్రం మనకు కనిపిస్తుంది. దానిలో తూర్పువైపున ఆకాశంలో ముందు వృషభరాశి (నంది) తరువాత మిథున రాశి (పార్వతీ పరమేశ్వరులు) ఉదయిస్తే వృషభం మిథునరాశివారికి లాంఛనంగా, జండాగా కనిపిస్తుంది. పశ్చిమంవైపు అస్తమిస్తున్న సమయంలో ముందు వృషభం అస్తమిస్తూ దానిపై మిథునం ఉన్నప్పుడు గమనిస్తే వృషభంపైన పార్వతీపరమేశ్వర స్వరూపం ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే వృషభమే శివునికి వాహనం అయింది. ఈ భావన కలగడానికి జ్యోతిష మండలాలలోని రాశిచక్రం మాత్రమే కారణం అవుతుంది.

అదేవిధంగా శక్తి స్వరూపానికి సింహవాహనమెందుకో జ్యోతిషం మాత్రమే చెపుతుంది. సింహం కన్యా రాశుల ఉదయాస్తమయాలను గుర్తు చేసుకోవాలి. సింహం కన్యకన్నా ముందుండడం వల్ల కన్యారాశి ఉదయించినపుడు సింహం లాంఛనంగా, అస్తమించేటపుడు సింహవాహనగా కనిపిస్తుంది. ఇక్కడ కన్యారాశి శక్తిస్వరూపమైన అమ్మవారికి ప్రతీకగా పురాణాలు పరిగణించాయి.

శివునికి మన్మథుడు ఎందుకు శత్రువో జ్యోతిషమే వివరిస్తుంది. మిథునరాశి శివునికి, ధనుస్సు రాశి పుష్పధనుర్ధారి అయిన మన్మథునికి ప్రతీక అని గుర్తిస్తే మిథునరాశి ఉదయించే సమయంలో పశ్చిమాకాశంలో ధనుస్సు రాశి అస్తమిస్తుంటుంది. శివుడు ఉదయించి మన్మథున్ని చంపిన భావన ఈ ఉదయాస్తమయాలలోని రాశుల వల్ల కలిగి ఆ కథ విస్తృతి చెందింది. ఇక్కడే మరో అంశం గుర్తుకు తెచ్చుకోవాలి. సూర్యుడు మిథునంలో సంచరించే సమయంలోనూ, ధనుస్సురాశిలో సంచరించే సమయంలోనూ మన పంచాంగాలు (ఆషాఢ, పుష్యమాసాలు) శూన్యమాసాలుగా సూచనలు చేశాయి. ఈ సందర్భాలలో మిథునరాశి, ధనుస్సురాశి ఉదయాలలో ప్రకృతిపై ఒక చక్కని ప్రేమ, కాముక స్వభావం ఏర్పడుతుంది. ఆ రాశుల పేర్లలోనే మైథున, మన్మథ భావాలు కనిపిస్తున్నాయి. అటువంటి రాశులలో రవి సంచారం వల్ల ఈ భావాలపై బలమైన వ్యతిరేక ముద్ర ఏర్పడుతుంది. అందువల్ల ఈ మాసాలను మనవారు శూన్యమాసాలుగా నిర్ణయించి ఆ సమయాలలో అనవసరమైన శారీరక అంశాలకు తావివ్వకుండా ఆధ్యాత్మిక ప్రగతికోసం చేసే కార్యక్రమాలకు ప్రాధాన్యమిచ్చారు. ఈ అంశాన్ని గమనిస్తే భారతీయ విజ్ఞానం ఎంతజాగ్రత్తగా, లోతుగా పరిశీలించి ఆచరించబడుతుందో మనకు అర్థమవుతుంది.

కుమారస్వామి కృత్తికా నక్షత్ర సంభూతుడు కావడం వల్లనే

కార్తికేయుడైనాడని, ఆరునక్షత్రాలు కలిగిన కృత్తికా నక్షత్రం కావడం వల్లనే షణ్ముఖుడైనాడని అర్థం చేసుకుంటే ఈ సాహిత్యం వెనుకనున్న విషయాలను అవగాహన చేసుకోవచ్చు. ఇటువంటి కథలు కోకొల్లలు. రాహుకేతువుల ఏర్పాటుకు సంబంధించిన గ్రహణాల కథ, అయనాంశ గూర్చి తెలిపే ధ్రువుని గాథ, నరకాసుర వధ, దక్షయజ్ఞధ్వంసం, మహాభారత కథార్థాలు, తులారాశి గూర్చి వివరించే శిబి చక్రవర్తి గాథలు మొదలైన వెన్నో కథలకు ఆకాశంలోని జ్యోతిర్మండలాలు మూలం. ఆ జ్యోతిర్మండలాల గూర్చి పరిపూర్ణంగా అధ్యయనం చేస్తే భారతీయ వైజ్ఞానిక ప్రగతి కూడా అర్థం అవుతుంది. ఈ అంశంపై ఇప్పటికే పిహెచ్.డి., పరిశోధనకూడా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జరిగి ఆ పుస్తకం **"జ్యోతిర్మయం వాఙ్మయం"** అనే పుస్తక రూపంలో వెలుగులోనికి వచ్చింది.

ఇట్లా వాతావరణశాస్త్రం, వైద్యం మొదలైన శాస్త్రాలన్నీ జ్యోతిషంతో అనుబంధం కలిగిన శాస్త్రాలే. ఇతర శాస్త్రాలతో అనుబంధం కలిగిన ప్రతి వ్యక్తి జ్యోతిషాన్ని కూడా నేర్చుకుంటే ఆ రెండుశాస్త్రాల మధ్య సంబంధాన్ని పరిపూర్ణంగా గుర్తించి వైజ్ఞానికంగా విశ్లేషించే అవకాశం ఉంటుంది.

జీవులు తమ ప్రాణరక్షణకు ఒక్కో కాలంలో, ఒక్కోదిక్కు ఒక్కోప్రదేశం శ్రేయోదాయకమని సహజంగా గుర్తిస్తాయి. దిక్కుకు సంబంధించిన అంశాలు, ప్రదేశానికి సంబంధించిన వివరాలు వాస్తుశాస్త్రంగా రూపుదిద్దుకున్నాయి. కాలస్వరూపం అర్థం చేసుకునే ప్రయత్నం వివిధ భౌతికశాస్త్రాల అన్వేషణకు దారి తీసింది. ఈ శాస్త్రాలన్నీ జ్యోతిష్కుల పరిశోధన వల్ల ఏర్పడిన శాస్త్రాంతర్భాగ విశేషాలే. సూర్యుని నుండి ఇతర నక్షత్ర గ్రహాల నుండి వెలువడే కాంతిని పరిశీలించే సందర్భంలో కాంతిశాస్త్రం, వివిధ కాంతి తరంగాలు, ఆకర్షణ, వికర్షణలు గమనించే సందర్భంలో అయస్కాంతశాస్త్రం, భూభ్రమణ, పరిభ్రమణాలను పరిశీలించేటపుడు ఏర్పడుతున్న శక్తులకు సంబంధించి

శక్తిశాస్త్రం, ఆకాశంలోని గ్రహ, నక్షత్ర స్వరూప వర్ణనలు చేసే సందర్భంలో ఖగోళశాస్త్రం, వివిధ ఆవృత్తులు, చంద్రుని కక్ష్యలు, గ్రహకక్ష్యలు, అవి సూర్యుని చుట్టూ పరిభ్రమించడానికి పట్టే సమయాలను లెక్కగట్టేటపుడు గణితశాస్త్రం, భూ పరిశోధనా సందర్భంలో భౌగోళిక విజ్ఞానం మొదలైనవన్నీ నేడు ప్రత్యేక శాస్త్రాలుగా అధ్యయనం చేయబడుతున్నాయి.

కాంతుల ఆధారంగా ప్రభావాలు ప్రకృతిపైన, జీవరాశులపైన చూపించే ప్రభావాలను గూర్చి పదార్థ విజ్ఞానం, వివిధ వృక్షాలపై వాని ప్రభావం, అవి మానవునికి ఉపకరించే సందర్భంలో ఆయుర్వేదం, వృష్టికి సంబంధించి వర్షపాత విజ్ఞానం, కాంతుల వల్ల స్పందించిన జీవులు వెలువరించే ధ్వనుల నుండి సంగీతం, సూక్ష్మీకృత కాంతి పరిశీలించేటపుడు రత్నశాస్త్రం, గొంతుకనుండి స్వరం బయటకురావడం ద్వారా తగ్గే రోగాలను గూర్చి మంత్రశాస్త్రం, అన్నింటిని గుర్తించి సూక్ష్మీకృతకాంతి మనస్సుగా మారి అది గుర్తించే స్థితుల ననుసరించి మనస్తత్వశాస్త్రం - ఈవిధంగా ఎన్నో కోణాలలో పరిశీలించే ప్రయత్నంలో ఇవన్నీ శాస్త్రాలుగా వెలుగు చూశాయి.

విజ్ఞానం విధ్వంసాలకు గురవుతున్న కాలంలో జ్యోతిష విజ్ఞానం మాత్రం సర్వవిజ్ఞానాలకు మూలమై మానవుని పురోభివృద్ధిని కోరుకుంటూ, జ్యోతిస్సులను తదనుగుణంగా నడిచే ప్రకృతిని ఒక క్రమంలో ఉపయోగించుకునే విధానాన్ని వివరిస్తుంది.

## కాలక్రమంలో జ్యోతిషం

వ్యక్తి యొక్క ఆలోచనలకు మూలమై అనేక వైజ్ఞానిక శాస్త్రాంశాలు ఏర్పడడానికి కారణమైన జ్యోతిషపరిశోధనల్లో ముందుగా సిద్ధాంతభాగాన్ని గూర్చిన పరిశోధనలు అపరిమితంగా జరిగాయి. ఈ సిద్ధాంతభాగంలో

కాలస్వరూపం గూర్చిన చర్చ బాగా కనిపిస్తోంది. యుగం, సంవత్సరం, అయనం, ఋతు, మాస, దిన ఘటికాది ప్రమాణాల గూర్చిన వివరాలున్నాయి. అదేవిధంగా చాంద్ర, సౌర, సావన, నాక్షత్రాది మానాల పరిచయం ఉంది. వేరు వేరు మానాల ఉపయోగంతో పాటు అధికమాసం, క్షయమాసం ఏర్పడే విధానచర్చ కనిపిస్తోంది. ఉత్తరాయణం, దక్షిణాయనం సంవత్సరంలో ఏ మాసంలో, ఏ పక్షంలో, ఏ తిథిలో ఏర్పడు తుంటాయనే అంశాలు ప్రారంభ కాలంలో విశదంగా కనిపిస్తాయి.

దిగ్దేశకాలాల సమగ్ర, పరిపూర్ణ అవగాహనే జ్యోతిషంగా భావించ బడుతుంది. మొదట్లో నక్షత్ర, తారకల ఖగోళ, భూగోళ జ్ఞానమే జ్యోతిశ్శాస్త్రం. దృష్టి, పర్యవేక్షణల ద్వారా నక్షత్రాలను గమనించడం ఆ కాలంలో జరిగింది. వేదాలలోని అనేక మంత్రాలలో సూర్యచంద్రాదుల గూర్చి, వివిధ నక్షత్రాలు, నక్షత్ర మండలాలు, కాలం, రాత్రింబవళ్ళు, అయనాలు మొదలైన వానిని గూర్చిన వివరాలున్నాయి. ఆర్షవాఙ్మయమైన బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు మొదలైన వానిలో నక్షత్రాల ఆకృతి, గుణాలు వీని ప్రభావాలు జ్యోతిశ్శాస్త్ర విషయాలుగా భావింపబడ్డాయి.

మానవుడు తన పరిశీలనలో భాగంగా ఒకానొక నక్షత్రం తూర్పున సూర్యుని కన్నా ముందు ఉదయించినపుడో లేదా సూర్యాస్తమయం తర్వాత కనిపించినపుడో గుర్తించాడు. ఆ సందర్భంలో ప్రకృతిలో జరిగే మంచి, చెడులను అవగాహన చేసుకొన్నాడు. మళ్ళీ కొంతకాలానికి అదే నక్షత్రం అదేప్రాంతంలో కనిపించడం, మళ్ళీ ప్రకృతిలో అవే మార్పులు కనిపించడంవల్ల అతని ఆలోచనా విధానాలు శాస్త్రవాఙ్మయంవైపు దారితీసి నూతనావిష్కరణలు ఎన్నో జరిగినాయి. ఇటువంటి ఆవృతుల మధ్యకాలం గమనించడం, వాటికి సంబంధించిన లెక్కలువేయడం గణితశాస్త్రావిర్భావానికి దారితీసింది. కాలమానానికి

సంబంధించిన అన్ని విశేషాల కూలంకష పరిచయానికి జ్యోతిశ్శాస్త్ర అన్వేషణే మూలమైంది. ఇటువంటి ఫలితాంశాల సంబంధ వివరణకు వేదంలోని కొన్ని వాక్యాలు ఉదాహరణలుగా కనిపిస్తున్నాయి. వేదంలోని పురుషసూక్తంలో **'చంద్రమామనసో జాతః, చక్షో స్సూర్యో అజాయత'** అనే మంత్రం ద్వారా మనః కారకుడు చంద్రుడుగా, నేత్రకారకుడు సూర్యుడుగా సూచించడం జరిగింది. **'సూర్య ఆత్మా జగతస్తస్తుషశ్చ'** అనే స్మృతి వాక్యాల ద్వారా జగతికి, మానవునికి సూర్యుడు ఆత్మకారకుడని అర్థమవుతుంది.

సూర్యుడు ప్రత్యక్షంగా పరోక్షంగా చైతన్య కారకుడైతే చంద్రుడు కూడా వ్యక్తిపై, మనసుపై ప్రభావాన్ని అధికంగా కలుగ జేస్తున్నాడు. భూమిపై మూడువంతుల నీరు, ఒకవంతు భూభాగం ఉంది. చంద్రుడు భూమికి ఉపగ్రహంగా ఉండి వృద్ధిక్షయాదులు పొందుతున్నాడు. ఈ సమయంలో పౌర్ణమినాటి నిండు చంద్రుడు అమావాస్యనాడు కనిపించకుండా పోతున్నాడు. సముద్రాలలో మామూలు రోజుల్లో కన్నా ఈ రెండు రోజులు అధికమైన ఆటుపోటులు వస్తుండడం అందరికీ ప్రత్యక్షమే. దీనికి కారణం సూర్యచంద్రుల ఆకర్షణశక్తి భూమిపైన అధికంగా ఉండడమే.

భూమిపైన ఉన్నట్లుగానే శరీరంలో కూడా మూడువంతుల నీరు ఉంది. అమావాస్య పౌర్ణమి రోజుల్లో వాటి గమనశీలం పెరుగుతుంది. వాటిద్వారా రక్త ప్రసారం అధికమవుతుంది. అది మనసులోని ఉద్విగ్నతను పెంచడం, క్రమపరచడం, తగ్గించడం చేస్తుంది. ఈ విధంగా చంద్ర, సూర్యుల ప్రభావాలు జీవులపై ప్రకృతిపై గమనించిన తరువాత నక్షత్రాలు, రాశులు, గ్రహాలు వివిధ సమయాలలో పుట్టిన వ్యక్తుల స్వరూపస్వభావాలు, వాటిలోని సామ్యం, వైరుధ్యం అన్నింటినీ అర్థంచేసుకొని వాటిని సూత్రీకరించడం జరిగింది. అప్పుడే ఫలిత జ్యోతిషం ఆరంభమైంది.

మొదట సిద్ధాంత, ఫలిత భాగాలుగా ఉన్న ఈ జ్యోతిషం తరువాతి కాలంలో స్కంధ త్రయాత్మకం (సిద్ధాంత,సంహిత, హోర) గా గుర్తించబడింది. తరువాత పంచస్కంధసమ్మితం (సిద్ధాంత, సంహిత, హోర, ప్రశ్న, శకున) గా గుర్తించబడింది. వీనిలో సిద్ధాంత మంటే గణితభాగం – తిథి వార నక్షత్ర యోగ కరణాలు సూర్య చంద్రుల మధ్యదూరంపై ఆధారపడి ఉంటాయి. అవి గణన చేసే విధానం, గ్రహగతులకు సంబంధించిన ఇతర వివరాలు, కాలంలో త్రుటి నుండి కల్పకాలం వరకు కాలగణన, దిగ్దేశ కాలాలను తెలుసుకునే వివిధ పద్ధతులు వీటిలో మనకు కనిపిస్తాయి.

**సంహిత** అనగా కూర్చబడినది. అనేకరకాల వైజ్ఞానికాంశాల కూర్పును సంహిత అంటాం. దీనిలో అనేక శాఖలు నేడు కనిపిస్తున్నాయి. ప్రస్తుత కాలంలో గోచారం, వాస్తు, ముహూర్త, సాముద్రిక, వృష్టి, శాంతి, స్వప్న, రత్న, భూగర్భవస్తు అనే భాగాలుగా ఈ సంహితాభాగం అధ్యయనం చేయబడుతుంది. ఒక్కో భాగంలో ఎన్నో ఉప విభాగాలతో ఈభాగం అతి విస్తృతంగా, విజ్ఞానసర్వస్వంగా మనకు కనిపిస్తుంది.

ప్రస్తుతకాలంలో ప్రముఖంగా వినిపించే జాతక విశ్లేషణ హోరాశాస్త్రం లోనిది. హోర పదమే ఆంగ్లంలో Hour గా మారింది. ఆధునిక కాలంలో జ్యోతిషమంటే కేవలం వ్యక్తి జీవనగమనాన్ని, శుభాశుభ ఫలితాలను సూచించే శాస్త్రంగా ఫలిత భాగమే గుర్తుకు వస్తుంది. మనిషి జీవితంలోని కష్టసుఖాలు, లాభనష్టాలన్నింటినీ జాతకచక్రంలోని ద్వాదశభావాలు, రాశులు, వానిలోని గ్రహాలు, దృష్టులు మొ॥వాని ఆధారంగా చేసుకొని ఫలితం నిర్ణయించే జ్యోతిష భాగమిది.

తాత్కాలికంగా అప్పటికప్పుడు సమస్యల ఫలాన్ని చెప్పడానికి ఉపకరించే శాస్త్రం **ప్రశ్నశాస్త్రం.** అనుకోనిది ఏదో జరుగుతున్నప్పుడు, జరుగబోయే ముందు

ప్రకృతి, సకల జీవులు స్పందిస్తాయి. ఆ స్పందనల నిరంతర అధ్యయనం, సూక్ష్మీకృతపరిశీలనం ద్వారా అది ప్రత్యేక శాస్త్రంగా రూపుదిద్దుకుంది. దీనికే **శకునం లేదా నిమిత్తశాస్త్ర**మని పేరు.

**'విశ్వచక్రం'** లోని 16 డిగ్రీలు మాత్రమే మనకున్న సూర్యుడు, ఇతర గ్రహాలు పరిభ్రమించే ప్రదేశం. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ తిరగడం వల్ల, ఆకాశంలోని కొన్ని ప్రత్యేకమైన గుర్తులు మైలురాళ్లలాగా మనకు ఉపయోగపడ్డాయి. ఒక నక్షత్రం ఒక ప్రత్యేకమైన ప్రాంతంలో గమనించి, మళ్లీ అదే చోటికి రావడానికి మధ్యగల కాలాన్ని గణించడం ద్వారా కాలం యొక్క గణనకు, దాని ప్రాధాన్యం తెలపడానికి జ్యోతిర్గోళాలు మాత్రమే హేతువులైనాయి. ఈ 'భచక్ర' మార్గంలో 27 నక్షత్రాలను ప్రత్యేకంగా ఎన్నుకుని వాటికి అనుగుణమైన పేర్లు పెట్టడం వైదిక చింతనలోనే జరిగింది. అవే అశ్విన్యాది నక్షత్రాలు. ఈ 27 నక్షత్రాలను మరిన్ని గుంపులుగా చేసే ఉద్దేశ్యంతో 12 రాశులుగా విభాగించడం జరిగింది. అవి మేషాదిరాశులు. ఆయా రాశులను, నక్షత్రాలను గుర్తులుగా భావిస్తూ, ఆయా ప్రాంతాలలో భూమిగాని ఇతర గ్రహాలు గాని సంచరిస్తున్నప్పుడు ప్రకృతిని పరిశీలించడం జ్యోతిశ్శాస్త్రంలో భాగమైంది.

వేదాలలో మొదలై పురాణ తంత్రాలలో వెలుగు చూసి జ్యోతిషం తన ప్రత్యేకతను వ్యక్తీకరించింది. వేదాంగంగా ప్రత్యేకశాస్త్రమైంది. వేదాలు కార్య స్వరూపమైన [illegible]లను, కాలస్వరూపమైన యజ్ఞాలను చేయాలని తెలియజేశాయి. యజ్ఞాలు చేయడానికి కాలం మూలం. అందుకే జ్యోతిషం [illegible]లవిధానశా[illegible]చబడింది. [illegible]్యోతిషం సరియైన విధంగా అర్థం చే[illegible]ంటే [illegible]వమైన, కాలస్వరూపమైన యజ్ఞాన్ని అర్థం చేసుకున్నట్టే.

ఒక శాస్త్రీయమైన విషయం ప్రజల్లోకి పూర్తిగా చేరిన తరువాత దాని ప్రభావాన్ని సాధారణంగా అందరూ గుర్తించడం జరుగుతుంది. ఒకవేళ అది ప్రభావం చూపలేకపోయి నట్లయితే దాన్నెవరూ ఆచరించరు, ఆదరించరు, అనుసరించరు. శాస్త్రం పరిశోధించవలసిన అవసరం ఇక లేదనిపించి, గమనించిన విషయం పూర్ణజ్ఞానమనే స్థితికి వచ్చినపుడు అది నమ్మకంగా పరిణమిస్తుంది. ఈ విషయాలనే తమ తర్వాతి తరాల వారికి పూర్వులు అందజేస్తుంటారు. ఆయా విషయాలు నిత్యజీవన వ్యవహారంలోనూ, వ్యవసాయంలోనూ, వివిధ వృత్తులలోనూ అన్నింటిలోనూ అంతర్గతంగానో, బహిర్గతంగానో తెలుస్తూనే ఉన్నాయి. వాటిని విశ్లేషిస్తూ వచ్చే నూతన అధ్యయనాలు ప్రస్తుత సమాజానికి అవసరం.

## జ్యోతిషం - విభాగాలు

జ్యోతిషంలోని ముఖ్యవిభాగాలు -

1. సిద్ధాంతం 2. హోర 3. సంహిత 4. ప్రశ్న 5. శకున

### సిద్ధాంత భాగం :

సిద్ధాంత భాగ ప్రయోజనం పంచాంగ గణన. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలు పంచాంగాలు. ఇవే కాక గ్రహణం తదితర అంశాలు కూడా ఈ గణితంలో భాగాలే. ఇది గణితమనే పేరుతో పిలువబడుతుంది. తంత్రభాగమంతా గ్రహగతులకు సంబంధించినదే. గ్రహాల మధ్యగతి, తిథి నక్షత్రచ్ఛేదాలు, స్ఫుటగతి, త్రిప్రశ్న, చంద్రసూర్యగ్రహణాలు, ఉదయాస్త మయాలు, శృంగోన్నతి, సమాగమం, తారాగ్రహసంయోగం మొదలైన విషయాలు తంత్రంలోని అంశాలు. గ్రహాల గతుల్లో వక్రాది విషయాలు ఈవిభాగంలో వివేచించబడతాయి.

# జ్యోతిషం

- సిద్ధాంత
  - గణిత
  - కరణ
  - యంత్ర
  - పంచాంగ
  - తంత్ర
- శకునం
  - పశు,పక్షి
  - మనుష్య
  - ప్రకృతి
- హోర
  - తాజక
  - నాడి
  - జాతక
    - పరాశర
    - యవన
    - సత్యాచార్య
    - జైమిని
    - పాశ్చాత్య
- ప్రశ్న
  - స్వర
  - కాల
  - వాక్య
- సంహిత
  - సాముద్రిక
    - తిలక
    - అంగ
    - ముఖ
    - పశు
    - హస్త
  - భూగర్భవస్తు
    - జల
    - ధన
    - లోహ
  - ముహూర్త
  - వాస్తు
    - ఆలయ
    - శిల్ప
    - గృహ
    - యంత్ర
  - గోచార
    - వ్యక్తి
    - దేశ
  - శాంతి
  - రత్న
  - వృష్టి
    - సద్యోవృష్టి
    - ప్రవర్షణ
  - స్వప్న
    - పాశ్చాత్య
    - ప్రాచ్య

త్రుటినుండి అనంతం వరకు కాలగణన, వేరు వేరు కాలమానాలు, గణితం, గ్రహ గణితం, యంత్ర విశేషాలు మొదలైనవన్నీ ఈ సిద్ధాంతస్కంధంలో భాగంగా అధ్యయనం చేయడం జరుగుతుంది. గణిత విభాగం గ్రహగణితం, పాటీగణితం, బీజగణితాలనే మూడు విభాగాలైంది. బ్రహ్మ, వశిష్ఠ, సోమ, సూర్యాదులు ఈ స్కంధ ప్రవర్తకులు. తరువాతి కాలంలో ఆర్యభట, బ్రహ్మగుప్త, వరాహమిహిర, భాస్కరాచార్య, కమలాకర ప్రభృతులు దీనిని విస్తరింపజేశారు. సూర్యసిద్ధాంతం, ఆర్యభటుని ఆర్యభటీయం, బ్రహ్మగుప్తుని బ్రహ్మస్ఫుట సిద్ధాంతం, వరాహ మిహిరుని పంచ సిద్ధాంతిక, భాస్కరుని సిద్ధాంత శిరోమణి, కమలాకరుని సిద్ధాంత తత్త్వవివేకం మొదలైనవి స్కంధ విభాగంలో ప్రసిద్ధి పొందిన గ్రంథాలు. ఇది నేర్చుకోవడానికి చాలా శ్రమ, గణిత పరిజ్ఞానం అవసరమవుతాయి.

## హోరా విభాగం

**హోరాస్కంధం** జాతక, తాజక, నాడీ భేదాలతో మూడుభాగాలుగా కనిపిస్తుంది. ఈ స్కంధం ఫలితజ్యోతిష భాగంగా పేరుపొందింది. హోరాశాస్త్రంలో అనేక ఉప విభాగాలు ఏర్పడ్డాయి. 'తాజకం' అంటే ఒక సంవత్సర ఫలాలను చెప్పడానికి పాశ్చాత్యుల నుండి వచ్చిన శాస్త్ర విధానం. జాతకం–'జ' అంటే పుట్టుక అని అర్థం. పుట్టుక సమయంలోని వివిధ గ్రహనక్షత్రాల సంచార మాధారంగా జాతకం వేసి భవిష్యత్తును సూచించడం, ఫలవివరణ చేయడం దీని ప్రత్యేకత. దీనిలో వివిధ రకాల మార్గాలు చూపినవారు - పరాశార, సత్యాచార్య, జైమిని, యవన, పాశ్చాత్యులు. వీరి ఫలిత విశ్లేషణామార్గాలు విభిన్నంగా ఉన్నప్పటికీ అన్నింటికీ ప్రామాణికత ఉంది. వరాహమిహిరుని 'బృహజ్జాతకం', నీలకంఠుని 'తాజక నీలకంఠి' ఈ విషయంలో ప్రామాణిక గ్రంథాలు.

హోరాస్కంధమంటే జాతక సంబంధమైంది. పితామహ, నారద, వసిష్ఠ కశ్యపాదుల చేత నిర్మించబడ్డ స్కంధమిది. అహోరాత్ర శబ్దంలో ఆద్యంత అక్షరాలు (అ, త్ర) లోపిస్తే 'హోర' అనే శబ్దం ఏర్పడింది. ఇదే ఆంగ్లంలో ఒక గంట కాలపరిమితి గల కాలానికి 'అవర్' గా వికృతి పొందింది. రాశిభేదాలు, గ్రహయోనులు, ఆధానం, జన్మనక్షత్రాల వివేచన, సంవత్సరాది ఫలం, మాసఫలం, గ్రహస్థితి ఫలం, గ్రహదృష్టి ఫలం, అరిష్టం, ఆయుర్దాయం, రాజాదియోగాలు ఈ భాగం నుండి వివేచించ బడినాయి. ఈ హోరాశాస్త్రంలో పరాశరుడు, జైమిని, సత్యాచార్యుడు మొదలైన వారు అధికంగా కృషి చేసి ప్రత్యేకమైన సిద్ధాంతాలను వెలువరించారు. వారి వారి ఫలిత సూచనా విధానాలకు వేరు వేరు మార్గాలున్నాయి. అదేవిధంగా ఆధునిక కాలంలోని కె.పి.పద్ధతి (కృష్ణమూర్తి పద్ధతి) ఈ వరుసలో మరో మార్గం. పాశ్చాత్యులు కూడా హోరాశాస్త్రంలో అధికంగా కృషి చేసి హోరాభాగాన్ని విస్తృత పరిచారు.

12 రాశులు, 9 గ్రహాలు, 12 భావాల వల్ల కలిగే వేరు వేరు కలయికలు, దశావిశేషాలలోనూ, దృష్టులు యుతులు స్థితులు మొదలైన వాని కలయికల వల్ల కలిగే మార్పులను ఈ హోరాశాస్త్రం వివరిస్తుంది. మనోభావాలను వివరించే శాస్త్రం ఇది. మనస్సుల్లో కలిగే మార్పులు, వానికి అనుగుణమైన సమయాలను తెలియజేస్తూ మంచి సమయాన్ని చెడ్డసమయాన్ని సూచిస్తుంటుంది. వ్యక్తి పురోగతికి అవసరమైన సమయాన్ని సూచించడమే కాకుండా ఇబ్బంది కరమైన సమయాన్ని సూచిస్తూ తగు జాగ్రత్తలు నిర్దేశిస్తుంది. వానిని జాగ్రత్తగా అమలు చేసుకుంటూ పోతే జీవితాన్ని ప్రణాళికా బద్ధంగా గడిపే అవకాశం మనిషికి ఉంటుంది. ఈ శాస్త్రం తరువాత కాలంలో వ్యక్తి అవసరాలకు ప్రతీకగా అత్యంత విస్తృతి పొందింది.

ఫలితాలను చెప్పడానికి హోరా విభాగంలో అష్టకవర్గు విధానం, షోడశ వర్గు విధానం, ఆరూఢ చక్ర విధానం అంటూ అనేక పద్ధతులున్నాయి. అదేవిధంగా జైమిని మొదలైన పద్ధతులు కూడా అనేకంగా ఉన్నాయి. వీటన్నింటిలోనూ గ్రహాల యొక్క బలాబలాలను నిర్ణయించడం ప్రత్యేక అంశం. ఆ బలం నిర్ణయించడానికి శాస్త్ర విషయాలను సమగ్రంగా అధ్యయనం చేయాలి. అదేవిధంగా జీవితానికి వేరు వేరు దశలున్నట్లే, జ్యోతిషఫలితాలను దశాక్రమంలో విశ్లేషించి శుభాశుభ కాల నిర్ణయం చేయడానికి కొంత శ్రమ చేయాల్సిన అవసరం ఉంటుంది. అయితే **జాతక విభాగ** అధ్యయనం లోతైనది కాని సాధ్యం కానిది మాత్రం కాదు.

**తాజకం** దీనిలో మరోభాగం. తాజకం ఒక సంవత్సర ఫలితాలకు సంబంధించింది. తాజకం 'వర్షఫల'మనే పేరుతో పిలువబడుతుంది. జన్మకాలంలో రవి ఏ డిగ్రీలో ఉన్నాడో గమనించి, ప్రతిసంవత్సరం మళ్ళీ అదే ప్రదేశానికి రవి వచ్చే సమయాన్ని గుర్తించి ఆ సమయానికి జాతకం వేసుకొని ఫలితాలను చెప్పే విధానం తాజకంలో సూచించబడుతుంది. ఈ ప్రత్యేకవిధానాన్ని తాజకం అంటాం. ఈ వివరాలను బాగా అందించే గ్రంథం నీలకంఠుడు వ్రాసిన తాజక నీలకంఠి. దీనిలో దశలను ముద్దా దశలని అంటారు. ముంథ ఇందులో ప్రత్యేక స్థానంగా ఉంటుంది. తాజక యోగాలు కొన్ని ఉంటాయి. వాటి పేర్లలోనూ వైవిధ్యం అధికం. ఇత్థశాల, ఇందువార, ఇక్కపాల, ఖల్లాసర, రద్ద మొదలైన పేర్లతో ఈ యోగాలుంటాయి. అదేవిధంగా సహమ అనే ప్రత్యేక బిందువులు ఈ తాజకంలో ప్రత్యేకంగా పరిశీలించబడతాయి. ఈ సహమలకు గణితం ఉంటుంది. దశా విశేషాలు కూడా రెండురకాలుగా ఉంటూ అన్నీ కూడా సంవత్సరానికి మాత్రమే ఫలితాన్నిస్తుంటాయి. ఆ సంవత్సరనాథుని నిర్ణయాన్ని బట్టి సంవత్సరం యొక్క ఫలితాంశాలు అధికంగా ఆధారపడతాయి. దీనిలోనూ గ్రహాల దృష్టి, స్థితి

అన్నీ కూడా ప్రత్యేకంగా పరిశీలనాంశాలే. స్నేహదృష్టి, గుప్త స్నేహదృష్టి, వైర దృష్టి, గుప్త వైర దృష్టి అంటూ ఈ విధానంలో ప్రత్యేకంగా దృష్టులుంటాయి. దీనిని నేర్చుకోవడానికి ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

**పాశ్చాత్య పద్ధతి :** కాంతి ప్రభావం అన్ని ప్రాంతాలలోనూ ఆ కాంతి మూలాలను వెతికించడానికి, ఆ కాంతులు తమ జీవితాలపై చూపే ప్రభావాలను పరిశీలించడానికి వేరు వేరు మార్గాలను చూపించాయి. వ్యక్తి యొక్క భవిష్యత్తును అధ్యయనం చేయడానికి పరాశరాదుల మార్గం ఇక్కడివారు చూస్తే పాశ్చాత్యంలో ప్రత్యేక పరిశీలన కూడా ఉంది.

పాశ్చాత్య పద్ధతిలోనూ గ్రహాలు, రాశులు అవే ఉన్నప్పటికీ ఆధునికంగా కనుక్కున్న గ్రహాలైన యురేనస్ (ఇంద్ర), నెప్ట్యూన్ (వరుణ), ప్లూటో (యమ) గ్రహాల ప్రభావ పరిధి కూడా పరిశీలనార్హమే. వారి పరిశీలనలో యురేనస్ కుంభరాశికి, నెప్ట్యూన్ మీనరాశికి, ప్లూటో వృశ్చికరాశికి అధిపతులు. ఈ ఆధిపత్యాల విషయమే కాకుండా పాశ్చాత్య పద్ధతిలో పరిశీలనకు దశలుండవు. దశలు లేకుండా కాలనిర్ణయం చేయడానికి వారు పురోగామి జాతకం (ప్రొగ్రెస్డ్ హారోస్కోప్) పై ఆధారపడతారు. ఒకరోజు ఒక సంవత్సరానికి సమానం అనే సిద్ధాంతం ప్రకారం పుట్టిన సంవత్సరం నుండి వ్యక్తి ఎన్ని సంవత్సరాలకు ఫలితం అవసరమవుతుందో చూసుకొని – పుట్టినరోజు తర్వాత అన్ని రోజులకు, అదే పుట్టిన సమయానికి జాతకచక్రం వేసుకొని ఫలితాలను గమనించాలి. ఈ చక్రంకూడా సాయన జాతక చక్రంగా పరిశీలించాలి. నిరయన చక్రానికి అయనాంశ కలిపితే సాయన చక్రం వస్తుంది. లేదా అమెరికన్ ఎఫిమెరిస్, రాఫెల్ ఎఫిమెరిస్ వంటి వాటి ద్వారా కూడా సాధించవచ్చు. పాశ్చాత్య పద్ధతిలో గోచారం కూడా సాయన రవిరాశులను బట్టి ఉంటుంది. సాయనరవి వేరు వేరు రాశుల్లో సంచరించే కాలం గమనించి ఆ సమయాలలో పుట్టినవారిది ఆ రాశిగా పరిగణిస్తూ ప్రస్తుత సాయన గ్రహ సంచారం ఆ వ్యక్తికి ఏవిధమైన ఫలితాలను ఇస్తుందో గమనించేదే **సాయన గోచారం**.

పురోగామి జాతకచక్ర పరిశీలనలోనూ, మూలమైన పుట్టిన సమయం లోని జాతకచక్ర పరిశీలనలోనూ దృష్టులు అధిక ప్రాధాన్యం వహిస్తాయి. శుభదృష్టులు, అశుభదృష్టులు అనేవి డిగ్రీలపై ఆధారపడి ఉంటాయి. అశుభదృష్టి దూరంలో ఉన్న మిత్రగ్రహాలు కూడా శత్రువులవుతారు. శుభదృష్టి దూరంలో ఉన్న శత్రు గ్రహాలు కూడా మిత్రులవుతారు. సెమీసెక్స్టైల్ (30 డిగ్రీలు), సెక్స్టైల్ (60), ట్రైన్ (120) వీనిలో శుభదృష్టి దూరాలు కాగా, సెమీస్క్వేర్ (45), స్క్వేర్ (90), అపోజిషన్ (180), సెస్క్వి క్వాడ్రేట్ (135), క్వింకంక్స్ (150) అనే దృష్టులు అశుభదృష్టులుగా పరిగణించబడతాయి. గ్రహాలు వేరు వేరు భావాలకు అధిపతులై ఈ దృష్టి దూరాలలోకి వస్తున్న సందర్భంలో ఆ యా గ్రహాలకున్న దృష్టి పరిధులను అనుసరించి శుభాశుభ ఫలిత నిర్ణయం చేయాల్సి ఉంటుంది. ఇది కూడా బాగా ప్రయత్నపూర్వకంగా అధ్యయనం చేయవలసిన జ్యోతిష విభాగమే.

**నాడి :** ఒక్కో రాశిని అత్యధికమైన భాగాలు చేసి ఒక్కో భాగానికున్న ప్రత్యేకమైన ప్రతిపత్తిని అర్థం చేసుకోవడమే నాడీశాస్త్రం యొక్క ముఖ్య ఉద్దేశం. వేరు వేరు భాగల్లో ఉన్న వేరు వేరు గ్రహాలు, లగ్నం ఇచ్చే ఫలితాన్ని అత్యంత సూక్ష్మంగా వివేచించి వ్యక్తికి భవిష్య మార్గసూచన చేయడం నాడీశాస్త్రం తెలియజేస్తుంది. పూర్వం ఈ పద్ధతి అధికంగా ఉండేదని తెలుస్తుంది. ప్రస్తుతం తమిళపద్ధతిలోని ప్రత్యేక పరిశీలనార్హమైన నాడీ విధానం మాత్రం అందరికీ తెలుస్తున్నది.

## సంహితా విభాగం

**సంహిత** జ్యోతిషంలో ముఖ్యమైన మూడవ స్కంధం. ఈ స్కంధం ప్రకృతి, ఫలిత జ్యోతిషాదుల్ని వివరిస్తుంది. సంహిత అంటే కూర్పు అని అర్థం. జ్యోతిషశాస్త్రంతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలున్న అన్ని ప్రత్యేకమైన అంశాలు ఈ

స్కంధంలో సంక్షిప్తంగా తెలియజేయబడతాయి. ఇందులో సంవత్సర సూత్రం, గ్రహవిచారం, గ్రహయుతి, వర్షఫలం, శృంగాటకం, గర్భవివేకం, ఉల్కావివేకం, ప్రతివర్ష కృత్య లక్షణాలు, వాస్తు, వృక్షాయుర్వేదం, శకునవివేచన, తిథ్యాదుల ఫలితం, గ్రహ గోచరాది విషయాలు వివరింపబడతాయి. గర్గ, వసిష్ఠ, భృగు, కశ్యప, నారద, బృహత్సంహితాదులు ఈ స్కంధంలో ప్రసిద్ధ గ్రంథాలు.

**సంహిత** మానవజీవన విజ్ఞానశాస్త్రం. జ్యోతిస్సుల ప్రభావాలను అనేక రీతులలో పరిశీలించి, అవి మానవునిపై చూపించే ప్రభావాలను ఈ సంహితాస్కంధంలో అధ్యయనం చేస్తారు. దీనిలో అనేక ఉపవిభాగాలు కనిపిస్తున్నాయి. ఈ విభాగాలలో జ్యోతిస్సుల ప్రత్యక్షప్రభావం అస్పష్టంగా కనిపించి, ఛాయామాత్రమైన జ్యోతిషభావనలు వ్యక్తీకరించబడతాయి. ప్రస్తుతకాలంలో సంహితా విభాగంలో అత్యధికమైన పరిశోధనలు చేయవలసిన అవసరం ఉంది. వాతావరణంతో, ప్రకృతితో ప్రత్యక్ష సంబంధం కలిగి పరోక్షంగా వ్యక్తికి మార్గనిర్దేశం చేసేది సంహిత. ఇది విజ్ఞానశాస్త్రాల కూర్పు. దీన్ని బాగా అధ్యయనం చేయడంవల్ల సమాజానికి అధికమైన మేలు కలుగుతుంది.

సంహిత అనేక భాగాలుగా, ఉపవిభాగాలుగా పునర్విభజితమైంది. ఆ యా విభాగాలలో ముఖ్యమైన వాని వివరణలు కొన్నింటిని ఈ పుస్తకంలో వివరించడం జరిగింది. వానిలో సాముద్రికం, శాంతి, స్వప్నం, వాతావరణ శాస్త్రం, రత్నశాస్త్రం, జలార్గళం, వాస్తు, ముహూర్తం, గోచారం తదితర అంశాలు ప్రత్యేక పరిశీలనాంశాలుగా ఉన్నాయి.

## ప్రశ్న విభాగం

జ్యోతిశ్శాస్త్రంలో చతుర్థ స్కంధమిది. తాత్కాలికంగా తాను చేయబోయే పనులలో శుభాశుభాలను గుర్తించి కార్యానికి ఉద్యుక్తులు కావడంలో ఉన్న అంశాలను దృష్టిలో పెట్టుకోవడం ఈ శాస్త్రంలో కనిపిస్తుంది. తత్కాల గ్రహస్థితి

ఆధారంగా ఈ విషయాన్ని నిర్ణయిస్తారు. అంతేగాకుండా ప్రశ్న అడిగిన సమయంలో జ్యోతిష్కుని శ్వాస, చుట్టూవున్న శుభాశుభ వస్తువులు, చెప్పిన సంఖ్య, ప్రశ్నాక్షరాలు మొదలైన విషయాలపై ప్రత్యేక శ్రద్ధను చూపిస్తూ స్వర, కాల, సంఖ్యా, వాక్యప్రశ్నలుగా అధ్యయనం చేస్తున్నారు.

కాల ప్రశ్న వ్యక్తి వచ్చినపుడు కాలాన్ని చూసుకొని నిర్ణయం చేసుకోవడాన్ని సూచించగా, స్వరప్రశ్న జ్యోతిష్కుని శ్వాస ఆధారంగా ఫలితాన్ని చెపుతుంది. అక్షర ప్రశ్నలో పలికే అక్షరాల మొత్తం చూసే పద్ధతి, మొదటి మూడు అక్షరాలు చూసే పద్ధతి, మొదటి అక్షరాన్ని బట్టి ఫలితం చూసే పద్ధతి ఉన్నాయి. సంఖ్యా ప్రశ్నలో పృచ్ఛకుడు ప్రశ్నించిన ప్రశ్నకు 108 లోపు సంఖ్యను అడిగి దానిని రాశి, నవాంశలుగా విభజించి ఫలితాన్ని నిర్ణయించడం ఉంది. ఇది ప్రస్తుతం బాగా ఆదరణలో ఉన్న ప్రశ్న విభాగం. నిర్ణయాలు చేయడంలో ఈ ప్రశ్న బాగా వినియోపడుతుంది. అంతేగాకుండా ప్రశ్నించినపుడు కాలాన్ని, చుట్టూ ఉన్న వాతావరణాన్ని, తన మనసుపై ప్రభావాలను, తన చెవులో పడే ఇతరుల వాక్యాలు (ఉపశ్రుతి) మొదలైనవానిని దృష్టిలో పెట్టుకొని ఫలితాలను నిర్దేశిస్తే స్పష్టంగా మార్గాన్ని సూచించే అవకాశం ఉంటుంది.

## శకున విభాగం

జ్యోతిష విజ్ఞానంలో తరువాతి కాలంలో పంచమస్కంధంగా గుర్తించ బడింది. ఈ శకునాలను గుర్తించేది మనస్సే. మనకు నిత్య జీవితంలో కనిపించే వస్తువులు, జీవజాలాలు వాటికి ప్రేరకాలే గాని అవి చెడ్డవి కావు. ప్రకృతిలో ఏదో మార్పు కలుగుతుందన్నప్పుడు జీవులు తమ శరీర ప్రకృతులు మార్చుకుంటాయి. అవి గమనించడం కూడా శకున సంబంధమైన అంశమే. దీనిలో మనుష్య, ప్రకృతి, పశుపక్షి సంబంధమైన విధాలుగా విభజన చేసి అధ్యయనం చేస్తున్నారు.

అంతే కాకుండా తమ మనస్సుకు అది మంచి కలిగిస్తుందా, చెడు కలిగిస్తుందా అనే విషయం వ్యక్తికి, ప్రాంతానికి, వేరు వేరు వాతావరణాలలో పెరిగినవారికి వేరు వేరుగా ఉంటుంది. మనసుకు మంచి కలిగిన భావన ఉంటే అది శుభశకునం, మంచి కలగని భావన ఉంటే అది అశుభశకునం. ఆ శకునం కూడా మన మనస్సు గుర్తిస్తేనే శుభశకునం కాని, కావాలని తెప్పించుకుంటే మాత్రం కాదు. ఎల్లప్పటికీ ఆనందాన్నిచ్చే విధంగా గృహంలోని వస్తువుల అమరికను ఏర్పాటు చేసుకుంటే మనస్సు నిర్మలంగా ప్రశాంతంగా ఉంటుంది. దానివల్ల అంతటా శుభశకునాలే కనిపిస్తుంటాయి.

ఈ విధంగా వేరు వేరు విభాగాలలోని కృషి జ్యోతిష విస్తృతిని, మానవ జీవనం ప్రకృతితో ముడిపడి ఉన్న విధానాన్ని సూచిస్తున్నది.

## జ్యోతిషం - కర్మసిద్ధాంత సంబంధం

భారతీయ కర్మ సిద్ధాంతం ప్రకారం కర్మలు మూడురకాలు : అవి 1. ప్రారబ్దం 2. సంచితం 3. ఆగామి.

**1. ప్రారబ్దం :** పూర్వజన్మల్లో మనం చేసిన కర్మకు ఫలితంగా వచ్చేది.

**2. సంచితం :** పూర్వం చేయబడి నిల్వగా ఉండి అనుభవించడానికి సిద్ధంగా ఉన్నది.

**3. ఆగామి :** రాబోయే కాలంలో పరిపక్వమయ్యేది.

పూర్వకర్మల ఫలితాలు ప్రస్తుత జీవనంలో వ్యక్తిని ప్రేరేపిస్తాయి. ఆ కర్మలకు అనుగుణంగానే వ్యక్తి తన కార్యక్రమాలను నిర్వహిస్తుంటాడు. కర్మ సిద్ధాంతం ప్రకారం వ్యక్తి ఎటువంటి కర్మలు ఏ సమయాల్లో చేయాలో ఆ సమయంలోనే, అటువంటి వాతావరణం ఉన్న ప్రదేశంలోనే మళ్ళీ పుడతాడనేది జ్యోతిష సంప్రదాయం. ఆయా ప్రదేశాలలో పుట్టిన వ్యక్తి ఆ విధమైన కర్మలే

చేస్తూ ఉంటాడు. జ్యోతిషం ద్వారా జాతక చక్రాన్ని పరిశీలించి శుభాశుభ సమయాన్ని దశల ఆధారంగా గమనించగలిగితే మంచి కాలాన్ని గుర్తించి మరికొంత నూతన ప్రయత్నం చేయడానికి, చెడుకాలాన్ని గుర్తించి జాగ్రత్తలు తీసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది.

కర్మ సిద్ధాంతం ప్రకారం ఏ కార్యక్రమమైనా తప్పనిసరిగా జరిగితీరాలనే నియమం ఉన్నా జ్యోతిషం ద్వారా మాత్రమే ఫలితాలు ముందుగా కనుక్కుని కర్మల యొక్క ఫలితాలను దృష్టిలో ఉంచుకొని జాగ్రత్తలు తీసుకొనే అవకాశం ఉంటుంది.

పూర్వకర్మలలోని పాపాలు వ్యాధిరూపంలో బాధిస్తాయని, దాని నివారణార్థం ఔషధ, జప, హోమ, దానాది ప్రక్రియలు ఆయా దోషకాలాలను గుర్తించి చేసుకోవాలని చెప్పడం జరిగింది. దోష దశ వచ్చేవరకు ఆగి దోషఫలితాన్ని అనుభవించడం ప్రారంభించిన తర్వాత దానిని తొలగించుకోవడం అనారోగ్యం కల్గిన తర్వాత చేసే ఔషధ సేవ వంటిది. జాతకం ద్వారా రాబోయే దోషఫలితాన్ని ముందుగా గుర్తించి పరిహారంగా మనం చేయాల్సిన కృషిని అంచనా వేసి లౌకిక, ఆధ్యాత్మిక ప్రతిక్రియల ద్వారా కృషి చేసి గోషఫలితాన్ని పరిహరించు కోవాలి.

గతంలో చేసిన కర్మ ఫలితాన్ని నివారించడానికి ప్రస్తుతం చేసే కర్మ ప్రయోజనకారి అవుతుంది. పూర్వం చేసిన కర్మలో దుష్టఫలితాన్ని నివారించుకోవడానికి మంచి ఫలితాన్ని పెంపొందించుకోవడానికి ఇప్పుడు చేసే కర్మ కారణమవుతుంది అనడాన్ని అటు కర్మసిద్ధాంతం, ఇటు జ్యోతిశ్శాస్త్రం కూడా సమర్థిస్తున్నాయి.

ఈ జన్మలో వ్యక్తి యొక్క సత్ప్రవర్తన ద్వారా ఆగామిని మంచిగా మలచుకోవడానికి అవకాశం ఉంది. ప్రతిక్రియల ద్వారా దుష్టమైన సంచితకర్మను

తొలగించుకోవచ్చు. కర్మ సిద్ధాంత అనుగుణంగానే ప్రస్తుతం జ్యోతిర్వైద్య భావన ఏర్పాటు చేయబడింది. ఇబ్బందులు కలిగిన తర్వాత నివారణ చేసుకోవడం కన్నా ఇబ్బందులు రాకుండా జాగ్రత్తలు తీసుకోవడమే మేలు అనేది ఈ సిద్ధాంతం చెపుతుంది.

పూర్వజన్మలో చేసిన శుభ పాపకర్మల యొక్క ఫలానుభవ కాలాన్ని జ్యోతిష శాస్త్రం సూచిస్తుంది. చీకటిలోని వస్తువులను దీపం యొక్క సహాయంతో చూచినట్లుగా, జ్యోతిష సహకారంతో జరుగబోయే మంచి చెడ్డలను గుర్తించి అనుకూల వ్యతిరేక ప్రక్రియల ద్వారా జీవితాన్ని సుఖవంతం చేసుకోవడానికి ఈ శాస్త్రం సహకరిస్తోంది. తీవ్రమైన పుణ్యపాపాలకు సంబంధించిన అంశాలను వచ్చే జన్మలో కాకుండా అదే జన్మలో ఫలితాన్ని అనుభవిస్తారని చెప్పబడింది. ఈ దోషనివారణలే పరిహారక ప్రక్రియలు. ఎటువంటి దోషాలు ఉన్నాయో గమనించి ఆ దోషాలు ఏర్పడకుండా ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలో నిర్ణయించడం ఈ భాగంలోని విశేషం. ఆ వివరాలు ఈ పుస్తకంలో చివరలో పరిహారక్రియలనే భాగంలో కొన్ని వివరించబడినాయి.

## ఖగోళ విజ్ఞానం

### నక్షత్ర విజ్ఞానం :

నక్షత్రాలు అనేవి స్వయంప్రకాశాలు. నక్షత్రమనగా నాశనం లేనిది అని అర్థం. ఈ నక్షత్రాలు ఆకాశంలో అనంతంగా ఉన్నాయి. అనంతం అంటే దాదాపు లెక్కించలేనంతగా ఉన్నాయి. వాటిలో ఉన్న వెలుగులను బట్టి ఖగోళశాస్త్రవేత్తలు మనకు ఆల్ఫా, బీటా, గామా అనే పేర్లతో లెక్కించడం జరుగుతుంది. ఆకాశంలో కనిపించే ఈ నక్షత్రాలన్నింటిలోనూ ముఖ్యంగా రవిమార్గంలో మనకు కనిపించే నక్షత్రాల సమూహాలు 27 మాత్రమే. ఈ 27

నక్షత్రాల మార్గంలోనే ప్రతిరోజూ చంద్రుని గమనం మనకు కనిపిస్తూ ఉంటుంది. అందువల్ల ఆ 27 నక్షత్రాలకు అధికమైన ప్రాధాన్యం పెరిగింది. మిగిలిన నక్షత్ర మండలాలు మార్గానికి కొంచెం ప్రక్కగా ఉండడం వల్ల వాటిని కేవలం ఖగోళశాస్త్రవేత్తలు, జ్యోతిషంలో ఇతర విషయాలతో సంబంధం చూసే వారు మాత్రం గమనిస్తున్నారు.

## 27 నక్షత్రాల పేర్లు

| | | |
|---|---|---|
| 1. అశ్విని | 2. భరణి | 3. కృత్తిక |
| 4. రోహిణి | 5. మృగశిర | 6. ఆరుద్ర |
| 7. పునర్వసు | 8. పుష్యమి | 9. ఆశ్లేష |
| 10. మఖ | 11. పుబ్బ | 12. ఉత్తర |
| 13. హస్త | 14. చిత్త | 15. స్వాతి |
| 16. విశాఖ | 17. అనూరాధ | 18. జ్యేష్ఠ |
| 19. మూల | 20. పూర్వాషాఢ | 21. ఉత్తరాషాఢ |
| 22. శ్రవణం | 23. ధనిష్ఠ | 24. శతభిషం |
| 25. పూర్వాభాద్ర | 26. ఉత్తరాభాద్ర | 27. రేవతి. |

ప్రతిరోజూ చంద్రుడు ఏ నక్షత్రం నుండి మనకు కనిపిస్తుంటాడో ఆ నక్షత్రాన్ని ఆరోజు నక్షత్రంగా చెప్తారు. ఎవరైనా పుట్టినపుడు చంద్రుడు ఏ నక్షత్రంలో ఉంటాడో అతనిది ఆ నక్షత్రంగా నిర్ణయిస్తుంటారు. ఆకాశం మొత్తం 360 డిగ్రీలుగా భావిస్తే, ఈ 360 డిగ్రీలను 27 భాగాలు చేస్తే ఒక్కో భాగం 13.20 డిగ్రీలవుతుంది. ఒక్కో నక్షత్రాన్ని తిరిగి నాలుగు భాగాలు చేస్తే 108 భాగాలవుతుంది. ఒక్కోభాగం 3.20 డిగ్రీలు. అంటే ఒక నక్షత్రపాదం 3.20 డిగ్రీలు. ఒక నక్షత్రానికి 13.20 డిగ్రీలు. ఒక రాశికి 30 డిగ్రీలు. 12 రాశులకు 360 డిగ్రీలు.

ఈ నక్షత్రాలకు అధిదైవాలు, ఆకృతులు ఉంటాయి. అధిదైవాలుగా వేదంలో చెప్పబడినట్లు అశ్వినికి అశ్వినీదేవతలు, భరణికి యముడు, కృత్తికకు అగ్ని ... వరుసలో ఉంటాయి. అదేవిధంగా ఒక్కో నక్షత్రానికి ప్రత్యేకమైన ఆకృతి కూడా ఉంటుంది. ఆ నక్షత్రాల ఆకృతులు అధిదైవాలను ఈ విధంగా మనం గుర్తించాలి.

## నక్షత్రాలు : ఆకృతులు

1. అశ్విని - తురగముఖాశ్వినీ త్రీణి (గుర్రంముఖం ఆకృతిలో మూడు)
2. భరణి - భరణీ యోని త్రీణి (యోని ఆకృతిలో మూడు నక్షత్రాలు)
3. కృత్తిక - కృత్తికా క్షురాషట్కం (మంగలికత్తి ఆకృతిలో ఆరు నక్షత్రాలు)
4. రోహిణి - శకటం పంచ రోహిణీ (బండి ఆకృతిలో ఐదు నక్షత్రాలు)
5. మృగశిర - మృగశిరా శీర్షం త్రయం (శీర్షాకారంలో మూడు నక్షత్రాలు)
6. ఆరుద్ర - ఆర్ద్రా ప్రవాళ మేకం (పగడం ఆకృతిలో మెరుస్తూ ఒకటి)
7. పునర్వసు - పునర్వసూ కులాలచక్రం పంచ (చక్రాకృతిలో ఐదు నక్షత్రాలు)
8. పుష్యమి - సరళా పుష్యమీ త్రీణి (సరళాకృతిలో వరుసగా మూడు)
9. ఆశ్లేష - ఆశ్లేషా సర్పా ఋతూ (సర్పాకృతిలో ఆరు నక్షత్రాలు)
10. మఖ - మఖాందోళికా పంచ (పల్లకీ ఆకృతిలో ఐదు నక్షత్రాలు)
11. పుబ్బ - పుబ్బ, ఉత్తర నేత్ర ద్వయోః (కంటి ఆకృతిలో రెండు నక్షత్రాలు)
12. ఉత్తర - పుబ్బ, ఉత్తర నేత్ర ద్వయోః (కంటి ఆకృతిలో రెండు నక్షత్రాలు)
13. హస్త - హస్తా పాణినాం పంచ (చేతివేళ్ళ ఆకృతిలో ఐదు నక్షత్రాలు)
14. చిత్త - చిత్తా మౌక్తిక మేకం (ముత్యం ఆకృతిలో ఒకే ఒక నక్షత్రం)
15. స్వాతి - స్వాతీ మాణిక్య మేకం (మాణిక్యం లాగా ఒకే నక్షత్రం)
16. విశాఖ - విశాఖా కులాలచక్రం పంచ (చక్రాకృతిలో ఐదు నక్షత్రాలు)
17. అనూరాధ - అనూరాధ జ్యేష్ఠాంగుళ ఛత్రాకార త్రయం (గొడుగు ఆకృతిలో మూడు నక్షత్రాలు)

18. జ్యేష్ఠ - అనూరాధ జ్యేష్ఠాంగుళ ఛత్రాకార త్రయం (గొడుగు ఆకృతిలో మూడు నక్షత్రాలు)

19. మూల - మూలా కుప్యత్కేసరీ పంచ (కోపించిన కేసరి ఆకృతిలో ఐదు)

20. పూర్వాషాఢ - పూర్వాషాఢా ఉత్తరాషాఢా ద్వే ద్వే భేకం (కప్ప ఆకృతిలో రెండు)

21. ఉత్తరాషాఢ - పూర్వాషాఢా ఉత్తరాషాఢా ద్వే ద్వే భేకం (కప్ప ఆకృతిలో రెండు)

22. శ్రవణం - శ్రవణం మత్స్యాకార త్రయం (చేప ఆకారంలో మూడు)

23. ధనిష్ఠ - ధనిష్ఠా శీర్ష త్రయం (శీర్షాకృతిలో మూడు నక్షత్రాలు)

24. శతభిషం - శతభిషక్ఛతం తారాః (వంద తారల గుంపు)

25. పూర్వాభాద్ర - పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ద్వే ద్వే ఖట్వం (మంచం ఆకృతిలో రెండు నక్షత్రాలు)

26. ఉత్తరాభాద్ర - పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ద్వే ద్వే ఖట్వం (మంచం ఆకృతిలో రెండు నక్షత్రాలు)

27. రేవతి - రేవతీ మత్స్యాకార త్రయం (చేప ఆకారంలో మూడునక్షత్రాలు)

## నక్షత్రాలు : అధిదైవాలు

1. అశ్విని - అశ్వినీ దేవతలు
2. భరణి - యముడు
3. కృత్తిక - అగ్ని
4. రోహిణి - ప్రజాపతి
5. మృగశిర - చంద్రుడు
6. ఆరుద్ర - రుద్రుడు
7. పునర్వసు - అదితి
8. పుష్యమి - బృహస్పతి

| | | |
|---|---|---|
| 9. ఆశ్లేష | - | సర్పం |
| 10. మఖ | - | పితరులు |
| 11. పుబ్బ | - | భగుడు |
| 12. ఉత్తర | - | అర్యముడు |
| 13. హస్త | - | సూర్యుడు |
| 14. చిత్త | - | విశ్వకర్మ |
| 15. స్వాతి | - | వాయువు |
| 16. విశాఖ | - | ఇంద్రాగ్నులు |
| 17. అనూరాధ | - | సూర్యుడు (మిత్రుడు) |
| 18. జ్యేష్ఠ | - | ఇంద్రుడు |
| 19. మూల | - | నిర్రృతి |
| 20. పూర్వాషాఢ | - | ఉదకములు |
| 21. ఉత్తరాషాఢ | - | విశ్వేదేవతలు |
| 22. శ్రవణం | - | విష్ణువు |
| 23. ధనిష్ఠ | - | వసువులు |
| 24. శతభిషం | - | వరుణుడు |
| 25. పూర్వాభాద్ర | - | అజైకపాదుడు |
| 26. ఉత్తరాభాద్ర | - | అహిర్బుధ్న్యుడు |
| 27. రేవతి | - | పూషుడు. |

నిజానికి నక్షత్రాలనేవి ఒక లాండ్‌మార్క్‌ల వంటివి. భూమి సూర్యుని చుట్టూ తిరిగే ఒకానొక గ్రహం మాత్రమే. బుధ, శుక్ర, కుజాదులు గ్రహాలే. వీటిలో సూర్యుడు [illegible] తార. సూర్యునికి సహజంగా కాంతి, ప్రకాశం, ఆకర్షణశక్తి ఉంటాయి. వెలుగును, వేడిని స్వయంగా ఇచ్చి తన ఆకర్షణశక్తి

పరిధిలో కొన్ని గ్రహాలను తిప్పుకునే శక్తి తారయైన సూర్యునికి ఉంది. సూర్యుడు మనకు దగ్గరలో ఉన్న తార (స్టార్). కొన్ని తారలు కలిస్తే ఒక నక్షత్రం అవుతుంది. అశ్విన్యాదులు నక్షత్రాలు. నక్షత్రాలన్నీ మనకు అతి దూరంలోనివి. వాటి కాంతి కొంత మనకు కనపడుతుంటుంది కాని వాటి వేడి మాత్రం మనం గ్రహించలేము. వాటి కాంతి కూడా మనకు చేరడానికి అనేక వేల కాంతి సంవత్సరాలు పడుతుంది. అందువల్ల నక్షత్రాల ప్రభావం భూమిపై ప్రత్యక్షంగా ఉండదు. వాటికి కదలికలు ఉన్నా మనకు అత్యంత దూరంలో ఉండడం వల్ల వాటి కదలికలు మనం గుర్తించే స్థాయిలో ఉండవు. అందువల్ల భూగోళం దృష్ట్యా అవి స్థిరమైనవే.

భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉండడం వల్ల ఒక్కో సమయంలో ఒక్కో నక్షత్రం తూర్పువైపున ఉదయిస్తూ పశ్చిమంవైపున అస్తమిస్తూ ఉన్నట్లు కనిపిస్తుంటుంది. ఆ యా నక్షత్రాలు ఉదయిస్తున్నప్పుడు ప్రకృతిలో కనిపించే మార్పులను అధ్యయనం చేస్తుంటే అవి పునరావృతం అవుతున్నట్లు గమనించారు. అంటే ఎప్పుడు ఆ నక్షత్రం తూర్పువైపున కనిపించినా భూగోళంపైని ప్రకృతిలో వచ్చే స్పందన ఒకే రకంగా ఉంటుంది. ఈ పునరావృతం (రిపీట్) అయిన విశేషాలను ఒకచోట చేర్చి వాటిని ఆ నక్షత్రమిచ్చే ఫలితాలుగా గుర్తించారు. అందువల్ల ఆ యా నక్షత్రాలకు ప్రాధాన్యం పెరిగింది.

అదేవిధంగా గ్రహాలు భూమికి అతిదగ్గరలో ఉంటాయి. భూమితో పాటు సూర్యుని చుట్టూ చరిస్తుంటాయి. ఈ గ్రహాలు భూగోళానికి ఎటువైపున ఉన్నాయో తెలియాలంటే నక్షత్రం గూర్చి తెలియాల్సిందే. ఏ నక్షత్రం గుండా ఆ గ్రహం మనకు కనిపిస్తుందో ఆ నక్షత్రంలో ఆ గ్రహమున్నట్లు పంచాంగాలు వ్రాస్తుంటాయి. ఫలితజ్యోతిషంలోనూ ఆ గ్రహం ఆ నక్షత్రం నుండి కనిపిస్తుంటే

కలిగే ఫలితాలను, పునరావృతమయ్యే ఫలితాలను రికార్డు చేసి ఆ ఫలితాలను తెలియజేస్తుంటారు. అందువల్ల నక్షత్రాలు, వాటి ఆకృతులు, ఆ యా నక్షత్రాల స్థానాలు, అధిదైవాలు అత్యంత ముఖ్యమైన అధ్యయన కేంద్రాలైనాయి.

## రాశి విజ్ఞానం

నక్షత్రాల సమూహాల వల్ల రాశులు ఏర్పడతాయి. మొత్తం 360 డిగ్రీల కాంతి చక్రాన్ని 12 భాగాలుగా విభజించారు. దీనికి కారణం చంద్రుడు ఒకానొక పౌర్ణమినాడు తానున్న నక్షత్రం నుండి మళ్ళీ అదే నక్షత్రంలో పౌర్ణమిని ఏర్పరచడానికి 12 నెలల కాలం పడుతుంది. సూర్యుని గురించి ప్రత్యక్షంగా గమనించడం సాధ్యం కాదు. సూర్యుని వెలుతురులో ఇతర నక్షత్రాలన్నీ కనిపించకుండా పోతుంటాయి. అందువల్ల సూర్యోదయం కన్నా ముందు తూర్పు ఆకాశంలో ఉదయించే నక్షత్రాలను గాని, సూర్యాస్తమయం తర్వాత పశ్చిమాకాశంలో కనిపించే నక్షత్రాలను పరిగణనలోకి తీసుకొని లెక్కిస్తే ఒకే రకమైన నక్షత్రాలు మరల కనిపించడానికి 12 మాసాల కాలం పడుతుంది. అందుకే రాశులను కూడా 12 విభాగాలు చేశారు. 360 డిగ్రీల క్రాంతివృత్తం 12 భాగాలు చేస్తే ఒక్కో భాగం 30 డిగ్రీలు అవుతుంది.

**12 రాశులు :** 1. మేషం (0-30) 2. వృషభం (30-60) 3. మిథునం (60-90) 4. కర్కాటకం (90-120) 5. సింహం (120-150) 6. కన్య (150-180) 7. తుల (180-210) 8. వృశ్చికం (210-240) 9. ధనుస్సు (240-270) 10. మకరం (270-300) 11. కుంభం (300-330) 12. మీనం (330-360).

ఒక్కో నక్షత్రానికి 13.20 డిగ్రీలు మాత్రమే ప్రమాణం ఉండడం వల్ల ఒక రాశిలో రెండు నక్షత్రాలపైన ఒక పాదం ప్రమాణం ఉంటుంది.

(13.20+13.20+3.20 = 30 డిగ్రీలు). ఈ రాశులు వేరు వేరు నక్షత్రాలలో ఏవిధంగా విభజన అవుతుంటాయనేది ఈ క్రింద తెలుపబడింది. ఈ నక్షత్ర విభజన వల్లనే ప్రతి విషయాన్ని రాశిపరంగా విశ్లేషించడానికి సాధ్యం అవుతుంది. ముహూర్తం, గోచారం ఏది కావాలన్నా ఈ విషయం తప్పనిసరి అవసరం. ఈ విభజన తెలియకుండా సిద్ధాంతపరంగా కాని, ఫలితపరంగా కాని జ్యోతిషం అర్థం కావడం కష్టం. శ్లోకరూపంలో పూర్వకాలంలో అధ్యయనం చేయడం తేలికగా ఉండేది. ఈ రోజుల్లో కనీసం పుస్తకాలు చూస్తూనైనా నేర్చుకోవడం మంచిది.

| | |
|---|---|
| అశ్విని(4) భరణి (4) కృత్తిక (1) | – మేషం |
| కృత్తిక (2,3,4) రోహిణి (4) మృగశిర (1,2) | – వృషభం |
| మృగశిర (3,4) ఆర్ద్ర (4) పునర్వసు (1.2.3) | – మిథునం |
| పునర్వసు (4వ పాదం) పుష్యమి (4) ఆశ్లేష (4) | – కర్కాటకం |
| మఖ (4) పుబ్బ (4) ఉత్తర (1) | – [illegible] |
| ఉత్తర (2,3,4) హస్త (4) చిత్త (1,2) | – కన్య |
| చిత్త (3,4), స్వాతి (4), విశాఖ (1,2,3) | – తుల |
| విశాఖ (4వపాదం) అనూరాధ (4) జ్యేష్ఠ (4) | – వృశ్చికం |
| మూల (4) పూర్వాషాఢ (4) ఉత్తరాషాఢ (1) | – ధనుస్సు |
| ఉత్తరాషాఢ (2,3,4) శ్రవణం (4) ధనిష్ఠ (1,2) | – మకరం |
| ధనిష్ఠ (3,4) శతభిషం (4) పూర్వాభాద్ర (1,2,3) | – కుంభం |
| పూర్వాభాద్ర (4వపాదం) ఉత్తరాభాద్ర (4) రేవతి (4) | – మీనం. |

## గ్రహ విజ్ఞానం

గ్రహమంటే గ్రహించేదని అర్థం. తన చుట్టూ ఉన్న వేరు వేరు అయస్కాంత, కాంతి క్షేత్రాల ప్రభావాలను గ్రహిస్తూ తమ ప్రభావాలను కలిపి

పరావర్తనం చెందించే తత్త్వం గ్రహాలకు ఉంటుంది. అన్ని గ్రహాలకు ఈ తత్త్వమే ఉన్నప్పటికీ, భూమి మీద ఉన్న పరిశీలకునికి సంబంధించిన అంశంలో మిగిలిన గ్రహాల ప్రభావం భూగ్రహంపై ఏవిధంగా ఉందో గమనించడం అవసరం. వేరు వేరు గ్రహాల ప్రభావాలు వేరు వేరు సమయాలలో భూ గ్రహంపై ఏవిధంగా ఉన్నాయో గమనిస్తే భూవాతావరణ స్థితిని అవగాహన చేసుకోవచ్చు. ఈ వాతావరణం సామూహిక ప్రభావాలను చూపించేంత తీవ్రంగా ఉండేటట్లయితే దాని తీవ్రత ఎక్కువగా ఉందని అర్థం. అదేవిధంగా వేరు గ్రహప్రభావాల కలయికలతో కూడుకున్న కాంతి, అయస్కాంత క్షేత్రాలు భూవాతావరణం చుట్టూ కనిపిస్తుంటే భూమిపైనున్న గ్రహీత (రిసీవర్) ఏవిధంగా దాన్ని గ్రహిస్తున్నాడో గమనించడమే జాతకం అవుతుంది. అందువల్ల ఏ యే గ్రహాల ప్రభావాలు ఏవిధంగా ఉంటాయి, అవి ఏ యే రాశులకు అధిపతులో, వేరు వేరు రాశులలో ఉచ్చ, నీచలు పొందే గ్రహాల గూర్చి ఇక్కడ చూద్దాం.

## సౌరకుటుంబ వ్యవస్థ (SOLAR SYSTEM) :

సూర్యుడు, సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలు, ఉపగ్రహాలు, తోకచుక్కలు, ఉల్కలు మొదలైన విషయాలన్నీ సౌరకుటుంబ వ్యవస్థలోని భాగాలు. విశ్వంతో పోల్చి చూస్తే ఇది చాలా చిన్న భాగం మాత్రమే. మనం నివసిస్తున్న భూమి ఈ సౌరకుటుంబం లోనిదే.

సూర్యుడు అనే ఒక తార చుట్టూ వేరువేరు కక్ష్యల్లో ఈ గ్రహాలు పరిభ్రమణం చేస్తూ ఉండడం వల్ల దీనికి సౌరకుటుంబవ్యవస్థ అని పేరు కలిగింది. ఈ వ్యవస్థకు సూర్యుడు కాంతిని ఇచ్చేవాడు. సూర్యుని చుట్టూ తిరిగే మిగిలిన అన్ని గ్రహాలు కూడా కాంతిహీనాలే. మిగిలిన ఉల్కలు, ఉపగ్రహాలు, చిన్న గ్రహాలు, తోకచుక్కలు అన్నింటికీ కాంతి విషయంలో సూర్యుడే ఆధారం.

మన సౌరకుటుంబవ్యవస్థ సూర్యుని ఆధారంగా ఏర్పడినట్టిది. దీనికి సూర్యుడు కేంద్రం. సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకార కక్ష్యల్లో గ్రహాలు ఇతర ఖగోళ పదార్థాలు సంచరిస్తూ ఉంటాయి. తొమ్మిదిగ్రహాలు ప్రత్యేకంగా ఖగోళశాస్త్రపరంగా చెప్పుకోవడం జరుగుతుంది. అవి 1. బుధుడు 2. శుక్రుడు 3. భూమి 4. కుజుడు 5. గురుడు 6. శని 7. యురేనస్ 8. నెప్ట్యూన్ 9. ప్లూటోలు. ఇవి కాక రవి ఒక తార, చంద్రుడు ఒక ఉపగ్రహం. కాని జ్యోతిశ్శాస్త్రరీత్యా వీటిని గ్రహాలుగానే భావిస్తారు.

టెలిస్కోప్ కనిపెట్టిన తర్వాత అనేక రకాల ఇతర ఖగోళ పదార్థాలను కనిపెట్టడం జరిగింది. రవి నుండి వేరు వేరు గ్రహాల వరుస ఈ విధంగా ఉంటుంది. బుధ, శుక్ర, భూమి, కుజ, ఆస్టరాయిడ్స్, గురు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోలు. వీనిలో రవి నుండి భూకక్ష్యకు మధ్యలో ఉన్న బుధ శుక్రులను అంతర గ్రహాలని అంటారు. భూ కక్ష్య తర్వాత కుజుని నుండి ప్లూటో వరకు బాహిర గ్రహాలని అంటారు.

## సూర్యుడు (SUN) :

ఖగోళ పదార్థాల్లో సూర్యుడు చాలా ముఖ్యమైనవాడు. అతని కిరణాలు భూమి పైకి, ఇతర గ్రహాలపైకి వెలుగును, ఉష్ణాన్ని వెదజల్లుతాయి. సూర్యుని ఆకర్షణ పరిధిలోనే ఇతర గ్రహాల గమనం ఉంటుంది. నిత్యజీవన వ్యవహారంలో అతని ప్రభావం అత్యధికం. సూర్యుడు లేకుండామానవ జీవనాన్ని ఊహించడం కూడా కష్టమే.

సూర్యుని వ్యాసార్ధం 8,65,000 మైళ్ళు. వ్యాసం భూమి కన్నా 1,300,000 రెట్లు ఎక్కువ. ద్రవ్యరాశి భూమి యొక్క ద్రవ్యరాశికన్నా 330,000 రెట్లు అధికం. న్యూక్లియర్ చర్యలవల్ల సూర్యునిలో శక్తి ఉత్పాదన జరుగుతుంది. సూర్యునిలో ఈ చర్యలో హైడ్రోజన్ హీలియంగా మారడం వల్ల ద్రవ్యరాశి

ఒక సెకనుకు నాలుగు మిలియన్ టన్నుల వంతున తగ్గుతుంది. సూర్యుడు తాను తిరుగుతున్న గెలాక్సీ మధ్యభాగానికి అత్యంత దూరంగా, దాదాపు కొనల వద్ద ఉన్నాడు. గెలాక్సీ మధ్య భాగానికి, సూర్యునికి మధ్య దాదాపు 30,000 కాంతి సంవత్సరాల దూరం ఉంది.

## రవిమార్గ (ECLIPTIC) :

విశ్వగోళంలో రవిమార్గమనేది ఒక పెద్ద వృత్తం. భూకేంద్రక సిద్ధాంతం ప్రకారం భూమి విశ్వానికి కేంద్రంగా, మధ్యభాగంలో కనిపిస్తుంటుది. ఆకాశంలో కదిలే అన్ని ఖగోళ పదార్థాలు భూమి చుట్టూ సంచరిస్తూ ఉంటాయి. రవి కూడా భూమి చుట్టూ తిరుగుతున్నట్లు, ప్రతిరోజూ తూర్పున ఉదయిస్తూ, పశ్చిమంలో అస్తమిస్తూ కనిపిస్తుంటాడు. ఈ రవి సంచరించే మార్గాన్ని (నిజానికి ఇది రవిచుట్టూ సంచరించే భూమి యొక్క మార్గం) రవిమార్గ అని అంటారు. ఈ రవిమార్గ విశ్వమధ్యరేఖకు దాదాపు 23 డిగ్రీల 26 నిమిషాల కోణం చేస్తూ వంగి ఉంటుంది. దీనికి భూమి అక్షం వంగి ఉండడమే కారణం. భూఅక్షం మరియు రవిమార్గకు చెందిన తలాల కోణాన్ని రవిమార్గం యొక్క వంపు అని అంటారు. ఇది ప్రస్తుతం 23 డిగ్రీల 26 నిమిషాల 25.2 సెకండ్లు ఉంది. వేరు వేరు ప్రభావాల కారణంగానూ, ఇతర గ్రహాల ప్రభావం వల్ల ఈ వంపుకు చెందిన కోణం కాలక్రమంలో అతి నెమ్మదిగా కొంత మారుతుంది.

## రాశిచక్రం (ZODIAC) :

రవిమార్గానికి రెండువైపులా 16 డిగ్రీల విస్తరణ (8+8) కలిగి అన్ని గ్రహాలన్నీ తిరిగే ప్రదేశాన్ని రవిమార్గ అని అంటారు. ఈ 16 డిగ్రీల వైశాల్యం, 360 డిగ్రీల వ్యాసమున్న వృత్తాన్ని ఒకొక్కటీ దాదాపు 30 డిగ్రీల విస్తరణ

కల్గిన 12 ఊహాత్మక భాగాలుగా విభజించారు. వీటినే రాశిచక్రంలోని రాశులు అని అంటారు. ప్రతిరాశి కొన్ని ప్రత్యేకమైన నక్షత్రాలతో కూడుకొని ఉంటుంది. మొత్తం ఈ నక్షత్రాలు 27. రాశిచక్రంలో ఒక్కో నక్షత్రానికి 13 డిగ్రీల 20 నిమిషాల ప్రమాణ పరిధి ఉంటుంది. నక్షత్రాలకు ఒక్కో దానికి నాలుగు పాదాలుంటాయి. ఒక్కో పాదానికి 3 డిగ్రీల 20 నిమిషాల ప్రమాణ పరిధి ఉంటుంది. కాబట్టి రెండుంపావు నక్షత్రాలు లేక 9 నక్షత్ర పాదాలతో కూడుకొని ఒక నక్షత్రం ఏర్పడుతుంది. రవిమార్గం ఈ రాశిచక్రం మధ్యభాగంలో ఉంటుంది. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ ఉండడం వల్ల భూమి మీద ఉండే పరిశీలకుడికి రాశిచక్రం ఆ గ్రహాన్ని ఆధారం చేసుకొని నక్షత్రాలు, గ్రహాలతో కూడుకొని ఒక చుట్టు తిరుగుతున్నట్లు కనిపిస్తుంటుంది.

## భూమి (EARTH)

మనమంతా జీవిస్తున్న భూమి ఒక గ్రహం. సూర్యకుటుంబంలో ఇది వరుసలో సూర్యుని నుండి మూడవ గ్రహం. రవి నుండి భూమి యొక్క సరాసరి దూరం 92,957,209 మైళ్ళు. భూమి యొక్క కక్ష్య గోళాకృతిలో లేకుండా అండాకృతి లేదా దీర్ఘవృత్తాకారంలో ఉంటుంది. రవికి భూమికి మధ్య అతి తక్కువ దూరం 91,400,000 మైళ్ళు కాగా, అత్యంత అధికమైన దూరం 94,600,000 మైళ్ళు ఉంటుంది. భూమియొక్క బరువు 6 $10^{21}$ టన్నులుంటుంది. సరాసరి సాంద్రత నీటికన్నా 5.52 రెట్లు అధికంగా ఉంటుంది. వాతావరణమంతా నైట్రోజన్ (77.6 శాతం), ఆక్సిజన్ (20.7శాతం) తో నిండి ఉంటుంది. భూమి స్పష్టమైన గోళం కాదు. ఇది ధ్రువాలవద్ద వత్తబడి మధ్యలో ఉబ్బెత్తుగా ఏర్పడిన గోళాకృతి వంటిది. దీని వ్యాసరేఖ భూమధ్యరేఖ వద్ద 7,926 మైళ్ళు కాగా, ధ్రువాల వద్ద 7,900 మైళ్ళు ఉంటుంది.

భూమిపైన వేరు వేరు ప్రాంతాల్లోని రేఖాంశల పరంగా వేరు వేరుగా ఉంటాయి.

| | |
|---|---|
| భూమధ్యరేఖవద్ద | ఒక డిగ్రీకి 68.704 మైళ్ళు |
| 20 డిగ్రీల రేఖాంశం వద్ద | ఒక డిగ్రీకి 68.786 మైళ్ళు |
| 40 డిగ్రీల రేఖాంశం వద్ద | ఒక డిగ్రీకి 68.993 మైళ్ళు |
| 60 డిగ్రీల రేఖాంశం వద్ద | ఒక డిగ్రీకి 69.230 మైళ్ళు |
| 80 డిగ్రీల రేఖాంశం వద్ద | ఒక డిగ్రీకి 69. 386 మైళ్ళు |

ఒక డిగ్రీకి భూమధ్యరేఖా వ్యాప్తి 69.17 మైళ్ళు ఉంటుంది. ఇది 60 నాటికల్ మైళ్ళకు సమానం.

భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూ ఒక కక్ష్య పూర్తి చేయడానికి $365^{1/4}$ రోజులు పడుతుంది.

భూమి తన అక్షం మీద పశ్చిమం నుండి తూర్పుకు తిరగడం వల్ల రాత్రి, పగలు ఏర్పడుతున్నాయి. దీని వల్ల సూర్యుడు, ఇతర స్థిర నక్షత్రాలు ప్రతిరోజూ తూర్పు నుండి పశ్చిమానికి కదులుతున్నట్లు కనిపిస్తాయి. భూమి యొక్క అక్షం, ఉత్తర దక్షిణ ధ్రువాల మధ్యనుండి వెళ్తున్న దాని మధ్యరేఖకు దాదాపు సమానంగా ఉంటుంది. భూమియొక్క ఉత్తర ధ్రువానికి ఎదురుగా ధ్రువనక్షత్రం ఉంటుంది.

## చంద్రుడు (MOON)

చంద్రుడు భూమికున్న ఒకే ఒక ఉపగ్రహం. రవి తర్వాత ఆకాశంలోని ఇతర గ్రహాల కంటే భూమికి చంద్రుడు అతి ముఖ్యమైనవాడు. భూమి తనచుట్టూ తాను తిరగడం వల్ల చంద్రుడు కూడా తూర్పు నుండి పశ్చిమం వైపు వెళ్తున్నట్లుగా కనిపిస్తాడు. రవి మరియు ఇతర గ్రహాలలాగే చంద్రుడు కూడా స్థిర నక్షత్రాల

మార్గంలో ఒక పరిపూర్ణమైన భ్రమణం చేయడానికి 27 రోజుల 7 గంటల 43 నిమిషాలు, అంటే 27.3217 రోజులు పడుతుంది. దీన్నే నాక్షత్రమాసం అని అంటారు. నాక్షత్ర మాసం అంటే భూమినుండి గమనిస్తున్న వారికి చంద్రుడు ఒక నక్షత్రంలో ప్రయాణం ప్రారంభించి మళ్ళీ అదే నక్షత్రానికి చేరి, ఒక వృత్తాన్ని పూర్తి చేయడం అని అర్థం. ఇది 27.3217 సౌరదినాలకు సమానం.

సాధారణంగా చాంద్రమాసం అంటే ఒక అమావాస్య నుండి మరో అమావాస్యకు మధ్య ఉండే 29.5305887 సౌర ద్దినాలని అర్థం. ఇది నాక్షత్ర మాసం కన్నా పెద్దది. చంద్రుడు పరిభ్రమిస్తున్న సమయంలో రవి కూడా ఒక రాశినుండి మరో రాశిలోకి చేరుకోవడం వల్ల ఒక అమావాస్య నుండి మళ్ళీ రెండో అమావాస్యను ఏర్పడడానికి అంటే రవిని చేరడానికి సాధారణ సమయం కన్నా కొంచెం ఎక్కువ అవసరం అవుతుంది

భూమియొక్క గురుత్వాకర్షణశక్తిని కూడా పరిగణనలోకి తీసుకొంటే చంద్ర కక్ష్య ఒక దీర్ఘవృత్తాకారంగా ఉంటుంది కాని రవి ఇతర గ్రహాలపై చూపించే ఆకర్షణ వల్ల ఈ కక్ష్యలో కొంత మార్పు కనిపిస్తుంది. భూమి నుండి చంద్రుని సరాసరి దూరం 238,000 మైళ్ళు. ఇది 221,460 నుండి 252,700 మైళ్ళ దూరం వరకు విస్తరించి ఉంటుంది.

ఈ మార్పుల వల్ల చంద్రుని కక్ష్యలలో కొద్ది మార్పులు ఏర్పడతాయి. చంద్రుడు భూమి చుట్టూ భ్రమిస్తున్నప్పుడు ఒక దగ్గరి ప్రదేశం నుండి మళ్ళీ అదే ప్రదేశానికి రావడానికి పట్టే కాలాన్ని **ఎనిమలిస్టిక్ మంత్** అని అంటారు. ఇది 27.5546 సౌర దినాలకు సమానం.

చంద్రుని యొక్క కక్ష్య భచక్రానికి అత్యధికంగా $5^0\ 15^1$ **కోణంలో** వంగి తిరుగుతుంది.

## బుధుడు (MERCURY)

రవి నుండి ఈ గ్రహం మొదటి కక్ష్యలో ఉంటుంది. రవికి ఇది అతి దగ్గరి గ్రహం. దీని గతి అతివేగంగా ఉండడం వల్ల గ్రీకులు దేవదూత అని పేరుపెట్టుకొన్నారు. ఈ గ్రహం సూర్యకాంతి పరావర్తనం వల్ల ప్రకాశిస్తుంది. రవి బింబాన్ని ఈ బుధగ్రహం దాటేటపుడు నల్లని బిందువులాగా కనిపిస్తాడు. ఈ విశేషాన్ని **తరణం** అని పిలుస్తారు. ఈ తరణం సుమారు మే, నవంబరు మాసాల్లో ఉంటుంది. బుధుడు సూర్యుని చుట్టూ తిరగడానికి 88 రోజులు పడుతుంది. బుధుడు ఒకసారి తన చుట్టూ తాను తిరగడానికి 58 రోజుల 15 గంటలు పడుతుంది. బుధునిపై వాతావరణం పల్చగా ఉంటుంది. ఇక్కడ వాతారవణం అసలు లేదేమో.

## శుక్రుడు (VENUS)

రవి కక్ష్యనుండి రెండవ గ్రహం శుక్రుడు. శుక్రుడు పశ్చిమంలో ఉదయించి తూర్పున అస్తమిస్తాడు. దీనిపైన గంధకీకామ్లంతో కూడిన మేఘాలుంటాయి. ఈ గ్రహం యొక్క పరిధి 7,500 మైళ్ళు. సౌరమండలంలోకెల్లా హానికరమైన వర్షం ఇక్కడ కురుసు&ంది. అందువల్ల సూర్యరశ్మి కేవలం 20 శాతం మాత్రమే గ్రహ ఉపరితలానికి చేరుతుంది. గ్రహం తనచుట్టూ తాను తిరిగే కాలం 243 రోజులు. శుక్రుడు సూర్యుని చుట్టూ 224.7 రోజుల్లో ఒక భ్రమణం చేస్తాడు. అంటే **శుక్రునిపైన సంవత్సరం కన్నా రోజు పెద్దది.**

## కుజుడు (MARS)

భూమి తర్వాత ఇది మొదటి గ్రహం, రవి కుటుంబంలో ఇది నాలుగవ గ్రహం. ఈ గ్రహం యొక్క పరిధి 4,200 మైళ్ళు. ఈ గ్రహం తనచుట్టూ తాను తిరిగే కాలం 24 గంటల 37 నిమిషాలు. సూర్యుని చుట్టూ తిరగడానికి

పట్టేకాలం 687 రోజులు. ఈ గ్రహానికి రెండు ఉపగ్రహాలున్నాయి. అవి 1. ఫోబోస్ 2. డైమోస్‌లు. తుప్పుతో కూడిన ఉపరితలం వల్ల ఈ గ్రహం పరావర్తనం చేసే కాంతి ఎర్రగా ఉంటుంది. అందుకే దీనిని రెడ్ ప్లానెట్ అని పిలుస్తారు. సౌరమండలంలోకెల్లా అతి పెద్దదైన ఒలింపస్ మాన్స్ ఇక్కడ ఉంది. ఇది ఎవరెస్టు శిఖరం కన్నా మూడింతలు ఎత్తైనది.

## గురుడు (JUPITER)

సూర్యకుటుంబంలో రవి తర్వాత ఇది ఐదవ గ్రహం. భూమి తర్వాత రెండవ గ్రహం. ఈ కుటుంబం మొత్తంలోనే ఇది అతి పెద్దదైన గ్రహం. ఇది తనచుట్టూ తాను తిరిగి రావడానికి 9గంటల 50 నిమిషాలు పడుతుంది. సూర్యుని చుట్టూ తిరగడానికి 11.86 సంవత్సరాల కాలం పడుతుంది. గురుగ్రహానికి 16 ఉపగ్రహాలున్నాయి. వాటిలో ఐయో. యూరోపా, గానీమెడె, కాలిస్టో అనేవి చాలా ముఖ్యమైనవి. గురు గ్రహం పసుపుపచ్చగా కనిపిస్తుంటాడు. అనేక మేఘవలయాలతో ఇది ఆక్రమించి ఉంటుంది. దీని బరువు రవిలో 1/1047 రెట్లు మాత్రమే ఉంటుంది.

## శని (SATURN)

సౌరకుటుంబంలోని గ్రహాల కక్ష్యల్లో ఇది ఆరవగ్రహం. ఈ గ్రహం సాంద్రత చాలా తక్కువ కాబట్టి దీన్ని సిద్ధాంతపరంగా చూస్తే నీటిమీద తేల్చి ఆడించవచ్చు. ఈ గ్రహం తనచుట్టూ తాను తిరగడానికి 10 గంటల 14 నిమిషాలు పడుతుంది. సూర్యుని చుట్టూ ఒకసారి తిరగడానికి 29.46 సంవత్సరాలు పడుతుంది. ఈ గ్రహంపై హైడ్రోజన్, హీలియం వాయువులు కనిపిస్తున్నాయి. ఈ గ్రహానికి 20 ఉపగ్రహాలున్నాయి. ఈ గ్రహం చుట్టూ అనేక వలయాలున్నాయి. ఇవి వెయ్యిదాకా ఉండవచ్చు. ఈ వలయాలు

తిరిగి చిన్న వలయాలుగా విడివడి ఉంటాయి. వలయాలలో ధూళి, మంచుతో కూడిన శకలాలుంటాయి.

## యురేనస్ - ఇంద్రుడు (URANUS)

ఈ గ్రహం 1781లో విలియం హెర్షల్ చేత కనుక్కోబడింది. ఈ గ్రహంపైన వాతావరణంలో హైడ్రోజన్, హీలియం, మిథేన్ వాయువుల కలయిక ఉండడం వల్ల ఇది ఆకుపచ్చగా కనిపిస్తుంది. ఈ గ్రహం చుట్టూ చిన్నవి, చిక్కనివి, రంగుగల శకలాలతో నిండిన తొమ్మిది ఇరుకు వలయాలు ఉన్నట్లు కనపడుతుంది. వెలుపలి వలయపు వ్యాసం 1,00,000 కి.మీ.లకు పైగా ఉంటుంది. ఈ గ్రహానికి ఐదు ఉపగ్రహాలున్నాయి. ఈ గ్రహ పరిధి 32 వేల మైళ్ళు. ఈ గ్రహం తనచుట్టూ తాను తిరగడానికి 16 గంటల 10 నిమిషాలు పడుతుంది. సూర్యుని చుట్టూ తిరగడానికి 84.01 సంవత్సరాలు పడుతుంది. యురేనస్ ఉపగ్రహాల పేర్లు మిరాండా, ఏరిమెల్, ఆంబ్రియల్, టిటానియా, ఓబెరాన్‌లు.

## నెప్ట్యూన్ - వరుణ (NEPTUNE)

1846 వ సంవత్సరంలో కనుక్కోబడ్డ ఈ గ్రహం కూడా యురేనస్ మాదిరిగా ఆకుపచ్చగానే ఉంటుంది. రెండు ఉపగ్రహాలు ప్రస్తుతానికి కనిపెట్టడం జరిగింది. అవి ట్రైటిన్, నెరైడ్‌లు. ఈ గ్రహం తనచుట్టూ తాను తిరగడానికి 18 గంటల 26 నిమిషాల కాలం, సూర్యుని చుట్టూ పరిభ్రమించడానికి 164.8 సంవత్సరాల కాలం పడుతుంది.

## ప్లూటో - యమ (PLUTO)

ఈ గ్రహం 1930లో క్లైడ్ టాంబాగ్ కనుక్కొన్నాడు. ఇది సౌరకుటుంబం లోని గ్రహాల కక్ష్యలో 9వ గ్రహం. గ్రహ పరిధి 1800 మైళ్ళు. ఈ గ్రహానికి

ఒకే ఒక ఉపగ్రహం ఉంది. దాని పేరు షరాన్. తనచుట్టూ ఈ గ్రహం ఒకసారి తిరిగి రావడానికి 6 రోజుల 9 గంటలు పడుతుంది. సూర్యుని చుట్టూ తిరగిరావడానికి 247.7 సంవత్సరాలు పడుతుంది. అంటే దీన్ని కనిపెట్టిన తరువాత ఇది ఇంతవరకు కనీసం ఒక చుట్టు కూడా తిరగలేదన్న మాట.

## రాహుకేతువులు (NODES)

రవిమార్గంలో భూమి సూర్యుని చుట్టూ తిరిగేటప్పుడు భూ ఉపగ్రహమైన చంద్రుడు కూడా అదే మార్గంలో ప్రయాణం చేస్తాడు. ఈ ప్రయాణంలో రవిమార్గాన్ని దక్షిణం నుండి ఉత్తరం వైపు దాటే బిందువును రాహువు అనీ, ఉత్తరం నుండి దక్షిణం వైపు కదులుతూ రవిమార్గాన్ని ఖండించే ప్రదేశాన్ని కేతువు అని అంటారు. అందువల్ల ఈ రెండూ భౌతికమైన ఆకారాలున్న గ్రహాలు కావు. చంద్రునికి సంబంధించిన సున్నితమైన బిందువులివి. అందుకే వీటిని ఛాయాగ్రహాలని అంటారు. ఈ బిందువుల వద్దకే రవి, చంద్రులు వచ్చినపుడు పూర్ణిమ, అమావాస్యలలో గ్రహణాలు ఏర్పడతాయి. చంద్రుని కదలికల వల్ల ఈ బిందువులు స్థిరంగా ఉండక కదులుతూ ఉంటాయి. ఒక పూర్తి మార్పుకు దాదాపు 18 సంవత్సరాల 220 రోజులు లేదా 18.60 సంవత్సరాలు పడుతుంది. అయితే ఈ గ్రహాల గమనం మిగతా గ్రహాల లాగా నిర్దిష్టంగా ఉండదు. అంతేగాక ఈ గ్రహాల గమనం వ్యతిరేక దిశలో ఉంటుంది. వీటి వ్యతిరేక గమనం సంవత్సరానికి దాదాపు 19.36 డిగ్రీలుంటుంది. ఒక గంటకు దాదాపు 8 సెకన్లుంటుంది. ఈ గ్రహాలకు ఉపయోగించుకునే విధానాన్ని బట్టి నిజమైన స్ఫుటం, సరాసరి స్ఫుటం అని రెండు రకాలుంటాయి.

## గ్రహగతులు

గ్రహాలకు తమ కదలికల ననుసరించి కొన్ని ప్రత్యేకాంశాలను తెలియ జేస్తారు.

గతి విషయంలో బింబగ్రహాలైన రవి చంద్రులకు వక్రగతి ఉండదు.

ఛాయాగ్రహాలైన రాహు కేతువులకు ఋజుగతి ఉండదు.

తారాగ్రహాలైన కుజ, బుధ, గురు, శుక్ర, శనులకు మాత్రమే వక్రము, అతిచారం, స్తంభనాదులు ఉంటాయి. ఇవి నిజంగా వక్రమార్గంలో సంచరించడం ఉండదు. కాని భూమికూడా సంచరించే గ్రహం కావడం వల్ల భూమి పైనుండి గమనించే ఒక పరిశీలకునికి వేరు వేరు గ్రహాలు కనిపించే తీరు ఈ వేరు వేరు గతులకు కారణమవుతాయి.

| గ్రహం | వక్రగతికాలం | స్థిరంగా ఉండేకాలం | వక్రంగా ప్రారంభం అయ్యేటప్పుడు రవి నుండి దూరం | తిరిగి ఋజు మార్గంలో |
|---|---|---|---|---|
| బుధుడు | 24 రోజులు | 1రోజు | 14 -20 డిగ్రీలు | 17-20 డిగ్రీలు |
| శుక్రుడు | 42 రోజులు | 2 రోజులు | 29 డిగ్రీలు | 29 డిగ్రీలు |
| కుజుడు | 80 రోజులు | 3 రోజులు | 228 డిగ్రీలు | 132 డిగ్రీలు |
| గురుడు | 240 రోజులు | 5 రోజులు | 245 డిగ్రీలు | 115 డిగ్రీలు |
| శని | 140 రోజులు | 5 రోజులు | 251 డిగ్రీలు | 109 డిగ్రీలు |
| ఇంద్ర | 115 రోజులు | 6 రోజులు | 251 డిగ్రీలు | 103 డిగ్రీలు |
| వరుణ | 157 రోజులు | 6 రోజులు | 259 డిగ్రీలు | 111 డిగ్రీలు |
| యమ | 160 డిగ్రీలు | 7 రోజులు | 260 డిగ్రీలు | 109 డిగ్రీలు. |

## గ్రహాలు - అధిపత్యాలు

పన్నెండు రాశులకు అధిపతులుగా వేరు వేరు గ్రహాలున్నాయి. వీటిలో రవి, చంద్రులకు ఒకే రాశిపై ఆధిపత్యం ఉండగా, మిగిలిన ఐదు తారాగ్రహాలైన బుధ, శుక్ర, కుజ, గురు, శనులు, ఒక్కో గ్రహం రెండు రాశులపై ఆధిపత్యం కలిగి ఉన్నాయి.

రవి సింహరాశికి, చంద్రుడు కర్కాటక రాశికి అధిపతులు. కుజుడు మేషవృశ్చికాలకు, బుధుడు కన్యామిథునాలకు, గురుడు ధనుర్మీనాలకు, శుక్రుడు తులా వృషభాలకు, శని మకర కుంభరాశులకు అధిపతులవుతున్నారు.

ఈ ఆధిపత్యాల విషయంలో రవి చుట్టూ వరుసలో తిరిగే గ్రహాల వరుసనే కనిపిస్తుంది. ఆకాశంలో రవి చుట్టూ ఖగోళశాస్త్రం రీత్యా వరుసగా బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని గ్రహాలు ఆ యా గ్రహాల కక్ష్యల్లో తిరుగుతున్నట్లుగా కనిపిస్తాయి. అదేవిధంగా సింహరాశికి అధిపతి రవి అయితే, కన్యకు బుధుడు, తులకు శుక్రుడు, వృశ్చికానికి కుజుడు, ధనుస్సుకు గురుడు, మకరానికి శని అధిపతులు. కర్కాటకానికి చంద్రుడు ఆధిపత్యం వహిస్తే మిథునానికి బుధుడు, వృషభానికి శుక్రుడు, మేషానికి కుజుడు, మీనానికి గురుడు, కుంభానికి శని అధిపతులవుతున్నారు. ఈ విధంగా ఈ ఆధిపత్యాల విషయంలో కూడా ఒక క్రమపద్ధతి భారతీయ జ్యోతిశ్శాస్త్రంలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిథునం |
| కుంభం | సవ్య రాశిచక్రం | | కర్కాటకం |
| మకరం | | | సింహం |
| ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య |

| | | | |
|---|---|---|---|
| గురు | కుజుడు | శుక్రుడు | బుధుడు |
| శని | రాశులు అధిపతులు | | చంద్రుడు |
| శని | | | రవి |
| గురు | కుజ | శుక్ర | బుధ |

## గ్రహాలు - ఉచ్చనీచలు - మూలత్రికోణాలు :

ప్రతి గ్రహానికి కూడా ఉచ్చ స్థానం, నీచస్థానం, మూల త్రికోణ స్థానాలు ఉంటాయి. ఉచ్చ స్థానం ఆదర్శానికి. నీచ స్వార్థానికి, మూలత్రికోణం, స్వక్షేత్రాలు స్వతంత్రానికి సంకేతాలుగా పరిగణిస్తారు.

రవికి - మేషం, చంద్రునికి - వృషభం, కుజునికి - మకరం, బుధునికి - కన్య, గురునికి - కర్కాటకం, శుక్రునికి - మీనం, శనికి - తుల ఉచ్చస్థానాలుగా చెప్పబడుతున్నాయి.

ఉచ్చ స్థానాలకు సరిగా ఎదురుగా ఉండే రాశులను ఆ యా గ్రహాల విషయంలో నీచరాశులుగా చెప్తారు. అవి రవికి - తుల, చంద్రునికి - వృశ్చికం, కుజునికి - కర్కాటకం, బుధునికి - మీనం, గురునికి - మకరం, శనికి - మేషం నీచ స్థానాలుగా చెప్పబడుతున్నాయి.

వీటిలో పరమోచ్చ, పరమనీచ బిందువులు కూడా గుర్తింపబడినాయి. అవి రవికి మేషంలో 10 వడిగ్రీ పరమోచ్చ. చంద్రునికి వృషభంలో 3వ డిగ్రీ, కుజునికి మకరంలో 28వ డిగ్రీ, బుధునికి కన్యలో 15వ డిగ్రీ, గురునికి కర్కాటకంలో 5వ డిగ్రీ, శుక్రునికి మీనంలో 27వ డిగ్రీ, శనికి తులలో 20వ డిగ్రీ పరమోచ్చ స్థానాలుగా చెప్పబడుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| శుక్ర | రవి | చంద్ర | |
| | గ్రహాలు | | గురు |
| కుజ | ఉచ్చస్థానాలు | | |
| | | శని | బుధ |

| | | | |
|---|---|---|---|
| బుధ | శని | | |
| | గ్రహాలు | | కుజ |
| గురు | నీచస్థానాలు | | |
| | చంద్ర | రవి | శుక్ర |

అదేవిధంగా రవికి తులలో 10వ డిగ్రీ పరమనీచ, చంద్రునికి వృశ్చికంలో 3వ డిగ్రీ, కుజునికి కర్కాటకంలో 28వ డిగ్రీ, బుధునికి మీనంలో 15వ డిగ్రీ, గురునికి మకరంలో 5వ డిగ్రీ, శుక్రునికి కన్యలో 27వ డిగ్రీ, శనికి మేషంలో 20వ డిగ్రీ పరమనీచ స్థానాలుగా గుర్తించబడినాయి.

**మూలత్రికోణాలు** : రవికి సింహం, చంద్రునికి వృషభం, కుజునికి మేషం, బుధునికి కన్య, గురునికి ధనుస్సు, శుక్రునికి తుల, శనికి కుంభం మూలత్రికోణాలుగా తెలియజేయబడినాయి.

## గ్రహాలు - దశావస్థలు

1. స్వస్థావస్థ : స్వక్షేత్రంలో ఉన్న గ్రహం స్వస్థావస్థను పొందుతుంది.
2. దీప్తావస్థ : ఉచ్ఛక్షేత్రంలో ఉన్న గ్రహం పొందే అవస్థ
3. ముదితావస్థ : మిత్రక్షేత్రంలో ఉన్న గ్రహావస్థ.
4. శాంతావస్థ : సమక్షేత్రంలో ఉన్న గ్రహం పొందేస్థితి.
5. శక్తావస్థ : వక్రించి ఉన్న గ్రహం యొక్క అవస్థ.
6. పీడావస్థ : రాశి అంతంలో 9వ పాదంలో ఉన్న గ్రహం పీడావస్థ.
7. దీనావస్థ : శత్రుక్షేత్రంలో ఉన్న గ్రహం పొందే అవస్థ.
8. వికలావస్థ : అస్తంగతమైన గ్రహం పొందే అవస్థ.
9. ఖలావస్థ : నీచయందున్న గ్రహం పొందే అవస్థ.
10. భీతావస్థ : అతిచారమందున్న గ్రహం పొందే అవస్థ.

స్వస్థ, దీప్త, ముదిత, శాంతావస్థల్లోని గ్రహాలు శుభఫలితాలను ఇస్తాయి. శక్తావస్థలో శుభగ్రహాలు వక్రిస్తే శుభాన్ని, అశుభగ్రహాలు వక్రిస్తే ఇబ్బందులను కలిగిస్తాయి. పీడ, దీన, వికల, ఖల, భీతావస్థలలోని గ్రహాలు అశుభఫలితాలను గాని, పూర్తిఫలితాలను ఇవ్వకపోవడం గాని చేస్తాయి.

## గ్రహ మిత్ర శత్రుత్వాలు

రవి, చంద్ర, గురు, కుజ గ్రహాలు నైసర్గిక మిత్రగ్రహాలు. అదేవిధంగా బుధ. శుక్ర, శని గ్రహాలు అత్యంత మిత్రత్వం ఉన్న గ్రహాలు. రవికి శనికి, బుధ చంద్రులకు, శుక్ర గురులకు, శని కుజులకు పరస్పరం వైరం ఉంటుంది. ఈ విశేషాలను గమనిస్తే ప్రతి గ్రహానికి మిత్ర, శత్రు, సములనేవారుంటారు.

| గ్రహం | మిత్రులు | శత్రువులు | సములు |
|---|---|---|---|
| రవి | చంద్ర, కుజ, గురు | శుక్ర, శని | బుధ |
| చంద్ర | రవి, బుధ | – | కుజ, గురు, శుక్ర, శని |
| కుజ | రవి, చంద్ర, గురు | బుధ | శుక్ర, శని |
| బుధ | రవి, శుక్ర | చంద్ర | కుజ, గురు,శని |
| గురు | చంద్ర, కుజ, రవి | బుధ, శుక్ర | శని |
| శుక్ర | బుధ, శని | రవి, చంద్ర | కుజ, గురు |
| శని | బుధ, శుక్ర | రవి, చంద్ర,కుజ | గురు |
| రాహు | శుక్ర, శని | రవి, చంద్ర, కుజ | గురు, బుధ |
| కేతు | రవి, చంద్ర, కుజ | శుక్ర, శని | బుధ, గురు |

## గ్రహ దృష్టులు

ప్రతిగ్రహం కూడా తానున్న స్థానం నుండి సప్తమస్థానాన్ని (180 డిగ్రీలు) చూస్తుంది. ఇదే కాక కుజుడు 4,8 స్థానాలను అందున్న గ్రహాలను, గురుడు 5,9 స్థానాలను అందున్న గ్రహాలను, శని 3,10 స్థానాలను అందున్న గ్రహాలను చూస్తారు. గురునికి ఆచ్ఛాదన దృష్టి మరొకటి ఉంది. ఈ గ్రహం తానున్న రాశినుండి మూడు, పదకొండవ స్థానాలను, అందులోని గ్రహాలను చూస్తుంది.

గ్రహాలు శుభస్థితిలో ఉండి చూస్తే శుభఫలితాలను, పాప సంబంధం కలిగి చూస్తే పాప ఫలితాలను ఇస్తాయి.

**పాదదృష్టి :** 3,10 స్థానాలను చూసే దృష్టిని పాదదృష్టి అంటారు. శని పాదదృష్టిలో బలవంతుడు.

**అర్ధదృష్టి :** 5,9 స్థానాలు చూసే దృష్టిని అర్ధదృష్టి అంటారు. ఈ దృష్టిలో గురుడు బలవంతుడు.

**త్రిపాదదృష్టి :** 4,8 స్థానాలను చూసే దృష్టిని త్రిపాద దృష్టి అంటారు. ఈ దృష్టిలో కుజుడు బలవంతుడు.

**పూర్ణదృష్టి :** 7వ స్థానాన్ని చూసే దృష్టిని పూర్ణదృష్టి అంటారు. ఈ దృష్టిలో అన్ని గ్రహాలు బలమైనవే.

## గ్రహాలు - షడ్బలాలు

గ్రహాలకు ఆరు రకాల బలాలు ఉంటాయి. వాటినే షడ్బలాలు అంటారు. అవి 1. స్థాన 2. దిక్ 3. చేష్టా 4. కాల 5. దృక్ 6. నైసర్గిక బలాలు.

**1. స్థానబలం :** స్థానబలం ఐదురకాల బలాల సముదాయం. అవి 1. ఉచ్చబలం 2. సప్తవర్గజ బలం 3. ఓజయుగ్మరాశ్యాంశబలం 4. కేంద్రబలం 5. ద్రేక్కాణబలం. స్థానబలం బాగా ఉన్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో వ్యక్తికి తనచుట్టూ ఉన్నవారు, సహచరులు సహకరిస్తారు. వ్యక్తులు అభివృద్ధికరమైన, అనుకూలమైన ప్రదేశాల్లోకి చేరుతారు. తామున్న స్థానాలు లేదా తాము చేరిన స్థానాలు తమకు యోగిస్తాయి. ఈ బలం బాగాలేని గ్రహం యొక్క దశాంతర్దశల్లో తమ చుట్టుప్రక్కల వారు తమకు సహకరించక అనేక రకాల ఇబ్బందులకు గురవుతారు. తామున్న స్థానంలో తమకు శత్రుత్వాలు, ఇబ్బందులు పెరుగుతాయి.

**2. దిగ్బలం :** లగ్నస్థానంలో బుధగురులు, చతుర్థంలో శుక్రచంద్రులు, సప్తమంలో శని, దశమంలో అంగారకుడు, సూర్యుడు బలవంతులుగా ఉంటారు. దీనినే దిగ్బలమంటారు. దిగ్బలం బాగా ఉన్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో ఏ గ్రహానికి సంబంధించి బాగా ఉందో ఆ గ్రహం యొక్క దిక్కు అనుకూలమై శుభప్రదమౌతుంది. ఆ యా దిక్కులకు వెళ్ళడం, ఆ ప్రదేశాలతో అనుబంధాలు సమకూర్చుకోవడం వంటి పనులు ఈ బలం బాగా ఉన్న సమయంలో కలుగుతాయి.

**3. చేష్టాబలం :** రవి చంద్రులు ఉత్తరాయణంలో వున్నప్పుడు బలం కలిగిన వారవుతారు. తక్కిన 5 గ్రహాలు వక్రించినపుడు, గ్రహయుద్ధంలో గెలిచినపుడు, పూర్ణ చంద్రునితో కూడినపుడు చేష్టాబలం కలవారౌతారు. చేష్టాబలం బాగా ఉన్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో వ్యక్తులు తమవైన పనులు, ఆలోచనలు, సక్రమంగా నిరాటంకంగా నిర్వహిస్తారు. శ్రమ, ధనం, కాలం వ్యర్థం కాకుండా ఉపయోగపడతాయి.

**4. కాలబలం :** రవి గురు శుక్రులు పగటికాలంలోనూ, శని కుజ చంద్రులు రాత్రికాలంలోనూ బలవంతులు. బుధుడు రాత్రింబవళ్ళు బలం కలిగి ఉంటాడు. శుక్లపక్షంలో శుభగ్రహాలు, కృష్ణపక్షంలో పాపగ్రహాలు బలవంతులు. ఆ యా హోర సంవత్సర మాస వాసరాలలో ఆయా హోరాధిపతులు బలవంతులు. కాలబలం గమనించడానికి తొమ్మిదిరకాల బలాలను గణించాలి. అవి 1. నతోన్నతబలం 2. పక్షబలం 3. త్రిభాగఫలం 4. అబ్దఫలం 5. మాసబలం 6. వారబలం 7. హోరాబలం 8. అయనబలం 9. యుద్ధబలం.

కాలబలం బాగా వున్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో సకాలంలో పనులు పూర్తిగావడం, కాలం వ్యర్థంకాకపోవడంవంటి మంచి జరుగుతుంది.

కాలబలం బాగాలేని గ్రహం యొక్క దశాంతర్దశ సకాలానికి పనులు పూర్తిగాక ఇబ్బందులు పెడుతుంది.

**5. దృగ్బలం :** శుభగ్రహవీక్షణం కలిగి ఉన్న గ్రహాలు దృగ్బలాన్ని పొందుతాయి. దృగ్బలం బాగా ఉన్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో వ్యక్తులపై దృష్టికి సంబంధించిన దోషం పడకుండా రక్షణ కలుగుతుంది. విషయగ్రహణకు ఈ బలం బాగా సహకారి అవుతుంది. దృగ్బలం లేని గ్రహం యొక్క దశాంతర్దశల్లో విషయదృష్టి సరిగా లేక ఇబ్బందులు ఎదురౌతాయి.

**6. నైసర్గికబలం :** శని-కుజ-బుధ-గురు-శుక్ర-చంద్ర-రవులు ఉత్తరోత్తర వృద్ధిని బలవంతులు. అంటే శనికంటే కుజుడు, కుజుని కంటే బుధుడు, బుధుని కంటే గురుడు, గురుని కంటే శుక్రుడు, శుక్రుని కంటే చంద్రుడు, చంద్రుని కంటే సూర్యుడు బలవంతులు. ఇది నైసర్గికబలం.

ఈ బలం బాగా ఉన్న గ్రహం యొక్క దశాంతర్దశల్లో వ్యక్తి తనమైన ప్రవృత్తి, భావం అన్నీ స్థిరపడి బలవత్తరమై అందరికీ మార్గదర్శకమౌతాయి.

## షోడశ వర్గులు

రాశిచక్రంలో మొత్తం 360 డిగ్రీలుంటాయి. ఒక్కో రాశిలో 30 డిగ్రీలుంటాయి. ఈ 30 డిగ్రీలను అనేక సూక్ష్మ భాగాలు చేస్తూ ఒక్కో భాగం యొక్క ప్రత్యేకతను అధ్యయనం చేయడం షోడశవర్గుల ప్రత్యేక లక్షణం. షోడశ వర్గులు 16. వీటిలో షడ్వర్గులు, సప్తవర్గులు, దశవర్గులు అనే విభజనలున్నాయి.

రాశి, హోర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలు షడ్వర్గులు.

రాశి, హోర, ద్రేక్కాణం, సప్తమాంశ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాశలను సప్తవర్గులు.

రాశి, హోర, ద్రేక్కాణం, సప్తమాంశ, నవాంశ, దశమాంశ, ద్వాదశాంశ, షోడశాంశ, త్రింశాంశ, షష్ట్యంశలను దశవర్గులు.

1. రాశి 2. హోర 3. ద్రేక్కాణం 4. చతుర్థాంశ 5. సప్తమాంశ 6. నవాంశ 7. దశమాంశ 8. ద్వాదశాంశ 9. షోడశాంశ 10. వింశాంశ 11. చతుర్వింశాంశ 12. సప్తవింశాంశ 13. త్రింశాంశ 14. ఖవేదాంశ 15. అక్షవేదాంశ 16. షష్ట్యంశలు షోడశవర్గులు.

ఈ షోడశవర్గుల సంక్షిప్త వివరాలను ఇక్కడ పరిశీలిద్దాం.

**1. రాశి :** పూర్తి ప్రమాణం. 30 డిగ్రీలు.

**2. హోర :** 15 డిగ్రీలు (1/2)

**3. ద్రేక్కాణం :** 10 డిగ్రీలు (1/3)

**4. చతుర్థాంశ :** 7.30 డిగ్రీలు (1/4)

**5. సప్తమాంశ :** 4.17 డిగ్రీలు (1/7)

**6. నవాంశ :** 3.20 డిగ్రీలు (1/9)

**7. దశమాంశ :** 3 డిగ్రీలు (1/10)

**8. ద్వాదశాంశ :** 2.30 డిగ్రీలు (1/12)

**9. షోడశాంశ :** 1.52.30 డిగ్రీలు (1/16)

**10. వింశాంశ :** 1.30 డిగ్రీలు (1/20)

**11. చతుర్వింశాంశ :** 1.15 డిగ్రీలు (1/24)

**12. భాంశ :** 1.6.40 డిగ్రీలు (1/27)

**13. త్రింశాంశ :** 1 డిగ్రీ (1/30)

**14. ఖవేదాంశ :** 45 మినిట్లు (1/40)

**15. అక్షవేదాంశ :** 40 మినిట్లు (1/45)

**16. షష్ట్యంశ :** 30 మినిట్లు (1/60)

## షోడశవర్గులు - ఉపయోగాలు

| | |
|---|---|
| లగ్నం - శరీరం | హోర - సంపద |
| ద్రేక్కాణం - సోదరులు | చతుర్థాంశ - భాగ్యం |
| సప్తమాంశ - పుత్రపౌత్రులు | నవాంశ - కళత్రం |
| దశమాంశ - వ్యక్తి ఉన్నతి | ద్వాదశాంశ - మాతాపితరులు |
| షోడశాంశ - వాహనాదులు | వింశాంశ - దేవతోపాసన |
| చతుర్వింశాంశ - విద్య | భాంశ - గ్రహబలాబలాలు |
| త్రింశాంశ - అరిష్టాలు | ఖవేదాంశ - శుభాశుభాలు |
| అక్షవేదాంశ - శుభాశుభాలు | షష్ట్యంశ - శుభాశుభాలు |

సాధారణంగా భావాలను బట్టి పరిశీలించే విషయాలను, ఆయా ప్రత్యేక అంశాలకు అనుగుణంగా ఆయా చక్రాల ద్వారా ప్రత్యేకంగా పరిశీలించాలి. షోడశవర్గుల్లో గ్రహాలు ఎక్కువగా శుభ, మిత్ర స్థానాల్లో ఉంటే అవి తమ దశాంతర్దశల్లోనూ, భావ ఫలితాలను ఇచ్చే సందర్భంలోనూ శుభ ఫలితాలనే ఇస్తాయి. ఏ విషయాన్ని పరిశీలిస్తుంటామో ఆ విషయానికి సంబంధించిన అంశను వేసుకొని పరిశీలించడం వల్ల మంచి ఫలితాలు వస్తాయి.

## గ్రహాలు - కారకత్వాలు- స్వరూప స్వభావాలు

జాతక ఫలనిర్ణయానికి గ్రహ, భావ, రాశుల యొక్క కారకత్వాలు పూర్ణంగా తెలిసి ఉండాలి. ఆ యా భావాలు ఏ రాశులకు సంబంధించినవో, ఆ భావాలకు అధిపతులైన గ్రహాలు ఏవో వాటి స్వరూప స్వభావాలు పరిపూర్ణంగా తెలిస్తే తప్ప సరియైన ఫలితాన్ని నిర్ణయించలేం. అందువల్ల జ్యోతిర్విద్యాభ్యాసంలో గ్రహ, భావ, రాశి కారకత్వాలు, స్వరూప స్వభావాలను అధ్యయనం చేయడం తప్పనిసరి. వాటిలో ముందు గ్రహాల గూర్చిన వివరాలు స్థూలంగా అధ్యయనం చేద్దాం.

**1. రవి :** గ్రహరాజైన రవి తేనెరంగులాగా పింగళవర్ణం గల నేత్రాలు కలవాడు, సమమైన దేహం కలవాడు, పరిశుద్ధుడు, పిత్తప్రకృతి, ధీమంతుడు, పురుష గ్రహం, తక్కువ కేశసంపద కలవాడు.

శరీరం, పితృప్రభావం, శివోపాసన, ధైర్యం, రుచి, జ్ఞానోదయం, మనశ్శుద్ధి, ప్రవాళం, ఠాణ్యం, భూషణం, రుధిరం, పిత్తం, కఫం, శిరోవ్యాధి, సాత్త్వికం, దుర్వ్యయం, ఆత్మ, నేత్రచికిత్స, అక్షి, యజ్ఞం, సువర్ణం, అశ్వం, సింహాసనం, శౌర్యం, దుర్గం, దినబలం, ఉష్ణశక్తి ఖగోళ పరిజ్ఞానం, రాజాశ్రయం, కెంపు, రాగి, రక్తచందనం, సృజనాత్మకశక్తి నిర్వహణ సమర్థత, గౌరవ ప్రతిష్ఠలు, పోషకత్వం, దాతృత్వం, పందేలు, పోటీలు, గౌరవ పదవులు,అధికారం, ఠీవి, హుందాతనం, వ్యక్తిత్వం, ప్రభుత్వ ఉద్యోగాలు, రాజకీయాలు, పరిపాలన మొదలైన కారకత్వాలుంటాయి.

**2. చంద్ర :** వాత కఫ ప్రకృతి కలిగినవాడు, పండితుడు, గుండ్రని శరీరం కలిగినవాడు, శుభదృష్టికలవాడు, మధురమైన వాక్కు కలిగినవాడు, చంచల స్వభావి, కామపీడితుడు చంద్రుడు.

మాతృకారకుడు, సౌఖ్యం, మనస్సు, బుద్ధి, వస్త్రం, జలం, భోజనం, నిద్ర, స్త్రీ, ముఖం, ఉదరం, బాహువులు, రజతం, క్షయం, అపస్మారం, గుల్మం, శక్తి, యశస్సు, సౌందర్యం, ఛత్రం, చామరం, యాత్ర, స్ఫటికం, పట్టువస్త్రాలు, బావి, శుక్రపుష్టి, సంతోషం, రాత్రిబలం, ఆహారపానీయాలు, రసపదార్థాలు, నౌకాయానం, నిత్యావసరాలు, వసతి కల్పన, మాతృవర్గీయులు, బంధువులు, హృదయభావాలు, స్పందన, ప్రతిస్పందన మొదలైన అంశాలు చంద్ర కారకత్వాలవుతాయి.

**3. కుజ :** ఎర్రని కండ్లు కలవాడు, క్రూరుడు, చంచలుడు, ఉదార హృదయం కలవాడు, పిత్తప్రకృతి, క్రోధం అధికంగా కలవాడు, కృశించిన మధ్యమదేహం కలవాడు కుజుడు.

భ్రాతృ, భూమి, వ్యవసాయం, యుద్ధం, పరాక్రమం, చోరత్వం, శత్రుత్వం, కోపం, మూర్ఖత్వం, ఆయుధధారణం, యంత్రం, తంత్రం, సేనాధిపత్యం, వాగ్వాదం, ఉష్ణం, పిత్తం, వ్రణాలు, క్షయం, పరదేశగమనం, కామం, ఉద్యానవనం, పరదూషణం, గణితం, బంగారం, ఋణం, నాయకత్వం, గుర్తింపు, ప్రాధాన్యం, కార్యారంభ కుతూహలం, ఉత్సాహం, చురుకుదనం, ధైర్యం, సాహసం, ప్రేరణ, చైతన్యం, కలహశీలం, తలబిరుసుదనం, అహంభావం, అహంకారం, దుడుకుదనం, స్వతంత్ర ప్రవర్తన, మహిళలకు భర్తృ కారకత్వం, శరీరంలో తల, మెడ, క్షణికావేశాలకు లోనుకావడం తనకు తోచినట్లు వర్తించడం తదితర అంశాలు కుజకారకత్వాలౌతాయి.

**4. బుధ :** సుందరదేహం, శ్లేషతో కూడిన వాక్కు హాస్యప్రీతి, వాత, పిత్త, కఫ ప్రకృతి, భావప్రకటన, విషయ గ్రహణశక్తి, ఆలోచనా పటిమ బుధ గ్రహ తత్త్వాలు.

జ్యోతిషం, వేదాంతం, వాణిజ్యం, శిల్పం, యంత్రం, తంత్రం, నపుంసకత్వం, సేవకులు, యుక్తి, విష్ణూపాసన, వ్యాకరణం, పురాణం, మృదువచనం, అశ్వం, కంఠం, నాభి, గుహ్యం, వామకర్ణం, రత్నపరీక్ష, దాయాదులు, సాధుత్వం, మాతులచింత, మైథునం, వాక్కు, విద్య, వినయం, వివేకం, మిత్రుడు, సగోత్రుడు, గణితం, వేదం, పాండిత్యం, శిల్పి, కళాకారుడు, కావ్యకౌశలం, మాతామహుడు, యంత్రాలు, మంత్రాలు, గుర్రం, భయం, నృత్యం, కోశాగారం, తీర్థయాత్రలు, వాయువ్యప్రీతి, గోపురాలు బుధ కారకత్వాలు. మానసిక రుగ్మతలు, మతిభ్రమణం, నరాల బలహీనత, ఉదర వ్యాధులు, మూగతనం, నత్తి మొదలైన వ్యాధులకు ఇతడు కారకుడు.

**5. గురు :** విశాలదేహం కలవాడు, పింగళవర్ణం గల కేశాలు, నేత్రాలు కలవాడు, కఫప్రకృతి, ధీమంతం, సర్వశాస్త్ర పారంగత్వం గురుని తత్త్వం.

ధనం, పుత్రులు, దేహపుష్టి, బుద్ధి, సంపద, మృదుభాషణ, జ్యోతిషం, మేడ, పల్లకి, సింహాసనం, స్వర్గలోక సంచారం, పౌత్రులు, గృహసౌఖ్యం, ఆచారం, దాతృత్వం, వాచాలత్వం, పశుసంపద, హృదయం, తపస్సు, జ్యేష్ఠ సోదరుడు, బంధువులు, బంగారం, నిక్షేపం, వైదూర్యం, కావ్యజ్ఞానం, సద్వ్యయం, వాతం, శ్లేష్మం, అగ్నిమాంద్యం, దంతాలు, మంత్ర, వేదాంత, బ్రాహ్మణ భక్తి శ్రద్ధ, కీర్తి, గౌరవం, విద్య, విజ్ఞానం, ఉన్నతాశయాలు, ఉన్నత విద్యాభ్యాసం, విదేశ వ్యవహారాలు, దూర దృష్టి, శాస్త్రబోధన, పుస్తక ప్రచురణ, ప్రసంగాలు, ప్రసారాలు, శరీరంలో పిరుదులు, తొడలు, రక్తనాళాలు గురు కారకత్వాలవుతాయి.

**6. శుక్ర :** సుఖం కలవాడు, సుందరదేహం కలవాడు, శ్రేష్ఠుడు, యోగ్యమైన నేత్రాలు కలవాడు, కావ్యరచన చేసేవాడు, కఫవాత ప్రకృతి కలవాడు, మెలికలు తిరిగిన వెంట్రుకలు కలవాడు శుక్రుడు.

కళత్ర, వివాహ, కీర్తి, నేత్ర, వాహన, సౌందర్య, సరస సల్లాప, నృత్య, గీత, కవిత్వ, రతి, రాజముద్రాధికారం, కామసుఖం, క్రయవిక్రయాలు, ఏనుగు, గుర్రం, వెండి, ముత్యాలు, జారత్వం, వంశం, పుష్పం, గంధం, భోగం, యజుర్వేదం, జలక్రీడ, భరతశాస్త్రం, గాంభీర్యం, జలసంచారం, పరిమళం, అతిమూత్రం, వింజామరలు, కళానైపుణ్యం, అష్టైశ్వర్యాలు, సింహాసనం, ప్రభుత్వం, భార్యాసుఖం, జన సంబంధాలు, విలాస వస్తువులు శుక్రుని కారకత్వాలు. శరీరంలో గొంతు, మెడ, నాభి, మూత్రపిండాలు ఇతనికి వర్తిస్తాయి.

**7. శని :** కృశించిన పొడవైన దేహం కలవాడు, పింగళవర్ణం గల నేత్రాలు కలవాడు, వాతప్రకృతి, పెద్దదంతాలు, ప్రకాశించే సమూహం, కఠినరోమాలు, కేశాలు కలవాడు శని.

ఆయువు, హూణవిద్య, దాస్యం, అనాచారం, నపుంసకత్వం, అబద్ధం, ఔదార్యం, బంధనం, దుఃఖం, జూదం, అడవుల సంచారం, అన్యకులవిద్య,

కుచ్చితం, పౌరుషం, పాపం, నరకం, మరణం, వాతం, వాద్యధ్వని, జీవనోపాయం, దుస్సహవాసం, కార్యభంగం, కిరాతత్వం, వ్యసనం, మూర్ఖం, నల్లధాన్యం, మహిషం, పితృకారకత్వాలు శనికి ఉంటాయి. ఉపాధులకు అవసరమైన కృషి, కార్యసాధక దృష్టి, క్రమశిక్షణ, ఏ పనికైనా శక్తివంచన లేకుండా శ్రమపడడం, ఓర్పు, నిదానం, సహనం, సుస్థిరత, భద్రత మొదలైన అంశాలు శనికి వర్తిస్తాయి. శరీరంలో మోకాలు, ఎముకలు ఇతనికి సంబంధించినవి.

**8. రాహు :** పొగవంటి ఆకారం, నల్లని శరీరం, వనాలలో సంచారం, భయంకరం, వాతప్రకృతి, ధీమంతం రాహువు యొక్క లక్షణాలు.

మాతామహ, హూణవిద్య, ఉద్యానవనం, ఛత్రం, చామరం, రాజ్యం, జూదం, పరదేశగమనం, నీచాశ్రయం, శ్వాస, అన్యభాష, ప్రేతత్వం, కర్మ, ధైర్యం, ప్రతాపం, ధూమం, స్మశానం, తస్కరం, భేదం, వైధవ్యం, వ్యవహారం, వృక్షపతనం, శిలలు, వైరాగ్యం, బలాత్కారం, భ్రష్టత్వం, మహారణ్యం, ఘోరయుద్ధం, ధనార్జన, కష్టసుఖాలు, మహోత్పాతం, జ్వరాపస్మారం, విషూచి, సంకోచం మొదలైనవి రాహు కారకత్వాలు.

**9. కేతు :** కేతువు రాహువుల స్వరూపాదుల విషయంలో దాదాపు సమానమైన లక్షణాలే ఉంటాయి.

మోక్షం, గంగాస్నానం, వైరాగ్యం, మంత్రశాస్త్రం, ఐశ్వర్యం, భోగం, భాగ్యం, వేదాంతం, జ్ఞానం, మూఢభక్తి, పిత్తం, లోభం, అన్యభాష, మిత్రభేదం, శూల, స్ఫోటకం, విశూచి, వ్రణం, శైవదీక్ష, పితామహ, చపలత్వం, బ్రహ్మవేత్తత్వం, మతం, దంభం, నటన, భిక్షాటన, కలహం, వికారం, కీర్తి, ప్రతాపం, కపాలం, పాషాణం స్నేహం మొదలైనవి కేతుకారకత్వాలు.

**10. యురేనస్ (ఇంద్ర) :** పాశ్చాత్య మతం ప్రకారం ఇంద్రుడు కుంభరాశికి అధిపతి. చురుకైన చూపులు, అతివేగమైన ఆలోచన, క్షణంలో నిర్ణయాలు తీసుకోవడం, పెద్దపెద్ద మార్పులు అతిత్వరగా చేయడం,

అత్యాధునికత, అతి ప్రాచీనత, సమయ స్ఫూర్తి, అభ్యుదయం, పరివర్తన, సంస్కరణ, జాతి, మత, కుల, ప్రాంత, దేశ భేదాలకు అతీతంగా ఆలోచించే మనస్సు, ఆధ్యాత్మిక యోగమార్గాల్లో లోతులకు చేరుకోవడం, నయంకాని, అంతుపట్టని వ్యాధులు, ఇంద్రజాలం, హిప్నాటిజం, జ్యోతిషం, ఆకాశ రహస్య ధర్మాలు, అణువుకు బ్రహ్మాండానికి సమన్వయం, కంపెనీలు, యూనియన్లు సహకార సంఘాలు, కార్పొరేషన్లు తదితర అంశాలు ఇంద్ర కారకత్వానికి వర్తిస్తాయి.

**11. నెప్ట్యూన్ (వరుణ) :** పాశ్చాత్యుల ప్రకారం మీనరాశికి వరుణుడు అధిపతి. అర్ధనిమీలిత నేత్రాలు, కనుగ్రుడ్డు లోపలి భాగంలో కనిపించే స్వచ్ఛత, పరవశం చెందే స్వభావం, ఓడలపై వ్యాపారం, అప్రయత్నంగా వాతావరణంలోని మార్పులు, అదృశ్య శక్తులు, నిరంతర మద్యపానం, నిద్రమత్తు, జలోదరం, భక్తి యోగ సాధనలు, రసద్రవ్యాలు, మాదకద్రవ్యాలు, మత్తు పదార్థాలు, ప్రతిబింబాలు, నీడలు, ప్రతిరూపాలు, ఛాయాగ్రహణం, ఫొటోలు, ఫిల్ములు, అలంకరణ, రంగులు, అద్దకాలు, పాదాలు, పాదరక్షలు తదితర సౌందర్య పోషక పదార్థాలు, ఊహలు, రచనలు, కల్పనలు, కలలు, భ్రమలు, వదంతులు, రుచులు, ఆహారపానీయాలు, ఆలయాలు, వైదికవృత్తులు, గూఢచారి పనులు చెరసాలలు, ప్రవాసం, రహస్య స్థావరాలు తదితర అంశాలు వరుణ కారకత్వాలు.

**12. యమ :** సాయన వృశ్చికరాశికి అధిపతి యముడు. ఆయువు, మృతి, మృతుల విషయాలు, వారసత్వం, భీమా, లైంగిక సంబంధాలు, పెన్షన్, నష్టపరిహారం, పరధనం, పరాధీనత, పాతవస్తువులు, చెత్త, మూత్రాశయ వ్యాధులు, అవయవాల మార్పిడి, శవపరీక్ష, జంతువధ, మాంసవిక్రయ వ్యాపారం, నూతన ప్రక్రియల్లో గర్భధారణ, వ్యభిచారం, కాలుష్యనివారణ, శ్రమపడని ఆదాయం, ఋణ సంస్థలు ద్రవ్యమారకం తదితర అంశాలు ప్లూటో కారకత్వాలు.

## భావాలు - స్వభావాలు - కారకత్వాలు

**లగ్నభావం :** శరీరం, రూపం, జ్ఞానం, వర్ణం, బలం, దౌర్బల్యం, సుఖదుఃఖాలు, స్వభావం, ఆశయాలు, అభిరుచులు, దృక్పథాలు, ఆలోచనాసరళి, పట్టుదల, నిత్య కృషిశీలత, చక్కని ప్రయత్నం తదితర అంశాలు లగ్నభావం నుండి పరిశీలించాలి.

**ద్వితీయ/ధనభావం :** ధనం, ధాన్యం, కుటుంబం, మృత్యువు, శత్రువు, ధాతువులు, రత్నాదికాలు, మృదువాక్కు, దాతృత్వం, ఆస్తికత్వం, కన్ను, స్నేహం, లోభం, ధన సంపాదనకు ప్రయత్నం, సహాయం, కలిమి, లేమి, బ్యాంకు నిల్వలు, వాటాలు, విలువైన వస్తువులు తదితర అంశాలు ధనభావం నుండి పరిశీలించాలి.

**తృతీయ/సహజభావం :** పరాక్రమం, సేవకులు, సోదరీ సోదర వర్గం, దగ్గర ప్రయాణాలు, పితృమరణం, కంఠం, రచన, శ్రవణం, దాసీజనం, దగ్గరి బంధువులు, సహకారం, చిత్తచాంచల్యం, సహోధ్యాయులు, సమీపవ్యక్తులు, సంభాషణ, పరామర్శ, ప్రచారం, ప్రసారం, కమ్యూనికేషన్లు, పుస్తకపఠనం తదితర అంశాలు సహజభావం నుండి పరిశీలించాలి.

**చతుర్థ/మాతృభావం :** సుఖం, వాహనాలు, బంధువులు, మాతృసౌఖ్యం, గృహం, ఆహారం, కృషి, విద్య, తల్లి ఆరోగ్యం, భూములు, సుగంధ ద్రవ్యాలు, అభివృద్ధి, జన్మస్థలం, తల్లితరపు బంధువులు, చేపట్టినపదవి, అధిష్ఠించిన ఆసనం, కార్యాలయం మొదలైన అంశాలు చతుర్థ భావం ద్వారా చూడాలి.

**పంచమ / సంతానభావం :** సంతానం, యంత్రాలు, మంత్రదీక్ష, విద్య, బుద్ధి, పుత్రులు, రాజ్యలాభం, పదవీచ్యుతి, మంచి స్వభావం, మనస్సు, ఆలోచన, పితృధనం, రహస్యాలు, కార్యాచరణం, సంతృప్తి, పాండిత్యం, వంశపరంపరాగతమైన మంత్రిపదవి, సంతతికి సంబంధించిన విషయాలు,

అనురాగం, ఆత్మీయత, సరదాలు, లలితకళలు, పరపాలనా సమర్థత, ప్రసూతి వైద్యం, సృజనాత్మకత, హృదయానికి సంబంధించిన విషయాలు పంచమభావం ద్వారా పరిశీలించాలి.

**షష్ఠ/ రోగభావం :** మేనమామ, మృత్యుభయం, వాణిజ్యం, నష్టవస్తుపరిజ్ఞానం, ఆత్మ మరణాలు, రోగం, యుద్ధం వల్ల కలహం వల్ల వచ్చే సంపద, లోభం, అస్వస్థత, స్ఫోటకం, ఉన్మాదం, శత్రువుల సంతోషం, వృత్తివిద్యలు, అనారోగ్యం, రోగ నిరోధక శక్తి, ఔషధం, చికిత్స, సిబ్బంది, కార్మికులు, అధికారి, సేవకులు, శారీరక బలం, వ్యాయామం, అంగవైకల్యం, ఆహారధాన్యాలు, నింద, సేవ, సోదరులతో కలహం మొదలైన అంశాలు షష్ఠ భావం ద్వారా పరిశీలించాలి.

**సప్తమ / కళత్రభావం :** భార్య, మార్గప్రయాణం, వాణిజ్యం, నష్టవస్తు పరిజ్ఞానం, ఆత్మ మరణాలు, వివాహం, భర్త, పవిత్రత, తాంబూలం, సుగంధ పుష్పాలు, మైథునం, స్వదేశం, అన్యదేశం, ఆప్తమిత్రులు, విరోధి, అధికారి, భాగస్వామి, స్నేహితులు, జీవితంతో ముడిపడిన వ్యక్తులు, పది మందిలో పలుకుబడి తదితర అంశాలు కళత్ర భావం ద్వారా పరిశీలించాలి.

**అష్టమ / ఆయుర్భావం :** ఆయువు, రణం, మృతధనం, మరణం, ఇబ్బందులు, అవమానం, లైఫ్ ఇన్సూరెన్స్, భార్యను బాధించే కార్యకలాపాలు, దుఃఖం, ఆకస్మిక లాభనష్టాలు, ఆరోగ్యం, దుష్టసాంగత్యం, పరివారం, చెడ్డపనులయందు ఆసక్తి, యుద్ధం, అవయవలోపం, జీవహింస, లావాదేవీలు, క్రయ విక్రయాలు, పరాశ్రయం, పరాధీనం, అన్యాక్రాంతం, పన్నులు, లాటరీలు, మరణం తదితర అంశాలను అష్టమ భావం ద్వారా గమనించాలి.

**నవమ భావం :** భాగ్యం, భార్య సోదరుడు, దర్మం, సోదరుల భార్యలు, తీర్థయాత్రలు, సేవ, తపస్సు, గురువులు, విద్య నేర్చుకోవడం వల్ల వచ్చిన

గౌరవం, ప్రయాణం, భాగ్యం, నీతి, పరాక్రమం, పిత్రార్జన, శుభకార్యాలు, దనం దాచడం, సజ్జన సాంగత్యం, దూర ప్రయాణాలు, సాధారణ విద్య, విదేశ వ్యవహారాలు, పరిశోధన, శాస్త్రవిజ్ఞానం, మత రాజకీయ న్యాయ సారస్వత వైజ్ఞానిక విషయాలు, విశాలభావాలు, దూరదృష్టి, దేవాలయాలు, శాసనకర్తలు, బోధకులు, మతాధిపతులు తదితర అంశాలను ఈ భావం ద్వారా గమనించాలి.

**దశమ / రాజ్యభావం :** రాజ్యం, గౌరవం, కీర్తి, పితృసుఖం, ప్రవాసం, ఋణాలను పరీక్షించడం, శరీరబలం, రాచకార్యాలు, యంత్రాలు, మంత్రాలు, ఓషధులు, సుఖ జీవనం, రాజులవద్ద ప్రఖ్యాతి, ఇతరులపై దయచూపడం, ముద్రాధికారం, వృత్తి వ్యాపారాలు, సాంఘిక రాజకీయ విషయాలు, తండ్రి, పెద్దలు, అధికారం తదితర అంశాలను దశమభావం ద్వారా గమనించాలి.

**ఏకాదశ / లాభభావం :** వివిధ వస్తువులు, సంపత్తి, పుత్రుని భార్య, ఆదాయం, పశువృద్ధి, అన్ని విధాలైన లాభాలు, దురాశ, ఇతరుల మీద ఆధారపడడం, పినతండ్రి, సాత్వికోపాసన, కళానైపుణ్యం, సంఘాలలో సభ్యత్వం, కంపెనీలలో వాటాలు, సంస్థలు, రాజకీయ పార్టీలు, సమిష్టి ఆశయాలు. ఆదర్శాలు, సంఘవ్యవహారాలను లాభభావం ద్వారా గమనించాలి.

**ద్వాదశ / వ్యయభావం :** ధనవ్యయం, శత్రువుల వృత్తాంతం, జన్మాంత మందలి విషయాలు, నిద్రాభంగం, మనోవ్యధ, పాదాలు, శత్రుభయం, బంధనం, పీడా విముక్తి, చిత్తవైకల్యం, దీనస్వభావం, సుఖంకోసం ఆలోచించడం, దేహసౌఖ్యం లోపించడం, మృతి, ఇతర దేశం వెళ్ళడం, అన్నివిధాల ఖర్చులు, భార్యాహాని, విశ్రాంతి లోపం, విశ్రాంతి భవనాలు, పరాధీనత, రహస్య స్థావరాలు కలలు, భ్రమలు, నిద్ర, మత్తు, దేశాంతరవాసం తదితర అంశాలు ద్వాదశభావం వల్ల గమనించాలి.

## రాశి కారకత్వాల విశ్లేషణ

జ్యోతిషంలో ఫలితాలు చెప్పడానికి రాశి విజ్ఞానం తప్పని అవసరం. రాశులను వేరు వేరు రకాలుగా విభజిస్తుంటారు. వాటిని గూర్చి క్రింద పరిశీలిద్దాం.

ముఖ్యంగా రాశులను బేసిరాశులు, సరిరాశులు అని రెండురకాలుగా వర్గీకరిస్తారు. బేసిరాశులు పరుష స్వభావానికి, సరి రాశులు సౌమ్యస్వభావానికి ప్రతీకలు.

మేషం, మిథునం, సింహం, తుల, ధనుస్సు, కుంభం - బేసిరాశులు

వృషభం, కర్కాటకం, కన్య, వృశ్చికం, మకరం, మీనం - సరిరాశులు.

## రాశులు - స్వభావాలు

స్వభావాలను అనుసరించి రాశులను చర, స్థిర, ద్విస్వభావ రాశులుగా వర్గీకరిస్తారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **మేషం** | **- చర** | **వృషభం** | **- స్థిర** | **మిథునం** | **- ద్విస్వభావ** |
| **కర్కాటకం** | **- చర** | **సింహం** | **- స్థిర** | **కన్య** | **- ద్విస్వభావ** |
| **తుల** | **- చర** | **వృశ్చికం** | **- స్థిర** | **ధనుస్సు** | **- ద్విస్వభావ** |
| **మకరం** | **- చర** | **కుంభం** | **- స్థిర** | **మీనం** | **- ద్విస్వభావ** |

**చరస్వభావ రాశులు - స్వభావాలు :** ఈ రాశులలో జన్మించినవారికి చురుకుదనం, చాంచల్యం, మార్పును కోరడం, కార్యసాధన లక్ష్యం, క్రియాశీలత, ఉత్సాహం, కార్య నిర్వహణ, చపలత్వం, అభిప్రాయాలు, ఆలోచనావిధానాల్లో మార్పులు, పర్యటనలపై ఆసక్తి, స్థిరత్వం తక్కువ తదితర స్వభావాలుంటాయి. (మేష, కర్కాటక, తులా, మకరాలు)

**స్థిరస్వభావ రాశులు - స్వభావాలు :** స్థిరమైన అభిప్రాయాలు, సుఖ జీవనాభిలాష, అధికారం పైకంటే ప్రయోజనం, సౌఖ్యం, దీక్ష, ఏకాగ్రత, నిగ్రహం, ఓర్మి, సుస్థిరత, పట్టుదల, వాగ్దానాలు చెల్లించాలనే స్వభావం, ఆత్మవిశ్వాసం, నిర్వహణ, సమర్థత, తరచు మార్పులు ఇష్టపడకపోవడం మొదలైన స్వభావాలుంటాయి. (వృషభ సింహ వృశ్చిక కుంభాలు)

**ద్విస్వభావ రాశులు - స్వభావాలు :** రెండువైపులా ఆలోచించడం, ద్వంద్వ స్వభావం, అభిప్రాయాలలో మార్పు, భిన్నాంశాలను సమన్వయించడం, వ్యాఖ్యానించడం, ఉపదేశించడం, బోధనాశక్తి, ప్రతి విషయాన్ని సందేహించడం, విభిన్నమైన ఆశయాలు, అభిరుచులు, విమర్శలు, సమీక్షలు, విచారణలు చేయగలగడం, విచక్షణను ఉపయోగించడం తదితర స్వభావాలుంటాయి. (మిథున కన్యాధనుర్మీనాలు)

## రాశులు - తత్త్వాలు

తత్త్వాలను అనుసరించి రాశులను అగ్ని, భూ, వాయు, జల తత్త్వాలుగా వర్గీకరిస్తారు.

| | | | |
|---|---|---|---|
| మేషం - అగ్ని | వృషభం - భూ | మిథునం - వాయు | కర్కాటకం - జల |
| సింహం - అగ్ని | కన్య - భూ | తుల - వాయు | వృశ్చికం - జల |
| ధనుస్సు - అగ్ని | మకరం - భూ | కుంభం - వాయు | మీనం - జల. |

**అగ్నితత్త్వ రాశులు - స్వభావాలు :** నాయకత్వం, ధైర్య సాహసాలు, శక్తి, చైతన్యం, ప్రేరణ, ఉద్దీపన, విక్రమం, పౌరుషం, తమ మార్గంలో ఇతరులను నడిపించడం, తమ ప్రభావాన్ని ఇతరులకు చూపించడం, ముందు వెనుకలు చూడకుండా ముందుకు దూకడం తదితర స్వభావాలుంటాయి. (మేష సింహ ధనుస్సులు)

**భూతత్త్వ రాశులు - స్వభావాలు** : భోజన ప్రియత్వం, శరీరబలం, జీవనోపాధి, కృషి, ప్రతిఫలం, శారీరక అవసరాలు, సంపాదన, సౌకర్యాలు, సంక్షేమం, భౌతిక విషయాలకు ప్రాధాన్యం, పట్టిన పట్టు విడువకుండా ప్రారంభించిన పని పూర్తిచేయడం, భద్రత, రక్షణ, ప్రయోజనదృష్టి, సహనం, నెమ్మది, ముందుజాగ్రత్తలు తదితర స్వభావాలుంటాయి. (వృషభ కన్యా మకరాలు)

**వాయుతత్త్వ రాశులు - స్వభావాలు** : స్నేహపరిచయ బాంధవ్యాలు, వ్యాపక శక్తి, విజ్ఞాన వికాసం, పథకాలు, ప్రణాళికలు, తెలివి, సామర్థ్యం, సాంఘిక కార్యక్రమాలు, పరిచయాలు పెంచుకోవడం, కొత్తవి తెలుసుకోవడం, నిస్స్వార్థం, స్నేహం, సాముదాయిక శ్రేయస్సు తదితర లక్షణాలుంటాయి. (మిథున తులా కుంభాలు)

**జలతత్త్వ రాశులు - స్వభావాలు** : ఊహాలోకాల్లో విహరించడం, స్పందన, ఆలోచన, ఊహ, భావన, ఉద్వేగం, భావావేశం, ఆందోళన, సంపద, కష్టసుఖాలు, భార్య పిల్లలతో అనుబంధం ఎక్కువగా ఉండడం, పరిసర ప్రభావాలకు ఎక్కువగా లోనుకావడం, స్పందన, ప్రతిస్పందన, స్ఫురణ, ఉద్వేగం మొదలైన స్వభావాలుంటాయి. (కర్కాటక వృశ్చిక మీనాలు)

## రాశులు - నామౌచిత్యం

మేషం అంటే గొర్రె అనీ, వృషభమంటే ఎద్దు అనీ మనం చదువుకుంటుంటాం. ఈ ఆకృతులు ఆకాశంలో ఉన్న నక్షత్రసమూహాలకు ఎందుకు పెట్టి ఉంటారో ఊహించడం కష్టం. అంతేకాకుండా మేషం అన్నప్పుడు మనం ఆకృతిని కొంతవరకు ఊహించాల్సిందే తప్ప అది గొర్రెలాగే ఉండే అవకాశమే

లేదు. మనిషి తన చుట్టూ సంచరించే జీవజాతులను, వాటి తత్వాలను ఆధారం చేసుకొని రాశుల పేర్లు పెట్టుకున్నాడు. ఆ యా లక్షణాలను రాశి నామాలను బట్టి విశ్లేషించుకుంటే ఆ రాశిలో పుట్టిన వ్యక్తుల స్వభావాలను గమనించే అవకాశం ఉంది.

**మేషం :** మేషమంటే గొఱ్ఱె అని అర్థం. గొఱ్ఱె తాను వెళ్ళే మార్గంలో తనకు పని చెప్పిన మార్గంలో ఆగకుండా ముందుకు వెళ్తుంది. అనుసరణ అనేది గొఱ్ఱెకున్న మరో తత్వం. కొండనైనా ఢీకొనే గాంభీర్యం గొఱ్ఱెకు సహజం. అందువల్ల ధైర్యానికి, ముందుకు అడుగు వేయడానికి, అనుసరించి నడవడానికి, వ్యవహార నిర్వహణకు ప్రతీకగా మేషాన్ని పోల్చడం సంప్రదాయం. ఈ రాశివారిలో ఈ తత్వమే మనకు కనిపిస్తుంటుంది.

**వృషభం :** వృషభమంటే ఎద్దు. ఒంటెద్దు పోకడ అని ఒక సామెత ఉంది. ఎద్దులు రెండు ఉంటే అవి ఒక క్రమపద్ధతిలో వెళ్ళడం మనం గ్రహించవచ్చు. బండికి కట్టినా, నాగలికి కట్టినా రెండెద్దులు ఉంటే సమమైన పోకడ ఉంటుంది. ఒంటెద్దు అయితే అసమత్వం, ఇష్టమొచ్చిన రీతిలో గమనం ఉంటాయి. ఈ రాశివారి ప్రవర్తనాదుల్లో ఈ విషయాన్ని గమనించి తగు జాగ్రత్తలు సూచించవలసి ఉంటుంది.

**మిథునం :** మిథునమంటే జంట అని అర్థం. ఏ అంశాన్నైనా రెండు విధాలుగా చర్చించుకోవడం, రెండు విధాలైన భావాలకు స్థానమివ్వడం, నిర్ణయశక్తి లోపిస్తూ అన్నింటిలోనూ ఊగిసలాడడం అనేవి ఈ రాశి నామానికున్న ప్రత్యేక లక్షణాలు.

**కర్కాటకం :** కర్కాటకం అంటే ఎండ్రికాయ. నీళ్ళలో సంచరిస్తుంటుంది. అట్టడుగన ఉండే ఈ ఎండ్రికాయ నీళ్ళు ప్రశాంతంగా ఉన్నప్పుడు పైకి కనపడుతుంటుంది. ఏ మాత్రం అలజడి అయినా అడుగుకు వెళ్ళిపోతుంది.

చూడడానికి ఆకృతి భయంకరంగా ఉన్నప్పటికీ ధైర్యం లేని తత్త్వం కర్కాటకానికి ప్రత్యేకం. గొడవలంటే ఇష్టపడకపోవడం, ఇంటి వ్యవహారాలలో ఎక్కువ శ్రద్ధ వహించడం ఈ రాశివారికి ప్రత్యేకం.

**సింహం :** గుహలలో సంచరించడం, అవసరానికి తగిన విధంగా ప్రవర్తించడం, శత్రువును సూటిగా దెబ్బతీయడం, ధైర్యంగా ముందుకు అడుగువేయడం, నిర్ణయాత్మకంగా వ్యవహరించడం మొదలైన అంశాలన్నీ సింహరాశికి వర్తిస్తాయి. ఈ అంశాలన్నింటి అనువర్తిత రూపాలలో ఈ రాశివారు కనిపిస్తుంటారు. హుందాగా ప్రవర్తించడం, న్యాయబద్ధమైన జీవనం, దోషాన్ని సహించకపోవడం, శత్రువును దెబ్బతీసే వ్యవహారం మొదలైనవి ఈ రాశివారిలో కనిపించే గుణాలు.

**కన్య :** ఒంటరిగా ఉండే కన్యయొక్క మనసులో కలిగే హావభావాలకు ఈ రాశికి ప్రతీక. అందరూ తనను గమనించేట్లుగా విద్యాత్మకంగానో, ప్రవర్తనాత్మకంగానో, వాచికంగానో, ఏదో రూపంలో కనిపిస్తుంటుంది. ప్రతిభాపాండిత్యాలు అధికంగా ఉన్నప్పటికీ వాటిని సద్వినియోగపరచడానికి అవసరమైన మార్కెటింగ్ టెక్నిక్స్ బాగా తెలిసిన వారు కన్యారాశికి చెందినవారవుతారు.

**తుల :** సమత్వానికి ప్రతీక ఈ తులారాశి. త్రాసులోని రెండు పళ్ళేలలాగా మంచి చెడులకు సంబంధించిన నిర్ణయాత్మక శక్తిని నిర్ణయించేటప్పుడు తులారాశి చక్కని నిర్ణేత అవుతుంది. వేరు వేరు అంశాల మధ్యలో సామరస్యాన్ని ఏర్పరచుకొని ముందుకు సాగే దిశలో తులారాశి అత్యున్నతమైన ప్రతిభను చూపిస్తుంది. తులారాశి జనితులలో కూడా ఈ సమత్వభావన అత్యధికంగా మనకు కనిపిస్తుంటుంది.

వృశ్చికం : శబ్దార్థం తేలు. తేలు స్వయంగా కావాలని మరొకరిని ఇబ్బంది పెట్టదు. తనను ఎవరూ ఇబ్బంది పెట్టకుండా చాటుమాటున్నే తిరుగుతుంటుంది. తనకు ఇబ్బంది ఎదురైతే మాత్రం తన తోకలో ఎప్పుడికీ విషంతో ఇబ్బంది పెడుతుంది. తన ఆయుధాన్ని వినియోగించి ఇబ్బందులను అధిగమించడానికి ప్రయత్నిస్తుంది. అదేవిధంగా తరువాతి తరానికి జన్మనిచ్చేటప్పుడు తన జీవితాన్ని చాలించుకునే ఉదాత్తత ఈ తేలులో ఉంది. ఈ రాశి జనితులలో కూడా ఈ భావనలు మనకు కనిపిస్తుంటాయి. వీరు భావాన్ని వ్యక్తీకరించడం కన్నా పనిచేసి చూపించడంలో నైపుణ్యాన్ని చూపిస్తుంటారు.

ధనుస్సు : ఎక్కుపెట్టబడిన ధనుస్సు, లక్ష్యసాధనకు ప్రతీక. నిర్ణయించుకున్న లక్ష్యాలను అధిగమించడానికి తన శక్తిని, యుక్తిని ధారపోసి అనుకున్నది సాధించేంతవరకు కార్యసాధనే ధ్యేయంగా నిలవాలని ఉపదేశించేది ఈ ధనుస్సు. ఈ ధనుస్సు రాశివారిలో ఈ తత్త్వం మనకు స్పష్టంగా కనిపిస్తుంది. లక్ష్యాలను పెట్టుకొని వాటి సాధనా మార్గంలో జీవితాన్ని గడిపి పరిణతులుగా కనిపించడం ఈ రాశివారికే ప్రత్యేకం.

మకరం : మకరమంటే మొసలి. మొసళ్ళు సాధారణంగా నీటిలో ఎక్కువగా, బయట కూడా సంచరించేవి ఉన్నప్పటికీ నీటిలో సంచరించే మొసలికే అధిక బలం ఉంటుందనేది మొట్టమొదటినుండీ మనకున్న భావన. మొండిపట్టుతో సేవాధర్మాన్ని కలిగి తాను చేసే పనిని ఎంత కష్టమైనా, ఎంత ఇబ్బందికరమైనా చేసి చూపించే తత్త్వం ఈ మకరానిది. తన స్థానబలం నీటిలో అత్యంత అధికం కావడం వల్ల స్వంత ప్రదేశంలో వీరు అత్యధికంగా ఎదిగే అవకాశం ఉంటుంది. లోకంలో అత్యంత ఉదాత్తమైన ధర్మం సేవాధర్మం. ఈ ధర్మానికి ప్రతీకగా కూడా ఈ రాశివారిని మనం చూడవచ్చు.

**కుంభం :** కుంభ మంటే కుండ అని అర్థం. ఈ కుండలో ఉండేది ఏమిటో తెలియకుండా ఉంటుంది. ఒకవేళ నీరే ఉంటే ఎంత ఉందో తెలియదు. కాబట్టి కుంభంలో ఏదో తెలియని విశేషాలుంటాయి. నిండుకుండగా కనిపిస్తున్నా దానిలో ఒక్కోసారి ఏమీ ఉండకపోవచ్చు. ఏమీ లేదనుకుంటే ఏదైనా దానిలో కొత్త విశేషం కనిపించవచ్చు. ఎంతైనా ఏదో ఒక భావనా పరిపూర్ణమైన అంశం కుంభంలో ఉంటుందని మనం భావించవచ్చు. కుంభరాశివారిలో కూడా ఏదో ఒక ప్రత్యేకత, ఎప్పుడో ఆకస్మికంగా వెలుగుచూసే అవకాశం ఉంటుంది. అది ఎప్పుడు అనే విషయం మాత్రం గోప్యంగా ఉంటుంది. వారి శక్తివిశేషం కూడా అంతర్గతంగా, రహస్యంగా దాచిపెట్టబడుతుంది. బయటకు తీస్తే లేదా లోనికి తొంగి చూస్తే మాత్రమే వారిలోని అంతర్గత శక్తి బయటివారికి అర్థం అవుతుంది.

**మీనం :** మీనమంటే చేప. రెండు చేపలు ఐదు అంట్లతో కనిపించే ఆకృతి మీనాకృతి. ఇక్కడ కూడా ఈ రెండుచేపలు రెండుభావాలకు ప్రతీకలు. నిర్ణయశక్తి విషయంలో రెండు భావనలు ఎప్పటికప్పుడూ ఇబ్బంది పెడుతూనే ఉంటాయి. ఈ రెండుచేపలకు అంట్లుగా ఐదు నక్షత్రాలుండడం వల్ల వీరు అనుబంధాలకోసం ప్రాకులాడడం కనిపిస్తుంది. అందరితోనూ ఆత్మీయతను పంచుకోవాలనే తపన ఈ రాశివారిలో ఉంటుంది. మీనం నీటిలో వేగంగా సంచరించడం వల్ల స్వస్థానంలో తమ ప్రతిభను చూపించడం ఉంటుంది. వేగంగా జీవితాన్ని గడపడం, అదేవిధంగా నిర్ణయాలను చేపలు మార్చుకునే దిశల్లాగా వెనువెంటనే మార్చుకోవడం ఈ రాశివారిలో ప్రత్యేకంగా గమనించవచ్చు.

ఈ ఫలితాలు మీనరాశివారిలోనూ, మీనలగ్నంవారిలోనూ, మీనరాశిలో రవి ఉన్న వారిలోనూ కూడా కనిపించే ఫలితాలు. అయితే ఈ రాశివారిని గమనించడానికి ఇవి ఒక సాధనా మార్గాలే తప్ప ఈ లక్షణాలే పరిపూర్ణంగా

ఉండవు. ఈ రాశుల్లో ఉండే గ్రహాలు, చూసే గ్రహాలు తదితర అంశాలను బట్టి ఫలితాలలో కొన్ని మార్పులుంటుంటాయి.

**రాశ్యధిపతులు - గ్రహరాజ్య వ్యవస్థ రీత్యా రాశుల పరిశీలన**

మేష వృశ్చికాలకు కుజుడు, వృషభ తులలకు శుక్రుడు, మిథున కన్యలకు బుధుడు, కర్కాటకానికి చంద్రుడు, సింహానికి రవి, ధనుర్మీనాలకు గురుడు, మకర కుంభాలకు శని అధిపతులుగా నిర్ణయించారు.

అదేవిధంగా వీరిలో గ్రహరాజ్యవ్యవస్థ రీత్యా రవిని రాజుగా, చంద్రుడు రాణి లేదా అసమర్థుడైన రాజుగా, కుజుడు సేనాధిపతిగా, గురుని సమర్థుడైన, న్యాయబద్ధమైన మంత్రిగా, శుక్రుని న్యాయానికి తక్కువ ప్రాధాన్యమిస్తూ కార్యం పూర్తిచేయించే మంత్రిగా, బుధుని వ్యాపారం చేసుకునే వాడిగా శనిని సేవకునిగా గుర్తిస్తారు. ఈ రెండింటి కలయికలలో రాశులను గమనించడం మరో సంప్రదాయం.

**సింహం-సూర్యుడు :** సింహరాశికి రవి అధిపతి. రవి గ్రహరాజు. సూర్యుడు స్వయంప్రకాశమానుడుగా, మరొకరిపై ఆధారపడనివానిగా, తన వెలుగుద్వారా, వేడిమి ద్వారా లోకాలకు మేలు చేసే వానిగా భావిస్తే ఈ తత్త్వం ఈ రాశివారిలో అత్యధికంగా ఉంటుంది. తమపై తమకుండే ఆత్మవిశ్వాసం అత్యధికం కావడం వల్ల తామెక్కడ ఉన్నా తమ నిర్ణయమే తుది నిర్ణయంగా ఉండాలని, తమను అనుసరించే అందరూ మెలగాలనే తత్త్వం ఈ రాశివారిలో ఉంటుంది. ఇది ఒక్కోసారి మూర్ఖత్వంగా, మొండితనంగా కూడా కనిపిస్తుంటుంది. అయితే ఆ భావన కనిపించకుండా జాగ్రత్తగా ఉంటుంటారు. తమ భావాలను ఎక్కడా వ్యక్తీకరించకుండా గంభీరంగా ప్రవర్తించడం ఈ రాశివారికి ప్రత్యేకం. అదేవిధంగా తమలోని లోపాలను కూడా బైటికి కనిపించకుండా జాగ్రత్త పడుతుంటారు. పక్కవారు తమకన్నా ఎదగడం వీరికి

సహించరానిదవుతుటుంది. ఇది స్పర్థగా ఉన్నంతసేపు బాగానే ఉన్నప్పటికీ ఒక్కోసారి అది అసూయగా పరిణమించి ఇబ్బంది పెడుతుంది. తమగూర్చి ఎవరికీ చెప్పుకోక తమ భావాలు ఎదుటివారితో పంచుకుంటే వారి దృష్టిలో చులకన అవుతామనే భావన అధికంగా ఉన్న వీరి ఆలోచనా భారం వీరికి హృదయ, మానసిక వ్యాధులకు కారకం అవుతుంటుంది. కార్యనిర్వహణలో వీరు చక్కని శక్తికలిగి ఉంటారు. తమద్వారా చాలామంది మేలుపొందాలని, వారు మళ్ళీ తమకు కృతజ్ఞులుగా, అదుపాజ్ఞలలో ఉండాలనే తత్త్వం మాత్రం వీరిలో కనిపిస్తుంటుంది. దీనికోసం అవసరమైతే బెదిరించడానికి కూడా వెనుకాడని తత్త్వం కొన్ని సార్లు కనిపిస్తుంటుంది.

గ్రహరాజుగానూ, సింహానికి అధిపతిగానూ, రవి గ్రహకారకత్వాన్ని కలిపి ఆలోచిస్తే పై నిర్ణయాలన్నీ మనకు కనిపిస్తుంటాయి.

**కర్కాటకం – చంద్రుడు :** చంద్రుడు కర్కాటక రాశికి అధిపతి. చంద్రుని అసమర్థ రాజుగానూ, రాణిగానూ గుర్తించే సంప్రదాయం ఉంది. ఈ రాశివారు అందరూ సహకరిస్తే తాము కూడా అధిపత్యం చాటుకోవాలని ప్రయత్నిస్తుంటారు. కాని మానసికంగా సింహరాశి వారంత ధైర్యం కలిగినవారు కారు. చంద్రుడు స్వయంప్రకాశమానుడు కాకపోవడం, మరో గ్రహం చుట్టూ తిరగడం, కళలు మార్చుకుంటూ ఉండడం అనే భౌతిక ప్రక్రియల ద్వారా ఈ రాశివారిలో అవసరానుగుణంగా మెలగడం, అవకాశమున్నచోట తమ గొప్పతనాన్ని చూపడం, ప్రేమను పంచేతత్త్వం, మరొకరిపై ఎప్పటికీ ఆధారపడే ప్రయత్నం చేస్తుంటారు. చంద్రుడు రాత్రిపూట తన ప్రాబల్యాన్ని చూపించేవాడు కావడం వల్ల కార్యనిర్వహణలో ఏదోరూపంలో, ఎక్కడో ఒకచోట తన ప్రత్యేకతను, అధిపత్యాన్ని కలిగి ఉండడం వీరి ప్రత్యేకత. అసమర్థరాజు కావడం వల్ల వీరిపై ఇతరుల ప్రభావం అధికంగా ఉంటుంది. అందరి అభిప్రాయాలకు

విలువ ఇస్తూ అందరినీ మెప్పిస్తుండడం కనిపిస్తుంది. వారందరి అభిప్రాయాలకు విలువ నివ్వకపోతే తమస్థానం తమకు నిలువదనే భయం ఉంటుంది. రాణి అనే భావన ఉండడం వల్ల కొంత ప్రేమతోనూ, జలగ్రహం కావడం వల్ల కొంత ఆకర్షణతోనూ, చిన్న చిన్న బహుమానాలతోనూ అందరినీ తనచుట్టూ తిప్పుకోవాలనే ప్రయత్నం ఈ రాశివారిలో అధికంగా ఉంటుంది. జలగ్రహం కావడంవల్ల, అందరూ తన మాట వినడంలేదనే భావన వల్ల మనసులో ఒత్తిడికి లోనై త్వరగా రోగాలకు గురవడం ఈ రాశివారిలో కనిపిస్తుంటుంది. తమకు శారీరకంగా, మానసికంగా ఇబ్బంది కలిగినప్పుడు తమవారందరూ తమచుట్టూ ఉంటూ ప్రేమను పంచాలని, తమకు ప్రాధాన్యమివ్వాలనే భావన మిగిలిన రాశివారికన్నా వీరికి అధికం. మొత్తానికి మాతృప్రేమగలిగిన రాశిగా, నిర్ణయశక్తి తక్కువగా ఉన్న రాశిగా, ఆకర్షణ కలిగిన రాశిగా ఈ రాశి ప్రత్యేకతను పొంది ఉంది.

**మేషవృశ్చికాలు – కుజుడు :** మేష వృశ్చికరాశులకు కుజుడు అధిపతి. కుజుడు గ్రహరాజ్యవ్యవస్థ రీత్యా సేనానాయకుడు. సాధారణంగా నిర్ణయాలను అమలుచేసే శక్తి, అద్భుతమైన నిర్వహణశక్తి గలిగి న్యాయబద్ధమైన, ప్రణాళికాబద్ధమైన జీవితానికి ప్రయత్నం చేసేవాడు కుజుడు. కుజుడు సేనానాయకుడుగా ఉండడం వల్ల మేషరాశివారు నిర్ణయాల అమలును అతి జాగ్రత్తగా పర్యవేక్షించే తత్వం కలిగినవారవుతారు. వీరిపై మరొకరి ఆధిపత్యాన్ని, వీరికి అప్పగించిన పనిలో మరోవ్యక్తి ప్రమేయాన్ని వీరు సహించలేరు. సరియైన విధంగా నిర్వహించడం, మరొకరితో చేయించడం వీరి ప్రత్యేకత. మరొకరితో కూడా తాము చేసేపని చేయించాలనే తపన ఈ రాశివారిలో కనిపించడం వల్ల ఆ భావన ఇష్టంలేనివారికి వీరు శత్రువులుగా కనిపిస్తుంటారు. ఏదో ఒక పనిలో నిరంతరం నిమగ్నమై ఉండడం, ఆ క్రమంలో ఎన్ని ఇబ్బందులున్నా

ఎదుర్కొంటూ ఆ శ్రమలోనే ఆనందం పొందే తత్త్వం ఈ రాశివారిది. రక్షణవ్యవస్థకు మారుపేరుగా ఈ రాశులవారు ఉంటుంటారు. మేషరాశివారు నిర్వహణలో అత్యుత్తమస్థితిని, రక్షణశాఖలో ప్రత్యక్షపాత్రను పోషిస్తుంటే వృశ్చికం వారు మాత్రం నిఘా విభాగంలో ఉంటూ పరోక్షపాత్రను పోషిస్తుంటారు. రక్షణ అనేది మాత్రమే కాక వేరు వేరు ఇతర విభాగాలలో కుజ ప్రభావ జనితులు ఉంటే ఆ యా విభాగాలను సమగ్రంగా, సంపూర్ణదృష్టితో, తమ సంస్థలాగా భావిస్తూ వాటిని ఉద్ధరించే ప్రయత్నం చేస్తూ అందరితోనూ చేయిస్తుంటారు.

**ధనుర్మీనాలు – గురుడు** : ధనుర్మీన రాశులకు గురుడు అధిపతి. గ్రహరాజ్య వ్యవస్థ రీత్యా గురుడు సమర్థుడైన న్యాయబద్ధమైన మంత్రి. తన ఆలోచనలు లోకకళ్యాణ కారకాలు కావాలని ఆశించేవాడు గురుడు. లోకానికి అవసరమైన మంచిపనులు చేయడానికి అవసరమైన పరిశోధనలు చేయడంలో ముందడుగు వేసే తత్త్వం ధనుస్సు రాశిలో కనిపిస్తుంది. మంచి ఆలోచనలు, లక్ష్యసాధన శక్తి ఈ రాశివారికి ప్రత్యేకం. ఉపకరించే విధానాలను ప్రచారంలోకి తీసుకురావడానికి ప్రయత్నం నిరంతరం చేస్తూ ఉంటారు. విషయాన్ని లోతుల్లోకి పరిశీలించగలగడం, మంచి చెడులను విశ్లేషించడం, మంచిని ప్రోత్సహించడానికి, చెడును నిర్మూలించడానికి సరియైనవిధంగా ప్రణాళికలు వేయడం కూడా మంత్రిగా గురుడు చేసే పని. లోకావసరాలు గుర్తించడం, అవి అందరికీ అందుబాటులోకి రావడానికి చేయాల్సిన పరిశోధనలు, ప్రణాళికలు కూడా వీరి ద్వారానే జరుగుతాయి. వీరి భావనలు ప్రత్యక్షంగా కాక మరొకరి ద్వారా అమలు పరచడానికి ప్రయత్నిస్తుంటారు. వీరే అన్నింటిలో ముందుకు ఉండాలని కోరుకోరు. ఆర్భాటమైన విలాసాలు, ఆకాంక్షలు, కోర్కెలు ఉండవు కాని సాధారణమైన అవసరాలు తీరేవిధంగా సహకారం ఉంటే చాలు

తమ పనిలో తాము నిరంతరం ఉండి లోకాన్ని మరిచిపోయి ఆలోచనాత్మకమైన పని చేస్తుంటారు. వీరి ద్వారా మంచి సలహాలు ఎప్పటికీ అందుతాయి. ధనుస్సులో ఇటువంటి లోతైన అంశాలు పరిశీలనకు ఉంటే మీనంలో మాత్రం తాము గమనించిన అంశాలను వెంటనే వ్యక్తీకరించడానికి చేసే ప్రయత్నం కనిపిస్తుంది. పరిశీలన అనేది రెండు రాశుల్లోనూ సాధారణమైనప్పటికీ లోతైన పరిశీలన ధనుస్సులో, ఉపరిదృశ్య పరిశీలన ద్వారా ఊహించడం మీనంలో కనిపిస్తుంటుంది. ఏదైనా ఊహే పరిశోధనలకు, పరమాత్మ సన్నిధికి చేరడానికి మార్గమని భావించడం ఈ గ్రహం యొక్క ప్రభావం వల్ల కలుగుతుంది. గౌరవం పెంచుకోవడం గురు ప్రత్యేకం.

**వృషభ తులలు – శుక్రుడు :** వృషభ తులారాశులకు శుక్రుడు అధిపతి. శుక్రుడు కూడా గ్రహరాజ్య వ్యవస్థరీత్యా మంత్రి అయినప్పటికీ గురువుకు శుక్రునికీ మౌలికమైన కొన్ని భేదాలు మనకు కనిపిస్తుంటాయి. న్యాయబద్ధమైన, స్పష్టమైన జీవనవిధానానికి ప్రతీకగా గురుడు కనిపిస్తే, అవసరానుకూలంగా నిర్ణయాలు తీసుకుంటూ అప్పటికప్పుడూ సమస్యల నివారణకు ప్రయత్నం చేస్తూ నలుగురికీ మంచి చేసే తత్త్వం ఈ రాశివారిలో ఉంటుంది. సామాజికంగా కొంత ఉన్నతికి రావాలనే భావంతో పెద్దహోదా కలిగినవారితో స్నేహ బాంధవ్యాలను పెంచుకోవడం, వారి పరిచయం ద్వారా కొన్ని పనులు పూర్తి చేసుకోవడం, చేయించుకోవడం, ఈ పరిచయాలతోనే మరికొందరి పనులు చేసిపెట్టడం వంటి మధ్యవర్తిత్వ బాధ్యతలు ఈ రాశివారు ఎక్కువగా నిర్వర్తిస్తుంటారు. వీరు ఎక్కువగా శ్రమపడకుండా, వారి సుఖం పోకుండా కేవలం మధ్యవర్తిత్వంతో సమస్యా పరిష్కారాలను చేయడం వల్ల వీరి కృషి లేకుండానే సమస్యా పరిష్కారం వీరికి సాధ్యమవుతుందనే విషయం ప్రచారం చేయబడుతుంది. తమకు నిజంగా ఉన్న శక్తికన్నా అధికంగా ప్రచారంలోకి వచ్చే తత్త్వం ఈ రాశివారికి ఉంటుంది. సరియైన జాగ్రత్తలు

తీసుకోకపోతే ఈ భావనలు వ్యతిరేకతకు గురి చేసి ఇబ్బందులపాలు కూడా చేస్తుంటాయి. తాత్కాలికంగా ఎంతో కొంత శ్రమకు లోనైనా సమస్యాపరిష్కారంలో వీరి మంత్రిత్వస్థితి అత్యంత ఉత్తమంగా ఉండి అందరి మన్ననలను పొందుతుంటుంది.

**మిథున కన్యలు - బుధుడు ;** మిథున కన్యారాశులకు బుధుడు అధిపతి. బుధుడు జారిపోయే తత్త్వం కలిగినవాడు. గ్రహరాజ్య వ్యవస్థ రీత్యా బుధుడు వ్యాపారస్థుడు. సహజంగా వ్యాపారస్థులు లేని ప్రదేశంలో కావలసిన అవసరాలు తీరడం కష్టం. బుధుడు అంటే పండితుడు అని కూడా అర్థం. కాలానుగుణమైన నిర్ణయాలు తీసుకుంటూ పనులు పూర్తిచేసే పాండిత్యం బుధునికి మాత్రమే సాధ్యం. ఎవరికీ ఇబ్బందిని కలిగించకుండా అందరి అవసరాలు తీరేటట్లుగా చూస్తూ, తన లాభాలు చూసుకునే రీతి బుధునికి ఉంది. తన లాభాలు తాను పొందుతూ అందరి మన్ననలు పొందగలిగే నేర్పరి బుధుడు. అవసరానుకూలంగా వర్తించడం, ఎవరితో కలిస్తే వారికి అనుగుణంగా ప్రవర్తించి అందరినీ తన వారిని చేసుకొని తలలో నాలుకగా మెలగడం ఈ రాశులవారికి ప్రత్యేకలక్షణం. మిథునంలో వస్తువును కొనుగోలు చేయడం, కన్యలో అమ్మకపు శక్తి కనిపిస్తుంటుంది. ఇది కేవలం వస్తు విషయంలోనే కాక అనేక ఇతర భావనల రూపంలోనూ యథార్థమే. గ్రహించడం, అందించడం అనే రెండు అంశాలు బుధుని ద్వారానే నిర్వహించబడతాయి. వేరు వేరు విషయాలలో తమకున్న పరిజ్ఞానం, పాండిత్యం కొంతే అయినా ఆ కొంతను కూడా అవసరానుగుణంగా వినియోగించి అందరినీ మెప్పించగలిగే ప్రత్యేకత ఈ రాశివారిలో కనిపిస్తుంది. ఎటువంటి విషయాన్నైనా సమాజానికి అనుగుణంగా మార్చి వినియోగించేటట్లు చేసే తెలివితేటలు కూడా ఈ రాశివార్లకు ప్రత్యేకం.

**మకర కుంభాలు – శని :** మకర కుంభ రాశులకు శని అధిపతి. గ్రహరాజ్య వ్యవస్థ రీత్యా శని సేవకుడు. సేవాతత్పరతకు ప్రతీక శని. శాంతి కలిగించేవాడు శని. లోకంలో సేవను మించిన ధర్మం ఉండదు. మకరంలోనూ కుంభంలోనూ గ్రహరాజ్య వ్యవస్థరీత్యా సేవాపరమైన భావనలే ఉన్నప్పటికీ కార్యాలయాల్లో, రాజగృహాలలో సేవకులుగా పనిచేసేవారి తీరూ, సామాజిక సేవలు చేసేవారితీరూ వేరుగా ఉంటుంది. తాము సేవలు చేస్తామంటూ ప్రగల్భాలు పలికే సేవాసంస్థలు ఈ పరిధిలోకి రారు. నిజమైన సేవాతత్త్వం తెలిసి ఆపదల్లోనూ, మంచి చెడుల్లో సహకరిస్తూ ముందుకు వచ్చే వారంతా ఈ రాశులకు చెందినవారవుతారు. కుంభరాశిలో కొంత సౌఖ్యం కలిగిన సేవాతత్త్వం ఉంటే, మకరంలో శ్రమతో కూడుకున్న సేవలుంటాయి. భగవంతునికి భక్తుడు చేసే సేవ పరమసేవ అనుకుంటే అక్కడ అహంకారాలు, అభిమానాలు ఉండకుండా నిస్వార్థంగా పని చేయాల్సి ఉంటుంది. ఆసుపత్రులలో ఉద్యోగాల రీత్యా సేవకులుగా పనిచేసినా హృదయపూర్వకంగా రోగులకు చేసే సేవ ఉత్తమమైన సేవ అవుతుంది. అటువంటి సేవలకు, ఆ తత్త్వానికి శని కారకుడు అవుతుంటాడు. ఈ రాశులు అప్పుడు సేవాతత్త్వరాశులుగా గుర్తింపబడతాయి.

ఈ విధంగా రాశులను గ్రహరాజ్య వ్యవస్థ రీత్యా, ఆధిపత్యాల రీత్యా వర్గీకరించవచ్చు. రాశివిజ్ఞానంలో ఈ విధంగా రాశిని విశ్లేషించడంవల్ల లోకంలో వ్యక్తులలోని రకాలు, వారి ఉపయోగాలు మనకు అవగతమవుతుంటాయి.

అదేవిధంగా రాశులను సహజభావాలుగా వర్గీకరించడం మరో సంప్రదాయం. అంటే మేషాన్ని సహజ ప్రథమభావంగా, వృషభాన్ని సహజద్వితీయంగా, మిథునాన్ని సహజ తృతీయంగా భావిస్తుంటారు. అటువంటి సందర్భంలో ఆ యా భావాల ఫలితాలు ఆ రాశుల్లో చూస్తే మనకు రాశితత్త్వం మరింత విస్తృతంగా అవగాహనకు వస్తుంది.

**మేషం – సహజ ప్రథమం :** ప్రథమభావంలో ఆత్మవిశ్వాసం, స్వయం సామర్థ్యం, శక్తి, శరీరం మొదలైన అంశాలకు అధికమైన ప్రాధాన్యం ఉంటుంది. మేషరాశిలోనూ ఈ భావాలకు అధికమైన ప్రాధాన్యాన్ని గమనించవచ్చు.

**వృషభం – సహజ ద్వితీయం :** ద్వితీయభావంలో ధనం, వాక్కు, కుటుంబం, నేత్రం తదితర అంశాలుంటాయి. వీని వినియోగాన్ని ఇతర భావాలతో పాటు వృషభంలోనూ గమనించడం అవసరం.

**మిథునం – సహజ తృతీయం :** తృతీయభావంలో సోదరులు, సహకారం, చిన్న ప్రయాణాలు, చేతిని ఉపయోగించి చేసే వ్రాత పనులు, రచనలు తదితర అంశాలు గమనించాలి. మిథునంలోనూ ఈ భావాలను గమనించాల్సి ఉంటుంది.

**కర్కాటకం – సహజ చతుర్థం :** సాధారణంగా చతుర్థభావం మాతృభావంగా పరిగణిస్తూ తల్లినుండి పిల్లవాడు అందుకునే ప్రేమమయమైన జీవితాన్ని, గృహ, వాహన, ఆహార, ప్రాథమిక విద్య, సుఖాదులను పరిశీలించే సంప్రదాయం ఉంది. అందువల్ల కర్కాటకంలో ఈ భావనలు అధికంగా కనిపిస్తుంటాయి.

**సింహం – సహజ పంచమం :** ఐదో భావంలో వ్యక్తి మానసిక స్థాయిని, ఆలోచనలను, ఆలోచనా ప్రయోజనాలను, సంతానాన్ని తదితర అంశాలను పరిశీలించడం సంప్రదాయం. సంతానానికి తమకుండే అనుబంధాన్ని కూడా ఈ భావం ద్వారానే గమనించాలి. అందువల్ల పంచమభావంతో పాటు, సహజపంచమమైన సింహాన్ని కూడా ఈ సందర్భంలో పరిశీలించడం అవసరం.

**కన్య – సహజ షష్ఠం :** ఆరోభావంలో ఇతరులను ఎదుర్కొనే విధానం, పోటీ పరీక్షలు, శరీరంలో రోగనిరోధకశక్తి, శత్రు రోగ ఋణాలపై జయాపజయాలు, శ్రమశక్తి, ఉద్యోగం మొదలైన అంశాలు గమనించాలి.

కన్యలో కూడా ఈ అంశాలను గమనించడం వల్ల నూతనాంశాలను వెలికి తీయవచ్చు.

**తుల - సహజ సప్తమం** : సప్తమభావంలో లోక సంబంధాలన్నీ పరిగణనలోకి తీసుకుంటుంటారు. అన్ని రకాల భాగస్వామ్యాలు ఇక్కడ చర్చించవచ్చు. ముఖ్యంగా జీవిత భాగస్వామి, వ్యాపారభాగస్వామి, స్నేహితులు అందరితో ఉండే సమభాగస్వామ్యాలు ఈ భావంలో ప్రత్యేకంగా గమనించాలి. తులలోనూ అదేభావాలు (సమత్వం) ఉండడం వల్ల సమత్వసిద్ధికి వినియోగపడేవిధంగా భాగస్వామ్య వ్యవహారాలలో సహజసప్తమమైన తులను కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

**వృశ్చికం - సహజ అష్టమం** : అష్టమంలో ఆరోగ్యం, ఆకస్మికంగా కలిగే లాభాలు, నష్టాలు, అవమానాదులు, లాటరీలు రేసులు మొదలైనవాటి ద్వారా కలిగే లాభనష్టాలు, మృతధనం, ఆస్తులు కలిసి రావడం, పోవడం తదితర అంశాలు పరిశీలిస్తారు. వృశ్చికం సహజ అష్టమం కావడం వల్ల ఈ రాశిని కూడా ఈ విషయంలో పరిగణనలోకి తీసుకోవచ్చు.

**ధనుస్సు - సహజ నవమం** : తొమ్మిదో భావంలో సహజంగా ఆధ్యాత్మిక విజ్ఞానం, ఉపాసన, ఆనంద మార్గాన్వేషణ, భాగ్యం, భగవంతుని కృప, పూర్వపుణ్యం, దూరప్రయాణాలు, ఉన్నతవిద్యలు, కీర్తి ప్రతిష్ఠలు తదితర అంశాలను గమనించవచ్చు. ఈ సందర్భంలో ధనుస్సు రాశిని సహజనవమంగా భావించి పరిశీలించడం వల్ల సరియైన ఫలితాలను పొందవచ్చు.

**మకరం - సహజ దశమం** : దశమభావంలో కుటుంబంనుండి అందుకునే లౌకిక వారసత్వం ముఖ్యంగా గమనించదగింది. సమాజంలో తాను పొందే హోదా, ఉద్యోగరీత్యా పొందే గౌరవం, వృత్తిలో మంచి చెడ్డలు,

వృద్ధిక్షయాలు అన్నీ ఈ భావం నుండే గమనించాలి. సహజదశమంగా మకరంలోనూ ఈ భావాలను గమనించడంవల్ల నూతన అంశాలను అన్వేషించవచ్చు.

**కుంభం - సహజ లాభం :** లాభస్థానంలో అన్ని కార్యక్రమాలలో మనకు కలిగే లాభాలను గమనించడం సంప్రదాయం. కుంభరాశిలో లాభానికి సంబంధించిన అంశాలను పరిశీలించడం శ్రేయస్సునిస్తుంది.

**మీనం - సహజ వ్యయం :** వ్యయస్థానంలో వేరు వేరు అంశాలలో మానసికంగా, శారీరకంగా, ఆర్థికంగా జరిగే వ్యయాదులను గమనించవచ్చు. సుఖనిద్ర, మోక్షస్థానం కూడా వ్యయభావ పరిశీలనాంశమే. మీనరాశిలో ఈ అంశాలను గమనించడం వల్ల మరిన్ని ఉత్తమ ఫలితాలు పొందవచ్చు.

ఈ విధంగా రాశులను గమనించడంలో బేసి/సరి రాశుల విభజన, స్వభావాలను బట్టి చర, స్థిర, ద్విస్వభావాలుగా, తత్వాలను బట్టి అగ్ని, భూ, వాయు, జల తత్వాలుగా, నామౌచిత్యాన్ని బట్టి ఫలితం చెప్పడం, రాశులను సహజభావాలుగా గమనించడం తదితర అంశాలుగా గమనిస్తే రాశులను స్పష్టంగా వివరించవచ్చు.

ఉదాహరణకు మేషరాశిని బేసిరాశి, చరస్వభావం, అగ్నితత్త్వం, గొఱ్ఱె స్వభావాన్ని, సహజప్రథమభావంగా, రాశి అధిపతి అయిన కుజుని స్వభావరీత్యా ఫలితాలను గమనించి మేషరాశికారకత్వాలను నిర్దేశించాలి. ఈ విధమైన ఫలితాలనన్నీ ఒకదగ్గర చేర్చడం వల్లనే ఆ రాశివారి స్వభావం స్పష్టంగా తెలుస్తుంది.

అదేవిధంగా వృషభరాశిని గమనిస్తే సరిరాశి, స్థిరరాశి, భూతత్త్వం, ఒంటెద్దు, సహజ [illegible]యభావం, రాశి అధిపతి శుక్రస్వభావాలు కలిపి [illegible]

మిథునరాశిలో బేసి, ద్విస్వభావ, వాయు, జంటతత్త్వం, సహజతృతీయం, రాశి అధిపతి బుధ స్వభావాన్ని కలిపితే ఫలితాలు తెలుస్తాయి.

కర్కాటకంలో సరి, చర, జల, ఎంద్రికాయ, సహజ చతుర్థం, రాశి అధిపతి చంద్రుని కారకత్వాన్ని కలిపి నిర్ణయించాలి.

ఈ విధంగా అన్ని రాశులను క్రమంగా గమనిస్తుంటే ఆ యా రాశుల కారకత్వాలు తెలుస్తాయి.

# కొన్ని తెలుసుకోవలసిన అంశాలు

## మన మాసనామాలు - ఏర్పడే విధానం

ప్రస్తుతం మనం సార్వత్రికంగా అనుసరిస్తున్న జనవరి, ఫిబ్రవరి మొదలైన నెలలకు సంబంధించిన విషయంలో ప్రమాణం లేదు. అవి కేవలం రాజుల పేర్లతోనూ, ఇతర అంశాలతోనూ కూడుకున్నాయి. అయితే చాంద్రమానాన్ని అనుసరించే భారతీయ జ్యోతిష్కుల విషయంలోని మాసాలకు ప్రత్యేకమైన వైజ్ఞానిక ధర్మం ఉంది. ప్రతినెలలోనూ పౌర్ణమి నాడు వచ్చే నక్షత్రం ఆధారంగా ఆ మాసానికి పేరు పెట్టడం మాసాల ప్రత్యేకం.

చిత్త నక్షత్రం పూర్ణిమ నాడు ఉన్న మాసం చైత్రమాసం.
విశాఖ నక్షత్రం పూర్ణిమ నాడు ఉంటే అది వైశాఖ మాసం.
జ్యేష్ఠ నక్షత్రం పూర్ణిమనాడు ఉంటే అది జ్యేష్ఠ మాసం.
పూర్వాషాఢ / ఉత్తరాషాఢ నక్షత్రాలు పూర్ణిమ నాడుంటే అది ఆషాఢమాసం.
శ్రవణం పూర్ణిమ నాడుంటే అది శ్రావణమాసం.
పూర్వాభాద్ర / ఉత్తరాభాద్ర పూర్ణిమ నాడుంటే అది భాద్రపదమాసం.
అశ్విని నక్షత్రం పూర్ణిమ నాడుంటే అది ఆశ్వీజమాసం.

కృత్తిక నక్షత్రం పౌర్ణిమ నాడుంటే అది కార్తీక మాసం.

మృగశిర నక్షత్రం పౌర్ణిమ నాడుంటే అది మార్గశిర మాసం.

పుష్యమీ నక్షత్రం పౌర్ణిమ నాడుంటే అది పుష్యమాసం.

మఖ నక్షత్రం పౌర్ణిమ నాడుంటే అది మాఘమాసం.

పూర్వఫల్గుణి / ఉత్తరఫల్గుణి నక్షత్రాలు పౌర్ణిమ నాడుంటే అది ఫాల్గుణ మాసం.

ఈ విధంగా మన మాసాలకు సంబంధించిన వివరం ప్రత్యక్షంగా హేతుబద్ధంగా కనిపిస్తుంది.

సూర్యుడు వేరు వేరు రాశుల్లో ప్రవేశించే సమయాలను బట్టి సౌరమాసాల పేర్లు కూడా పెట్టడం జరుగుతుంది. సూర్యుడు మేషరాశిలో సంచరించే కాలం – మేషమాసం అదేవిధంగా వేరు వేరు రాశి సంచార క్రమాలను వృషభమాసం, మిథునమాసం, కర్కటక మాసం, సింహమాసం, కన్యామాసం, తులామాసం, వృశ్చికమాసం, ధనుర్మాసం, మకరమాసం, కుంభమాసం, మీనమాసం అంటూ లెక్కించడం జరుగుతుంది.

## వేదకాలంలో మాసాల పేర్లు : అధిక క్షయ మాసాలు

| | | |
|---|---|---|
| చైత్రం | – | మధుమాసం |
| వైశాఖం | – | మాధవ మాసం |
| జ్యేష్టం | – | శుక్ర మాసం |
| ఆషాఢం | – | శుచి మాసం |
| శ్రావణం | – | నభ మాసం |
| భాద్రపదం | – | నభస్య మాసం |
| ఆశ్వీజం | – | ఇష మాసం |
| కార్తీకం | – | ఊర్జ మాసం |

| | | |
|---|---|---|
| మార్గశిరం | - | సహ మాసం |
| పుష్యం | - | సహస్య మాసం |
| మాఘం | - | తప మాసం |
| ఫాల్గుణం | - | తపస్య మాసం |

చాంద్ర సౌరమానాల సమన్వయం కోసం అధిక క్షయ మాసాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ అధిక మాసాలు ఐదు సంవత్సరాలలో 2 ఉంటాయి. దీనినే పంచవర్షాత్మక యుగం అంటారు.

వీటిలో అధికమాసాన్ని సంస్పర్పం అనీ, క్షయమాసాన్ని అహస్పతి అని అంటారు.

## మూఢం (COMBUSTION)

ఏ గ్రహమైనా సూర్యునికి దగ్గరలోకి చేరడాన్ని 'అస్తంగతం' లేదా 'మూఢం' అని వ్యవహరిస్తారు. చంద్రుడు ప్రతినెలరోజులకు ఒకసారి సూర్యకక్ష్యకు వెనుకకు వెళ్తాడు. అప్పుడు అమావాస్య ఏర్పడుతుంది. ఇది మంచి కార్యాలకు అనువైంది కాదనే భావం విదితమే. అదేవిధంగా బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని గ్రహాలు కూడా సూర్యుని కక్ష్యకు వెనుకగానో, ముందుగానో వస్తే అప్పుడు ఆ యా గ్రహాలకు అస్తంగతత్వం ఏర్పడుతుంది. అయితే శుభ గ్రహాలుగా భావించబడే గురు, శుక్రులు ఈ అస్తంగతానికి లోనయినపుడు మాత్రం వారి శుభ కిరణాల ప్రసారం భూమి మీద ఉండదని భావించి ఆ కాలంలో శుభకార్యాలేవీ చేయరు. దీనినే 'మూఢం' అని పిలుస్తారు. ఈ మూఢం ఏర్పడడానికి ప్రతి గ్రహానికి సూర్యుని నుండి ఒక ప్రత్యేకమైన దూరం ఉంది.

కుజుడు - సూర్యునికి ముందు, వెనుక 17 డిగ్రీల దూరం
బుధుడు - సూర్యునికి ముందు, వెనుక 14 డిగ్రీల దూరం
గురుడు - సూర్యునికి ముందు, వెనుక 11 డిగ్రీల దూరం
శుక్రుడు - సూర్యునికి ముందు, వెనుక 10 డిగ్రీల దూరం
శని - సూర్యునికి ముందు, వెనుక 15 డిగ్రీల దూరం

## సౌర చాంద్రమానాలు

సౌర సంవత్సరమంటే భూమి సూర్యుని చుట్టూ ఒకసారి తిరిగిరావడానికి పట్టే కాలం. ఇది 365.25 రోజుల కాలం.

చంద్రుడు భూమిని ఒకసారి చుట్టి రావడానికి పట్టే కాలం దాదాపు $29^{1/2}$ రోజులు. పన్నెండు చాంద్రమాసాలకు మొత్తం 354 రోజులు అవుతుంది. చాంద్ర, సౌరమానాలకు మధ్య దాదాపు 11 రోజుల తేడా కనిపిస్తుంది. ఈ రెండింటినీ సమన్వయం చేయడానికి ఐదు సంవత్సరాలకు రెండు అధికమాసాలు ఏర్పడతాయి. చాంద్రమానం పాటించే భారతీయులు ఈ గణన వేదకాలంలోనే చేసి పెట్టారు. వేదకాలంలో మాసాల పేర్లు మధు, మాధవ, శుక్ర, శుచి, నభ, నభస్య, ఇష, ఊర్జ, సహ, సహస్య, తప, తపస్య అనేవి. వీటితో పాటు సంసర్పం, అహస్పతి అనేవి అధిక, క్షయ మాసాలుగా వారు గుర్తించారు.

ఏ మాసంలోనైతే పూర్ణిమనాడు ఆ మాసంలో రావలసిన నక్షత్రంగాని, దాని ప్రక్క నక్షత్రంగాని కాకుండా వేరే నక్షత్రం కనిపిస్తుంటుందో అది అధికమాసం అవుతుంది. తరువాతి మాసంలో పూర్ణిమ నాడు వచ్చే నక్షత్రాన్ని బట్టి అది అధికమాసమో, క్షయమాసమో నిర్ణయ మవుతుంది.

రెండున్నర చాంద్రసంవత్సరాలు పూర్తయితే ఆ మధ్యకాలంలో సౌరమానంతో అన్వయం చేసుకోవడానికి ఒక మాసం ప్రత్యేకంగా ఏర్పడుతుంది.

ఐదు సంవత్సరాలలో రెండు అధికమాసాలు ఏర్పడడం వల్ల ఈ ఐదు వత్సరాల కాలాన్ని **'పంచవర్షాత్మకయుగం'** అని అంటాం. ఈ ఐదు సంవత్సరాలకు కూడా అందుకే ప్రత్యేకమైన పేర్లున్నాయి. వీటన్నింటిలోనూ రోజుల సంఖ్య సమానంగా ఉండదు. వాటి పేర్లు 1. సంవత్సరం 2. పరివత్సరం 3. ఇడా వత్సరం 4. ఇద్వత్సరం 5. అనువత్సరం. వీటికి సంబంధించిన అనేక గణనలు జ్యోతిష సిద్ధాంతభాగంలో మనకు కనిపిస్తాయి.

## గ్రహణాలు (ECLIPSE)

గ్రహణాలు రెండురకాలు. ఒకటి చంద్రగ్రహణం, రెండవది సూర్య గ్రహణం. రవి, భూమి, చంద్రుడు ఒకే సరళరేఖలో ఉన్నప్పుడు చంద్రగ్రహణం ఏర్పడుతుంది. రవి, భూమి ఎప్పటికీ ఒకే మార్గంలో ఉన్నప్పటికీ చంద్రుడు ఈ మార్గానికి 5 డిగ్రీలు అటూ ఇటూ తిరుగు తుంటాడు. రవి చంద్రులకు మధ్యలో భూమి ఉన్న రోజున పూర్ణిమ అవుతుంది. అయితే రవి, భూమి, చంద్రులు ఒకే సరళరేకలో ఉండి చంద్రుడు రాహువు వద్దగాని, కేతువు వద్దగాని ఉన్నప్పుడు చంద్రగ్రహణం ఏర్పడుతుంది. పూర్తి చంద్రబింబం కనపడకపోతే దాన్ని సంపూర్ణ చంద్రగ్రహణమనీ, కొంతభాగం కనిపించకుండా పోతే దానిని పాక్షిక చంద్రగ్రహణమనీ అంటాం. సూర్యుని కాంతి చంద్రునిపైన పడుతుంది. భూమి నీడపరిధిలోకి చంద్రుడు వచ్చినపుడు భూమి నీడ పరిధి దాటేంతరకు పూర్తిగా కనిపించకుండా ఉంటాడు. ఈ స్థితినే గ్రహణం అంటారు. రాహువు వద్దకు గాని, కేతువు వద్దకు గాని ఈ గ్రహాలు వచ్చినపుడు గ్రహణం ఏర్పడుతుంది. మొత్తం గ్రహణం ప్రారంభమై, పూర్ణమై మళ్ళీ పూర్ణబింబం కనిపించేసరికి 1 3/4 గంటల సమయం పడుతుంది. ఈ గ్రహణ సమయంలో చంద్రునిపై ఉష్ణోగ్రత బాగా తగ్గిపోతుంది.

రవికి, భూమికి మధ్యలో చంద్రుడు వచ్చినపుడు సూర్యగ్రహణం ఏర్పడుతుంది. ఆరోజు అమావాస్య. రవి, చంద్రులు ఒకే డిగ్రీపై మనకు కనిపిస్తుంటారు. ఇంకా ఆ సమయంలో ఆ ప్రదేశంలో రాహువుగాని, కేతువుగాని ఉండాలి. పూర్ణిమ, అమావాస్యలు ఎన్నోసార్లు వచ్చినప్పటికీ రాహు, కేతువులు ఉన్న స్థానంలో మాత్రమే ఈ గ్రహాలు వరుసగా ఉన్నప్పుడు గ్రహణాలు ఏర్పడతాయి. ఈ గ్రహణం ఏర్పడే సమయంలో భూమిపై సూర్యకాంతి పడకుండా చంద్రుడు అడ్డుగా వస్తాడు. సంపూర్ణ సూర్యగ్రహణంలో సూర్యబింబం పూర్తిగా కనిపించకుండా చంద్రుడు అడ్డుగా వస్తాడు. అదే పాక్షిక సూర్యగ్రహణ సమయంలో సూర్యునిలో చంద్రుడు కొంతభాగానికి మాత్రమే అడ్డుగా వస్తాడు. సూర్యగ్రహణం అన్ని ప్రాంతాల్లో ఒకేవిధంగా కనిపించదు. పూర్తి గ్రహణం. 8 నిమిషాలకంటే ఎక్కువ సమయం పట్టదు. ఈ గ్రహణాలు ఏర్పడడానికి సాహిత్య కథనాలు వేరు వేరుగా ఉన్నాయి.

## విషువత్తులు - అయనాలు

భూమి తనచుట్టూ తాను రోజుకు ఒకసారి తిరుగుతుంది. ఇందువల్ల పగలు - రాత్రి ఏర్పడుతున్నాయి. ఇది పూర్తి కావడానికి 24 గంటలు పడుతుంది. భూమి సూర్యుని చుట్టూ ఏడాదికి ఒకసారి ప్రదక్షిణ చేసి వస్తుంది. ఈ ప్రదక్షిణం పూర్తి కావడానికి సుమారుగా 365.25 రోజులు పడుతుంది. ఈ రెండూ అందరికీ తెలిసిన చలనాలే. ఇవి కాక భూమికి మరో చలనం కూడా ఉంది. దీన్నే 'భూ అక్ష చలనం' లేదా **'విషువచ్చలనం'** అని అంటాం. ఇది నిత్యజీవితంలో కనిపించదు. కొద్ది సంవత్సరాలలోనూ కనిపించదు. అనేక శతాబ్దాల వ్యవధిలో ఈ మార్పు వస్తుంది. దీని ప్రభావం వల్ల సుస్థిరమైనదనుకున్న మన ధ్రువనక్షత్రం 2,000 సంవత్సరాలు గడిచిన తరువాత అది ధ్రువతారగా ఉండదు. భూ అక్షం ధ్రువతార నుండి 30 డిగ్రీలు పక్కకి

జరిగి, మరో నక్షత్రం ధ్రువతార అవుతుంది. ఇక్కడ స్థాన చలనం పొందుతున్నది ధ్రువతార కాదు. కదులుతున్నవి **'విషువత్ స్థానాలు'.**

ఇక్కడ రెండు వృత్తాలు ఖండించుకుంటున్నాయి. వాటిలో ఒకటి పన్నెండు రాశుల గుండా సూర్యుడు ప్రవేశించి, ఏడాదికి ఒక చుట్టు తిరిగి వచ్చే మార్గం **'రవిమార్గం'.** ఇది స్థిరంగా ఉంటుంది. ఈ రవి మార్గాన్ని 23 1/2 డిగ్రీల వాలులో 'భూమధ్యరేఖ' రెండు బిందువుల వద్ద ఖండిస్తోంది. ఈ ఖండన బిందువులను 'విషువత్తులు' అంటారు. ఈ ఖండన బిందువుల్లో ఒకటి 'వసంత విషువత్తు' , రెండవది 'శరద్విషువత్తు'. ఏడాదిలో ఈ రెండు రోజుల్లోనూ రాత్రి, పగలు, సరిసమాన వ్యవధులు కలిగి ఉంటాయి. మిగిలిన అన్ని రోజుల్లోనూ పగటిపూట ఎక్కువగా ఉండవచ్చు. లేదా రాత్రిపూట ఎక్కువగా ఉండవచ్చు.

ఖగోళపరంగా విశదంగా తెలియజేయాలంటే రవి విశ్వ దక్షిణార్ధగోళం నుండి ఉత్తరార్ధగోళాన్ని చేరుకొనేటపుడు విశ్వమధ్యరేఖ, రవిమార్గం ఎక్కడైతే కలుసుకుంటాయో అక్కడికి చేరినపుడు ఆ బిందువును, సాయన మేష ప్రారంభ బిందువు లేదా వసంత విషువత్తు అని అంటారు. అదేవిధంగా రవి విశ్వ ఉత్తరార్ధగోళం నుండి దక్షిణార్ధ గోళానికి ప్రయాణం చేస్తున్నప్పుడు కూడా విశ్వమధ్యరేఖ, రవిమార్గం కలుసుకునే బిందువును చేరుకున్న ప్రత్యేక స్థానాన్ని సాయన తులా ప్రారంభబిందువు లేదా శరద్విషువత్తు అని అంటారు.

ఈ రెండు బిందువులూ కాక, మరో ముఖ్యమైన రెండు బిందువులు కూడా ఉన్నాయి. వీటిని 'అయనాంతాలు' అని అంటారు. ఒకటి ఉత్తరాయణాంతం లేదా 'గ్రీష్మ సంక్రమణం', రెండవది దక్షిణాయనాంతం లేదా 'హిమ సంక్రమణం'. గ్రీష్మ సంక్రమణంలో సూర్యుడు చాల ఎత్తుకి చేరుకుంటాడు. వేడిమి అత్యధికంగా ఉంటుంది. పగలు అతి దీర్ఘంగానూ, రాత్రి అత్యల్పం గానూ ఉంటుంది. హిమ

సంక్రమణంలో చలి అత్యధికంగా ఉంటుంది. సూర్యుడు చాలా తక్కువ ఎత్తుకి లేస్తాడు. చలి అత్యధికంగా ఉంటుంది.

స్థిరంగా ఉంటాయనుకునే విషువత్ స్థానాలు స్థిరంగా ఉండక, కదిలి పోతూ ఉంటాయి. రవిమార్గం స్థిరంగానే ఉంటుంది. కదిలిపోతున్నది ఖగోళ మధ్యరేఖనే. భూ అక్షం రవి మార్గానికి 23 1/2 డిగ్రీల కోణంలో వంగి ఉంది. భూ అక్షం వంగి ఉన్న దిశ నక్షత్రాల్లో స్థిరంగా ఉండక 26,000 సంవత్సరాలకి ఒక వలయం చుడుతూ ఉంటుంది. ఈ విధంగా భూ అక్షం వంగి ఉన్న దిశ మారుతూ ఉంటే నక్షత్రవీధిలో ఖమధ్యరేఖ స్థిరంగా ఉండక కదిలిపోతూ ఉంటుంది.

బొంగరాన్ని మనం తిప్పినపుడు కొద్దిగా పక్కకి ఒరిగి, నెమ్మదిగా వలయాలు చుడుతూ ఉంటుంది. అదేవిధంగా మన భూమి కూడా గోళాకృతిలో ఉండడం వల్ల భూమి యొక్క ఇరుసు స్థిరంగా ఒకే నక్షత్రంవైపుగా తిరిగి ఉండక నెమ్మదిగా వలయాలు చుడుతోంది.

దీనివల్ల జరిగిన మార్పుల్లో క్రీ.పూ. 4200 నుండి 2050 మధ్య కాలంలో వసంత విషువత్తు – వృషభంలో, శరద్విషువత్తు – వృశ్చికంలో, ఉత్తరాయణాంతం – సింహంలో, దక్షిణాయనాంతం – కుంభంలో ఉండేవి. అదేవిధంగా క్రీ.పూ. 2050 నుండి క్రీ.శ. 100 సంవత్సరాల మధ్యకాలంలో వసంత విషువత్తు – మేషంలో, శరద్విషువత్తు తులలో, ఉత్తరాయణాంతం – కర్కటకంలో, దక్షిణాయనాంతం – మకరంలో ఉండేవి. క్రీ.శ. 100 నుండి క్రీ.శ. 2250 సంవత్సరాల మధ్య వసంత విషువత్తు – మీనంలో, శరద్విషువత్తు – కన్యలో, ఉత్తరాయణాంతం – మిథునంలో, దక్షిణాయనాంతం – ధనుస్సులోనూ ఉంటాయి. ఆ యా సమయాల్లో ఆ యా రాశులకు ప్రాధాన్యం ఉంటుంది.

ప్రస్తుతం వసంత విషువత్తు మార్చి 21వ తేదీన, శరద్విషువత్తు సెప్టెంబరు 23వ తేదీన ఏర్పడతాయి. అదేవిధంగా ఉత్తరాయణం 21 డిసెంబర్‌న, దక్షిణాయనం జూన్ 21న ఏర్పడుతున్నాయి. ఉత్తరాయణంలో సూర్యుడు భూమధ్యరేఖకు ఉత్తరం వైపుగా, దక్షిణాయనంలో సూర్యుడు భూమధ్యరేఖకు దక్షిణంవైపుగా కనిపిస్తుంటాడు.

## కార్తెలు

సూర్యుడు ప్రవేశించే నక్షత్ర మాధారంగా ఆ నక్షత్రం యొక్క కార్తెను పిలుస్తుంటారు. అశ్విని నుండి రేవతి కార్తె వరకు నక్షత్రాలలో రవి ప్రవేశం ఆధారంగా కార్తెను నిర్ణయించడం భారతీయ జ్యోతిష సంప్రదాయం. ఒక్కో కార్తెలో ఒక్కో ప్రత్యేకాంశాలు జరుగుతుంటాయి. వీటిని వ్యవసాయదారులైన జానపదులు అధికంగా పరిగణనలోకి తీసుకుంటారు. వారి వ్యవసాయ కాలగణన కార్తెలతోనే తెలుస్తుంది.

ఉదాహరణకు కృత్తికలోకి రవి ప్రవేశించిన సమయంలో కృత్తిక కార్తె వస్తుంది. అయితే కృత్తిక నక్షత్రంలో రవి సంచరించే సమయంలో భూకక్ష్య సూర్యునికి అతి దగ్గరలోకి వస్తుందని అర్థం. దీనినే 'కర్తరి' అని అంటారు. ఈ సమయం అత్యంత వేడిగా ఉంటుంది. ఈ వేడివల్ల మట్టి, కట్టె, రాయి పనులు పాడవుతాయని 'మృత్ దారు శిలా కర్మాణి వర్జయేత్' అని జ్యోతిజ్ఞులు చెపుతారు. అందుకే కృత్తికా నక్షత్రానికి అగ్నిని అధిదైవంగా సూచించారు. 'రోహిణి ఎండలకు రోళ్ళు పగులుతాయని' సామెత. మృగశిర కార్తెనుండి వర్షాలు పడతాయని మన వారి భావన. అదే సమయంలో మన ప్రాంతంలోకి నైఋతి ఋతుపవనాలు ప్రవేశిస్తాయి. పంచాంగాలలో కూడా ఆర్ద్రా నక్షత్రంలో రవి ప్రవేశించే సమయంలోని తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలు, శకునాలు

తదితర అంశాలను ఆధారంగా చేసుకుని ఆ సంవత్సరంయొక్క వర్షాన్ని నిర్ణయించడం జరుగుతుంది. ఈ విధంగా వ్యవసాయదారులకు నిత్యజీవనోపయోగిగా, వ్యవసాయం పనులకు మార్గదర్శకంగా ఈ కార్తెలు ఉపయోగపడుతున్నాయి. ఇంకా చిత్తకార్తెలో కుక్కలకు సంబంధించిన శారీరక ప్రేరేపణలుంటాయన్న విషయం అనుభవైకవేద్యం. కుక్కకాటువల్ల 'రేబిస్' వ్యాధి వచ్చిన వారికి ఆ కాలంలో అది ఎక్కువై బాగా ఇబ్బంది పెట్టడం, తీవ్రమైతే వారు మరణించడం జరుగుతుంది. ఇవన్నీ వైజ్ఞానిక నిరూపణలే.

జాతక విశ్లేషణకు ఉపయోగపడే పై ప్రాథమికాంశాలతో పాటు సంహితా విభాగంలోని అంశాలుగా భావిస్తున్న కొన్ని అంశాలను ఈ క్రింద పరిశీలిద్దాం.

## గోచారం

గ్రహాల ప్రస్తుతకాల సంచారమే గోచారం. ఈ సృష్టిలోని సమస్తవస్తువులు భ్రమణశీలం కల్గినట్టివే. సూర్యకుటుంబంలో వేరువేరు గ్రహాలు భూగ్రహంపై వేరు వేరు సమయాలలో వేరు వేరు ఫలితాలను కలిగిస్తుంటాయి. సూర్య చంద్రాదుల ప్రభావాలు వీటిలో అత్యధికం. సూర్యుడు ప్రత్యక్షంగా వెలుగులను భూమిమీద ప్రసరించడం చేతనూ, చంద్రుడు అతి దగ్గరలో ఉన్న ఉపగ్రహం కావడం వల్ల వీరిద్దరి ప్రభావాలు ఎక్కువగా పరిశీలించాలి. ఈ ఫలితాలను గమనించాలంటే ఆయా గ్రహాలు భూగ్రహంనుండి ఏ కోణాలలో కనిపిస్తున్నాయో పరిశీలించి ఆ యా సమయాల్లో కలిగే శుభాశుభాలను రికార్డు చేయాలి. ఈ క్రమపద్ధతిలో అనేకసార్లు ఫలితాలను రికార్డు చేస్తున్నప్పుడు ఒక గ్రహం ఒక స్థానంలో ఉన్నప్పుడు మంచి ఫలితాలను, మరో స్థానం నుండి కనపడుతున్నప్పుడు చెడు ఫలితాలను ఇస్తుంటే మంచి ఫలితాలు ఇచ్చే స్థానాలు శుభస్థానాలనీ, చెడు ఫలితాలను ఇచ్చే స్థానాలు చెడ్డ స్థానాలుగా గుర్తిస్తారు. అయితే భూగోళంపై

ఇతర గ్రహాదులు చూపే ప్రభావం అందరికీ ఒకేరకంగా ఉండదు. ఎవరెవరికి మంచి జరుగుతుందో, ఏ విషయాలలో మంచి జరుగుతుందో, చెడు ఎవరెవరికీ ఏవిధంగా జరుగుతుందో కూడా పరిశీలించాలి. ఆ తర్వాత ఫలనిర్ణయం చేయాలి.

వ్యక్తి తను పుట్టిన సమయంలోని జాతకం ప్రకారం, గ్రహాలు, లగ్నం యొక్క స్థితిగతుల ప్రకారం ఆ వ్యక్తికి సంబంధించిన వేరు వేరు భావాలు పరిశీలించబడతాయి. ఈ స్థితిగతుల విధానాన్ని ఆ వ్యక్తియొక్క బేసిక్ ఛార్ట్ (రాశిచక్రం) అని అంటాం. ఈ రాశిచక్రమే వ్యక్తి లేదా గ్రహీత సామర్థ్యం. ఈ గ్రహీత సామర్థ్యం వేరు వేరు సమయాల్లో మార్పు చెందుతుంటుంది. ప్రస్తుత సంచార గ్రహాలు తన జన్మరాశికి, జన్మ జాతకానికి అనుకూలంగా లేకపోతే ఆ వ్యక్తి ఇబ్బందులను ఎదుర్కొంటాడు. ఈ విషయాలను సమగ్రంగా పరిశీలించేది గోచారం. గ్రహీత సామర్థ్యాన్ని జాతకాదుల ద్వారా లేదా అతని నక్షత్రం, రాశి ద్వారా నిర్ణయించి ప్రస్తుతం ఆకాశంలో కనిపించే గ్రహసంచారం అతనికి యోగ్యంగా ఉందో లేదో తెలియజేయడం గోచారం అవుతుంది.

గోచారంలో వ్యక్తి జన్మరాశినుండే ఫలితాలను గ్రహించాలి. వ్యక్తి పుట్టినపుడు చంద్రుడు ఏ నక్షత్ర పాదంలో ఉన్నాడో, ఆ నక్షత్ర పాదం ఏ రాశిలో ఉంటుందో అది అతని జన్మరాశి. ఈ రాశినుండి వేరు వేరు గ్రహాలు ప్రస్తుత సంచారంలో ఏ స్థానాలలో ఉంటే శుభకరమో తెలియజేయబడింది.

రవి - 3,6,10,11 స్థానాలలోనూ
చంద్రుడు - 1,3,6,7,10,11 స్థానాలలోనూ
బుధ - 2,4,6,8,10,11 స్థానాలలోనూ
గురుడు - 2,5,7,9,11 స్థానాలలోనూ
శుక్రుడు - 1,2,3,4,5,8,9,11,12 స్థానాలలోనూ

శని, కుజ, రాహుకేతువులు - 3,6,11 స్థానాలలోనూ శుభ ఫలితాల నిస్తారు. మిగిలిన అన్ని చోట్లా అశుభ ఫలితాలనే ఇస్తారని నియమం కాదు కాని జాగ్రత్తగా ఉండాల్సిన అవసరం ఉంటుంది. ఏ విషయాల రీత్యా జాగ్రత్తగా ఉండాలో తెలుసుకోవడానికి జ్యోతిష్కుని సహకారం అవసరమవుతుంది.

ఉదాహరణకు ఒక వ్యక్తి జన్మరాశి మేషం అనుకుంటే ఆ వ్యక్తికి గురుగ్రహం వృషభ రాశిలోనూ, సింహరాశిలోనూ, తులారాశిలోనూ, ధనుస్సురాశిలోనూ, కుంభరాశిలోనూ సంచరిస్తున్నప్పుడు శుభఫలితాలనిస్తాడు. మిగిలిన రాశుల్లో సంచరిస్తున్నప్పుడు ఆ భావాలకు అనుగుణంగా ఫలితాల వ్యతిరేకత, అనుకూలత, సమానతలను తెలుసుకోవాల్సి ఉంటుంది.

గోచారంలో ప్రత్యేకంగా పరిశీలించాల్సినవి **ఏలినాటి శని, అర్ధాష్టమ శని, అష్టమశని** అనే అంశాలు.

**ఏలినాటి శని** : ఈ పదం ప్రస్తుతకాలంలో చాలా విరివిగా అందరూ వినే పదమే. వ్యక్తి జన్మరాశికి ముందురాశిలోనూ, జన్మరాశిలోనూ, రెండవరాశిలోనూ శని గ్రహం సంచరించే కాలానికి ఏలినాటిశని అని పేరు. శని గ్రహం ఒక్కో రాశిలో రెండున్నర సంవత్సరాలు తిరుగుతూ ఉండడం వల్ల ఈ మూడు రాశుల్లో శని గ్రహ సంచారం ఏడున్నర సంవత్సరాలు ఏలినాటి శనిగా పిలువబడుతుంది. ఈ సమయంలో శని గ్రహంవల్ల కలిగే ఇబ్బందులలో భాగంగా 12వ రాశిలో సంచారం వల్ల ముఖ్యంగా సుఖం, నిద్ర లేకుండా పోతాయి. అదే జన్మరాశిలో సంచరిస్తుంటే బద్ధకం బాగా పెరుగుతుంది. 2వ రాశిలో సంచరిస్తుంటే ఆర్థికసౌఖ్యం తగ్గడం, కుటుంబంలో ఇబ్బందులు కలగడం, మాటవిలువ లేకపోవడం వంటి చెడ్డ ప్రభావాలకు లోను కావలసి వస్తుంది.

**అష్టమశని :** శని గ్రహం తన రాశికి ఎనిమిదవ రాశిలో సంచరించడం అష్టమశని అంటాం. దీనివల్ల ఆరోగ్య లోపాలు, ఆకస్మిక నష్టాలుండవచ్చు.

**అర్థాష్టమశని :** శని గ్రహం తన జన్మరాశికి నాలుగో రాశిలో సంచరించడాన్ని అర్థాష్టమ శని అంటాం. దీనివల్ల గృహ, వాహన, ఆహార సౌఖ్యాలకు దూరం అయ్యే అవకాశం ఉంటుంది.

వీటి నివారణలకు శని గ్రహానికి సంబంధించిన శాంతి చేసుకోవలసి ఉంటుంది. శనికి సంబంధించిన శాంతి ఏం చేసుకోవాలో శాంతివిభాగంలో తెలియజేయబడింది.

గోచారాన్ని మరింత లోతుగా అష్టకవర్గుద్వారా, మరి ఇతర మార్గాలద్వారా గమనించే సంప్రదాయాలున్నా పైన చెప్పిన పద్ధతి మాత్రమే అందరిచేతా ఆదరించబడుతున్నది.

సాధారణంగా దినపత్రికలలో గోచారం చూసుకోవడానికి చాలా మందికి ఉత్సాహం ఉంటుంది. దినపత్రికలలో సాయన మానం ప్రకారం, నిరయన మానం ప్రకారం రెండు విధాలుగా ఫలితాలను ఇస్తుంటారు. నిరయనమానాన్ని పాటించే వారు రాశుల ముందర వారి వారి నక్షత్రాలను ఇస్తుంటారు. అవి మేషం (అశ్విని 4 పాదాలు, భరణి 4 పాదాలు కృత్తిక 1వ పాదం), వృషభం (కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి 4 పాదాలు, మృగశిర 1, 2 పాదాలు) అంటూ ఉంటాయి. ఒక్కోసారి వ్యక్తులకు పేరు తప్ప మరేమీ వివరాలు ఉండవు. అవి రికార్డు చేయబడవు. అటువంటప్పుడు పత్రికలలోనూ, సంవత్సర ప్రారంభంలో ఉగాది రోజు జరిగే పంచాంగ శ్రవణంలోనూ తమ రాశిని గూర్చి తెలుసుకోవాలంటే తమ పేరులోని మొదటి అక్షరాన్ని చూసుకోవాలి. ఈ మొదటి అక్షరం ఏ నక్షత్రానికి చెందిందో, ఆ నక్షత్రంలోని ఆ పాదం ఏ రాశికి చెందిందో నిర్ణయించుకొని తమ రాశిని చూసుకోవాలి.

ఇది ఒకసారి చూసుకుని గుర్తు పెట్టుకుంటే చాలు. ఎప్పటికీ జీవితాంతం ఇక అదే ఉంటుంది. ఆ వివరాలు ఇక్కడ మీకు ఇవ్వబడతాయి.

| | |
|---|---|
| చూ చే చో లా - అశ్విని | లీ లూ లే లో - భరణి |
| ఆ ఈ ఊ ఏ - కృత్తిక | ఓ వా వీ వూ - రోహిణి |
| వే వో కా కీ - మృగశిర | కూ ఖం జ్ఞ ఛ - ఆరుద్ర |
| కే కో హా హీ - పునర్వసు | హూ హే హో డా - పుష్యమి |
| డీ డూ డే డో - ఆశ్లేష | మా మీ మూ మే - మఖ |
| మో టా టీ టూ - పుబ్బ | టే టో పా పీ - ఉత్తర |
| పూ షం ణా థా - హస్త | పే పో రా రీ - చిత్త |
| రూ రే రో తా - స్వాతి | తీ తూ తే తో - విశాఖ |
| నా నీ నూ నే - అనూరాధ | నో యా యీ యూ - జ్యేష్ఠ |
| యే యో బా బీ - మూల | బూ ధా భా ఢా - పూర్వాషాఢ |
| బే బే జా జీ - ఉత్తరాషాఢ | జూ జే జో ఖ - శ్రవణం |
| గా గీ గూ గే - ధనిష్ఠ | గో సా సీ సూ - శతభిషం |
| సే సో దా దీ - పూర్వాభాద్ర | దూ శం ఝా థా - ఉత్తరాభాద్ర |

దే దో చా చీ - రేవతి

మేషరాశి వారికి - అశ్వినిలో 4 పాదాలు, భరణిలో 4 పాదాలు, కృత్తికలో 1 పాదం అని అనుకుంటే ... చూ, చే, చో, లా, లీ, లూ, లే, లో ఆ ... అనే అక్షరాలు మేషరాశికి సంబంధించినవిగా చెప్పబడుతుంటాయి.

వృషభరాశి - కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి 4 పాదాలు, మృగశిర 1,2 పాదాలు - ఈ, ఊ, ఏ, వో, వా, వీ, వూ, వే, వో ... అనే అక్షరాలు.

మిథునరాశి - మృగశిర 3,4 పాదాలు, ఆరుద్ర 4 పాదాలు, పునర్వసు 1,2,3 పాదాలు - కా, కీ, కూ, ఖం, జ్ఞ , ఛ, కే, కో, హా .. అనే అక్షరాలు.

కర్కాటక రాశి - పునర్వసు 4వ పాదం, పుష్యమి 4 పాదాలు, ఆశ్లేష 4 పాదాలు - హీ, హూ, హే, హో, డా, డీ, డూ, డే, డో - అనే అక్షరాలు.

సింహరాశి - మఖ 4 పాదాలు, పుబ్బ 4 పాదాలు, ఉత్తర 1 పాదం ... మా, మీ, మూ, మే, మో, టా, టీ, టూ, టే ... అనే అక్షరాలు.

కన్యారాశి - ఉత్తర 2,3,4 పాదాలు, హస్త 4 పాదాలు, చిత్త 1, 2 పాదాలు ... టో, పా, పీ, పూ, షం, ణా, థా, పే, పో ... అనే అక్షరాలు.

తులారాశి - చిత్త 3, 4 పాదాలు, స్వాతి 4 పాదాలు, విశాఖ 1,2,3 పాదాలు ... రా, రీ, రూ, రే, రో, తా, తీ, తూ, తే ... అనే అక్షరాలు.

వృశ్చికరాశి - విశాఖ 4వ పాదం, అనూరాధ 4 పాదాలు, జ్యేష్ఠ 4 పాదాలు ... తో, నా, నీ, నూ, నే, నో, యా, యీ, యూ ... అనే అక్షరాలు.

ధనుస్సు రాశి - మూల 4 పాదాలు, పూర్వాషాఢ 4 పాదాలు, ఉత్తరాషాఢ 1వ పాదం - యే, యో, బా, బీ, బూ, ధా, భా, ఢా, బే ... అనే అక్షరాలు.

మకర రాశి - ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణం 4 పాదాలు, ధనిష్ఠ 1, 2 పాదాలు - బో, జా, జీ, జూ, జే, జో, ఖ, గా, గీ ... అనే అక్షరాలు.

కుంభరాశి - ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిషం 4 పాదాలు, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు - గూ, గే, గో, సా, సీ, సూ, సే, సో, దా ... అనే అక్షరాలు.

మీనరాశి - పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర 4 పాదాలు, రేవతి 4 పాదాలు - దీ, దూ, షం, ఝా, థా, దే, దో, చా, చీ ... అనే అక్షరాలు.

ఈ రాశుల్లో తమ నామనక్షత్రాలు ఏవో తెలుసుకోవాలి. ఉదాహరణకు **నారాయణ** అనే పేరు గల వ్యక్తికి **అనూరాధ 1వ పాదం** తన నక్షత్రం అవుతుంది. అనూరాధ నక్షత్రం ఉన్న **వృశ్చికం** తన రాశి అవుతుంది.

ఈవిధంగా నామనక్షత్ర పరిజ్ఞానంతో దినపత్రికలలోని గోచార స్వరూపాన్ని తెలుసుకోవచ్చు.

కొన్ని దినపత్రికలు సాయనమానాన్ని ప్రకటిస్తుంటాయి. వానిలో సాయన రవి వేరు వేరు రాశుల్లోకి ప్రవేశించిన తేదీ నుండి మరో రాశిలోకి ప్రవేశించే తేదీలు ప్రత్యేకంగా చెప్పబడుతున్నాయి. అవే ఆ యా వ్యక్తుల రాశులు అవుతుంటాయి. ఈ సాయన రాశులు తెలుసుకోవడానికి కేవలం తాము పుట్టిన తేది, నెల తెలిస్తే చాలు. వారి రాశి తెలిసినట్లే. ఈ తేదీల్లో చిన్న చిన్న మతాంతరాలు ఉన్నా సాధారణంగా ఈ విధంగా అందరూ గమనించవచ్చు.

మేషం (Aries) - మార్చి 21 నుండి ఏప్రిల్ 20
వృషభం (Taurus) - ఏప్రిల్ 21 నుండి మే 20
మిథునం (Gemini) - మే 21 నుండి జూన్ 21
కర్కాటకం (Cancer) - జూన్ 22 నుండి జులై 23
సింహం (Leo) - జులై 24 నుండి ఆగస్టు 23
కన్య (Virgo) - ఆగస్టు 24 నుండి సెప్టెంబర్ 23
తుల (Libra) - సెప్టెంబర్ 24 నుండి అక్టోబర్ 23
వృశ్చికం (Scorpion) - అక్టోబర్ 24 నుండి నవంబర్ 22
ధనుస్సు (Sagittarius) - నవంబర్ 23 నుండి డిసెంబర్ 21
మకరం (Capricorn) - డిసెంబర్ 22 నుండి జనవరి 20
కుంభం (Aquarius) - జనవరి 21 నుండి ఫిబ్రవరి 19
మీనం (Pisces) - ఫిబ్రవరి 20 నుండి మార్చి 20

ఈ తేదీల మధ్యలో పుట్టినవారంతా ఈ రాశికి చెందినవారవుతారు. వీనిని బట్టి ఆ యా వ్యక్తుల గోచారాదులను దినపత్రికల్లో గమనించుకోవచ్చు.

కాని తేదీలు ఇచ్చిన చోట తమ నామాక్షరాలను బట్టి చూసుకునే రాశిని గాని, నక్షత్రాలు, నామాక్షరాలు ఇచ్చిన చోట తేదీలను బట్టి చూసుకునే రాశిగాని పనికిరాదు. నక్షత్రాలు నామాక్షరాలు చంద్రరాశికి సంకేతాలు కాగా, తేదీలు రవి రాశికి సంకేతాలు. ఫలితాల నిర్మాణం రెండింటికీ వేరు వేరుగా ఉంటుంది. దేని కదే ప్రత్యేకంగా గమనించాల్సిన అవసరం ఉంటుంది.

గోచారంలో దిన, వార, పక్ష, మాస ఫలితాలను చూసే సంప్రదాయం ఆ యా పత్రికల కాలపరిమితిని బట్టి ఉంటుంది. దినగోచారం లేదా నిత్యగోచారం అనే అంశం అందరికీ తెలియాల్సిన అవసరం ఉంది. ఈ నిత్యగోచార పద్ధతిని సాధారణంగా ఏదైనా మంచి పనులు ప్రారంభించడానికి ముహూర్తాలు చూసుకోవడంలో అవసరమవుతుంది. తారాబలం కూడా ఈ అర్థంలోనే వినియోగ పడుతుంటుంది.

## తారాబలం / నిత్యగోచారం

తమ జన్మనక్షత్రం నుండి ఆ రోజు నక్షత్రం వరకు లెక్కించి దానిని 9 తో భాగించాలి. శేషం వేరు వేరు తారలుగా లెక్కించి ఫలిత నిరూపణ చేయాలి. అవి 1 శేషం వస్తే జన్మతార, 2 శేషమైతే సంపత్తార, 3 శేషమైతే విపత్తార, 4 శేషమైతే క్షేమతార, 5 శేషమైతే ప్రత్యక్తార, 6 శేషమైతే సాధన తార, 7 శేషమైతే నైధన తార, 8 శేషమైతే మిత్ర తార, 9 శేషమైతే పరమమిత్ర తారలు అవుతాయి. వీనిలో 2,4,6,8,9లు శ్రేష్ఠంగా చెప్పబడుతాయి.

ఉదాహరణకు రోహిణీ నక్షత్రం జన్మనక్షత్రంగా ఉన్న ఒకరికి రేవతీ నక్షత్రం నాడు ఏదైనా కార్యం చేయాలనుకొని నిత్యగోచారం చూస్తే తారాబలం ఏ విధంగా ఉంటుందో ఈ విధంగా గమనించాలి. రోహిణీ నక్షత్రం నుండి **రేవతీ** నక్షత్రం వరకు 24 నక్షత్రాలు అవుతాయి. 24 ను 9తో భాగిస్తే 6 శేషం

వస్తుంది. 6 శేషం వస్తే ఆరవతార సాధనతార అవుతుంది. ఆ రోజు మంచిరోజుగా భావించబడుతుంది. ఈ విధంగా తారాబలం చూడాలి.

## ఫింగర్‌టిప్స్

మన చేతిలోని చిటికెన వేలు, ఉంగరంవేలు, మధ్య వేలు లను వినియోగించుకొని కూడా ఈ విభజన లేకుండానే తారలను కనుక్కోవచ్చు. మూడు వేళ్ళకు మూడేసి కణుపులు ఉండడం వల్ల అవి 9 అవుతాయి. మన జన్మనక్షత్రం ఎప్పటికీ చిటికెన వేలు మొదటి కణుపు నుండి ప్రారంభం అవుతుంది. వరుసగా తొమ్మిది నక్షత్రాలు మూడు వేళ్ళపీ అయిపోయిన తర్వాత మళ్ళీ చిటికెన వేలు మొదటి కణుపు దగ్గరికి రావాలి. అంటే పై ఉదాహరణ రీత్యా రోహిణీ నక్షత్రం నుండి గణన ప్రారంభిస్తే 9 నక్షత్రాలు పూర్తయ్యే సరికి హస్తా నక్షత్రం వస్తుంది. మళ్ళీ 9 నక్షత్రాలు పూర్తయ్యే సరికి శ్రవణా నక్షత్రం వస్తుంది. శ్రవణం నుండి రేవతి వరకు లెక్కిస్తే గణన చిటికెన వేలు మొదటి నుండి ఉంగరం వేలు చివరి కణుపు వద్ద ఆగిపోతుంది. ఒక్కో కణుపుకు ఒక్కో తారగా పరిగణించాలి. నక్షత్రాలు వరుసగా బాగా నేర్చుకుంటే ఇది అత్యంత సులువు. ఈ విధంగా తారా బలాన్ని చూసుకోవాల్సి ఉంటుంది.

శుభ తారలైన సంపత్తు, క్షేమ, సాధన, మిత్ర, పరమమిత్ర తారలలో కార్యక్రమాలేవి చేసినా మంచి జరుగుతుంది. అశుభతారలైన జన్మ, విపత్తు, ప్రత్యక్, నైధన తారల్లో చేసే కార్యక్రమాల వల్ల ఇబ్బందులు ఏర్పడతాయి.

ముహూర్తశాస్త్రంలోని నిర్ణయాలు గోచారంలోని నిర్ణయాలు కొన్నింటిని దృష్టిలో పెట్టుకొని జ్యోతిష్కుల సలహా మేరకు కొత్త కార్యక్రమాలు నిర్వహించడం వల్ల మరింత మేలు కలుగుతుంది. సాధారణంగా పై అంశాలవరకు చూసుకుని చిన్న చిన్న నిర్ణయాలు తీసుకోవచ్చు.

# పంచాంగం - పంచాంగ శ్రవణం

పంచాంగమంటే ఐదు అంశాల సమాహారం. దీనిలో తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణమనే ఐదు అంశాలుంటాయి. పంచాగం అనేది సిద్ధాంత భాగానికి చెందిన జ్యోతిష విభాగం. ఈ పంచాంగ గణితం కష్టంతో కూడుకున్నదైనా వేరు వేరు గ్రహగతులను, భూగ్రహ గతిని అన్నింటినీ దృష్టిలో పెట్టుకొని భవిష్యత్తులో జరుగబోయే ఖగోళ విశేషాలను లెక్కగట్టి చెప్పగలిగేది పంచాంగం. సిద్ధాంతరీత్యా ఈ పంచాంగం తెలియజేసే అంశాలే ఫలిత జ్యోతిషాంశాలకు మూలమైనటువంటివి. ఈ గణనకు ఓపిక, గణనా సామర్థ్యం అధికంగా అవసరం.

గణనల ద్వారా ప్రతిరోజూ ఉన్న ఖగోళ అంశాలను చేతిలోని పుస్తకంలో చూసుకునే అవకాశం ఉంటుంది. ఆ పుస్తకమే పంచాంగం. గతకాలంలోని పంచాగాలు, ఎఫిమెరిస్‌లు చాలా కష్టతరమైన అంశాలను మాత్రమే తెలియ జేసేవి. తిథి వార నక్షత్ర యోగ కరణాలను తెలియజేయడమే అప్పటి పరమావధి. అయితే పోటీ తత్వం పెరుగుతున్న ఈ రోజుల్లో పంచాంగంలో ఎన్నో నూతన అంశాలు చోటుచేసుకొని వేరు వేరు అంశాలెన్నో ప్రచురించబడుతున్నాయి. ఐదు అంగాల ప్రారంభ అంత్య కాలాల వివరాలతో పాటు దుర్ముహూర్తం, వర్జ్యం, వేరు వేరు రాశుల్లోకి గ్రహప్రవేశ కాలాలు, పర్వదినాలు, భుక్తి లేదా భోజ్యవివరాలు ఎన్నో చేరుతున్నాయి. పూర్వం ఘడియలు విఘడియలతో ఉన్న పంచాంగం నేడు గంటలలోకి మారిపోతుంది. అదేవిధంగా ఇతర శాస్త్రాలు, ధర్మశాస్త్ర వివరాలతో కూడుకున్న అంశాలు మనకు ఎన్నో అనుబంధాలుగా చేరుతున్నాయి. వాటిలో సంఖ్యాశాస్త్రం, వాస్తుశాస్త్రం, సాముద్రికం, ధర్మశాస్త్రంలో భాగమైన శిశుజననదోషాలు, గుణాలు వివరాలు, గోచార ఫలితాలు, మరణ సంబంధమైన నక్షత్ర దోషాలు, రత్నశాస్త్రాలు,

జాతకంలోని దశాంతర్దశల వివరాలు, సుముహూర్త క్రమాలు, వాని వివరాలు, పర్వాలు అవి ఏర్పడే విధానాలు, శకునాదులు ... ఇలా ఎన్నో అంశాలు చేరి ప్రస్తుతం పంచాంగం ఒక విజ్ఞానసర్వస్వంగా, కరదీపికగా పనిచేస్తుంది.

అయితే పంచాంగాలలోని అయనాంశాదుల భేదాలవల్ల, సిద్ధాంత భేదాల వల్ల తిథ్యాదుల ప్రారంభ అంత్య సమయాలలో కొన్ని మార్పులుంటున్నాయి. ఇవి కూడా మారిపోయి అందరికీ ఒకే ప్రామాణిక పంచాంగం ఏర్పడడం మాత్రం కోరుకోదగిన అంశం.

సంవత్సర ప్రారంభదినమైన ఉగాది నాడు పంచాంగ శ్రవణం చేయడం పరిపాటి. పంచాంగం యొక్క సూచనలను అనుసరించి జీవితాన్ని గడపడం ద్వారా ఆ సంవత్సరాన్ని మనం ప్లాన్ చేసుకుని బ్రతుకవచ్చు. సంవత్సర గోచార ఫలం బాగా ఉంటే నూతన కార్యక్రమాలను ప్రారంభించడానికి అనువుగా మార్చుకోవాలి. అదేవిధంగా సంవత్సర ఫలంలో గోచారం బాగా లేకుంటే కార్యక్రమాలు జాగ్రత్తగా నిర్వహించుకుంటూ ఉండడానికి ప్రయత్నం చేయాల్సి ఉంటుంది. ఈ అంశాన్ని పంచాంగశ్రవణం తెలియజేస్తుంది. అందుకే ఉగాది రోజున పంచాంగ శ్రవణం చేయడం తప్పనిసరి అవసరం.

## నవనాయకులు : సంవత్సర ఫలితం

పంచాంగ శ్రవణంలో వ్యక్తిగతంగానే కాక దేశానికి ఫలితం చెప్పడం జరుగుతుంది. ఈ ఫలితం చెప్పడంలో నవనాయక నిర్ణయం ప్రత్యేక పాత్ర వహిస్తుంది. సంవత్సరానికి రాజు, మంత్రి, సేనాని అంటూ వేరు వేరు ఆధిపత్యాలు కేటాయిస్తారు. ఒక సంవత్సరంలో ఎన్ని గ్రహాలు శుభగ్రహాలు అధిపతులుగా ఉంటారో వారిని బట్టి ఆ సంవత్సర శుభాశుభాలు ఉంటాయి. ఈ నవనాయక నిర్ణయం ఈ విధంగా ఉంటుంది. అవి :

| | | |
|---|---|---|
| చైత్రశుక్లపక్ష పాడ్యమి నాటి వారాధిపతి | - | రాజు |
| రవి మేష సంక్రమణ వారాధిపతి | - | మంత్రి |
| రవి సింహ సంక్రమణ వారాధిపతి | - | సేనాని |
| రవి కర్కటక సంక్రమణ వారాధిపతి | - | సస్యాధిపతి |
| రవి ధనుస్సు సంక్రమణ వారాధిపతి | - | ధాన్యాధిపతి |
| రవి మిథున సంక్రమణ వారాధిపతి | - | అర్ఘాధిపతి |
| రవి ఆర్ద్ర నక్షత్ర సంక్రమణ వారాధిపతి | - | మేఘాధిపతి |
| రవి తుల సంక్రమణ వారాధిపతి | - | రసాధిపతి |
| రవి మకర సంక్రమణ వారాధిపతి | - | నీరసాధిపతి |

ఇవే కాక ఇతరమైన ఆధిపత్యాలు కూడా చాలా ఉంటాయి. వీటిలో శుభాధిపత్యాలను అనుసరించి ఆ సంవత్సర మంచి ఫలితాలను చెప్పాల్సి ఉంటుంది. చెడ్డ గ్రహాల అధిపతులను అనుసరించి ఆ యా అంశాలకు ఇబ్బందులను తెలియజేయాలి. పంచాంగ శ్రవణం ద్వారా ఈ విషయాలను తెలుసుకుని అవసరమైన పంటలు పెట్టుకొని రైతాంగం, పశుపాలకులు బాగుపడే అవకాశం ఎంతైనా ఉంటుంది. ఏ భూములు ఫలిస్తాయో, ఏ రకమైన ధాన్యం పంటలు పండుతాయో, వర్షాల శాతం ఎంతో పంచాంగ శ్రవణంలో తెలుస్తుంది. అందుకే దేశం యొక్క ఆర్థికస్థితిగతులలో మెరుగుదలను ఆపాదింపజేయుదానికి, తలసరి, జాతీయ ఆదాయాల మెరుగుదలకు పంచాంగం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎంతో ఉపయోగపడుతుంది.

## ముహూర్తం

వ్యక్తి పుట్టినపుడు ఏవిధమైన లగ్న, గ్రహవ్యవస్థ ఉంటుందో దాని ప్రకారం ఆ యా దశల్లో శుభాశుభాలు జరుగుతుంటాయి. వాటికి అనుగుణంగా తమ

జీవితాన్ని జాగ్రత్తపరచుకొనే విధానాన్ని జాతకం చెబుతుంది. అయితే జీవితంలో జరుపుకునే ముఖ్య సంఘటనలకు సంబంధించి శుభమైన కాంతులు ప్రసరించే ఉత్తమమైన కాలాన్ని ఎన్నుకోవడం, ఆసమయంలో ఆ కార్యక్రమాలను జరపడం ద్వారా ఇతర దోషాలు తొలగింపబడి ఆ కార్యం సఫలమై ఆనందం కలిగిస్తుంది. ఆ యా కార్యక్రమాలకు తత్కాల అనుకూల గ్రహ నక్షత్రాల ప్రభావాలను చూసి సమయం నిర్ణయించే విధానాన్ని ముహూర్తం అంటాం. ఆంగ్లంలో దీన్నే ఎలక్షనల్ ఆస్ట్రాలజీ అని అంటారు. నిజానికి సంహితా విభాగంలో అత్యంత అధికమైన ఆదరణ పొందిన వానిలో ముహూర్తం కూడా ఒకటి.

ముహూర్త నిర్ణయానికి ముఖ్యంగా తారాబలం చూడాలి. జరుగుతున్న కార్యక్రమాన్ని బట్టి ఎవరెవరికి ఈ తారాబలం సరిపోవాలో నిర్ణయిస్తుంటారు జ్యోతిష్కులు. ఉదాహరణకి ఉపనయనానికి ముఖ్యంగా తండ్రీ కుమారులకు (ఆచార్య వటువులకు), వివాహానికి వధూవరులకు, ఉద్యోగాదులలో ప్రవేశానికి ప్రవేశించేవారికి ... ఇట్లా తారాబలం చూడాల్సి ఉంటుంది. గృహారంభ, గృహ ప్రవేశాదుల్లో నామనక్షత్రానికి ప్రాధాన్యం ఉంటుంది. జన్మనక్షత్రం లేనివారికి నామనక్షత్రం ద్వారా చూసే పద్ధతి ఉంది. ఈ నామనక్షత్ర నిర్ణయ విధానం గోచార విభాగంలో వివరంగా ఉంటుంది.

ముహూర్తం నిర్ణయించడానికి ముఖ్యంగా మనకు కొన్ని సూత్రాలున్నాయి. అవి 1. పంచాంగశుద్ధి 2. పంచకరహితం 3. గ్రహ సంపత్తి.

**పంచాంగశుద్ధి :** పంచాంగాలంటే తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలు శుభప్రదంగా ఉండడం.

**తిథి :** పంచాంగాలలో మొట్టమొదట అందరూ గమనించేది తిథి. చంద్రుని కళలు ఈ తిథుల్లో వ్యక్తమౌతుంటాయి. చంద్రుని నుండి సూర్యునికి ఉండే దూరం తిథి అని చెప్పబడుతుంది. ఒక తిథికి 12 డిగ్రీల పరిధి

ఉంటుంది. 30 రోజులకు రోజూ 12 డిగ్రీలు ఉండడం వల్ల 360 డిగ్రీలు అవుతాయి. తిథులు మొత్తం శుక్లపక్షంలో 15 తిథులు, కృష్ణపక్షంలో 15 తిథులు ఉంటాయి.

పాడ్యమి నుండి పూర్ణిమ వరకు శుక్లపక్షంగానూ, మళ్ళీ పాడ్యమి నుండి అమావాస్య వరకు కృష్ణపక్షంగానూ గుర్తిస్తారు. ఈ 15 తిథులు ఐదు విభాగాలుగా విభజింపబడుతున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| పాడ్యమి | విదియ | తదియ | చవితి | పంచమి |
| షష్ఠి | సప్తమి | అష్టమి | నవమి | దశమి |
| ఏకాదశి | ద్వాదశి | త్రయోదశి | చతుర్దశి | పూర్ణిమ/అమావాస్య |
| **నంద** | **భద్ర** | **జయ** | **రిక్త** | **పూర్ణ** |

నంద తిథులు ఆనందాన్ని కలిగిస్తాయి. భద్ర తిథులు క్షేమాన్ని కలిగిస్తాయి. జయ తిథులు విజయాన్ని కలిగిస్తాయి. రిక్త తిథులు శూన్యఫలితాన్నిస్తాయి. పూర్ణ తిథులు పూర్ణ ఫలితాన్నిస్తున్నాయి. (అమావాస్య తప్ప)

చంద్రుడు శుక్లపక్షంలో పంచమి నుండి కృష్ణపక్షంలో దశమి వరకు బలవంతుడు. ఈ సమయంలోని పై తిథులు వ్యక్తికి సహజంగా బలాన్నిస్తాయి. అమావాస్యకు ఐదు రోజుల ముందు, ఐదు రోజుల తర్వాత చంద్రుడు బలహీనంగా ఉంటాడు. ఈ సమయాల్లో నూతన కార్యక్రమాలకు తిథి బాగా ఉన్నప్పటికీ పనికిరాదు. దీన్నే చంద్రబలం అని కూడా అంటారు.

**వారం :** మనం రోజును ఏ పేరుతో పిలుస్తామో దాన్ని ఆ వారంగా పరిగణిస్తాం. వారం ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని వారాల పేర్లతో 7 భాగాలుగా విభజించబడుతుంది. వారం ఏర్పడడానికి హోరా క్రమం ఉంటుంది. ఈ హోరలు ఆకాశంలోని గ్రహాల వరుసల్లాగా ఉంటాయి. అవి వరుసగా **శని, గురు, కుజ**, సూర్య, **శుక్ర, బుధ**, చంద్ర **హోరలు**. ఈ హోరలు ప్రతిరోజూ అవే మళ్ళీ మళ్ళీ పునరావృతమౌతాయి.

ఈ రోజు ఆదివారం అని అనుకుంటే ఈ రోజు సూర్యోదయం రవి హోరతో మొదలవుతుంది. హోర అంటే ఒక గంట కాలం. అందువల్ల సూర్యోదయం తర్వాత రెండో గంటకు రవిహోర పోయి శుక్రహోర ఉంటుంది. క్రమంగా బుధ, చంద్ర, శని, గురు, కుజ హోరలు వస్తాయి. ఇదేవిధానం మూడుసార్లు తిరగడం వల్ల సూర్యోదయం నుండి 21 గంటలు పూర్తవుతాయి. ఉదాహరణకు ఆదివారం సూర్యోదయం ఉదయం 6 గంటలకు అనుకుంటే ఉదయం 6 నుండి 7 వరకు రవి హోర, 7 నుండి 8 వరకు శుక్రహోర ....మూడుసార్లు ఈ హోరాచక్రం పూర్తయ్యే సరికి రాత్రి తెల్లవారు 3 గంటలవుతుంది. మళ్ళీ నాలుగవ సారి ఈ చక్రం ప్రారంభానికి అంటే 3 నుండి 4 వరకు రవి హోర, 4 నుండి 5 వరకు శుక్రహోర, 5 నుండి 6 వరకు బుధహోర అవుతాయి. ఇక్కడికి 24 గంటలు పూర్తయి రోజు పూర్తవుతుంది. రెండవరోజు ప్రారంభానికి బుధహోర తర్వాత చంద్రహోర వస్తుంది. అందుకే ఆ రోజును సోమవారం అని పిలుస్తుంటాం. ఈ విధంగా వారాల క్రమం ఏర్పడుతుంది.

వారాలు గ్రహాలను బట్టి ఏర్పడడం వల్ల శుభగ్రహాలకు అధిపత్యమున్న వారాలను బట్టి శుభఫలితాలు ఉంటాయి. ముఖ్యంగా గ్రహాలలో గురు, శుక్ర, చంద్ర, బుధ గ్రహాలు శుభగ్రహాలు. రవి, కుజ, శనులు అశుభ గ్రహాలు. ఈ గ్రహాలను బట్టి ఈ హోరలు ఏర్పడతాయి. శుభకార్యక్రమాలకు చంద్ర హోరతో ప్రారంభమయ్యే సోమవారం, బుధహోరతో ప్రారంభమయ్యే బుధ వారం, గురుహోరతో ప్రారంభమయ్యే గురువారం, శుక్రహోరతో ప్రారంభమయ్యే శుక్రవారం శ్రేష్టం. రవి హోరతో ప్రారంభమయ్యే ఆదివారం మధ్యమం. శని హోరతో ప్రారంభమయ్యే శనివారం కొన్ని పనులకు మాత్రమే మంచిది. మిగిలిన అన్ని విషయాలలోనూ బాగా ఉన్నప్పుడు మాత్రమే యోగ్యం. కుజహోరతో

ప్రారంభ మయ్యే మంగళవారం శస్త్రచికిత్సాదుల వంటి అంశాలకు తప్ప ఇతరమైన ఏ శుభ కార్యక్రమానికీ పనికి రాదు.

**దినహోరలు :** రోజులో గంట గంటకూ మారే హోరలను జాగ్రత్తగా చూసుకుంటూ పనులు ప్రారంభించే సమయంలో, ఎవరినైనా కలిసే సమయంలో శుభహోరలలో ప్రారంభిస్తే దానివల్ల శుభఫలితాలు కలిగి కార్య విజయం సిద్ధిస్తుంది. ఈ హోరలలో చేసే కార్యక్రమాలు ఈ విధంగా ఉండవచ్చు.

**1. రవి :** దావాలు, అప్పీళ్ళు చేయడానికి, ఉత్తరాలు, దస్తావేజులకు, నోట్లు వ్రాయడానికి, సన్మానాలు కోరడానికి, కొనుటకు, తిరుగుటకు ఉద్యోగం కొరకు అప్లికేషను పెట్టడానికి మంచిది. న్యాయమైన పనులకు, రాజకీయ వ్యవహారాలు, అధికారులను కలుసుకోవడానికి, ఉద్యోగ ప్రయత్నాలు, వ్యవహారాలకు మంచిది.

**2. చంద్ర :** గృహారంభం, గృహప్రవేశం, నగలు ధరించడం, ఒకరివద్ద కొత్తగా ప్రవేశించడానికి, వ్యవసాయారంభం, ఒకరివద్ద క్రొత్తగా ప్రవేశించడానికి, వ్యవసాయారంభం, తోటలు పాతడానికి, స్త్రీ సౌఖ్యం పొందడానికి, గొప్పవారిని దర్శించడానికి, నీటి ప్రయాణం చేయడానికి, క్రొత్తపాత్రల్లో భుజించడానికి మంచిది. నౌకాయానం, వ్యాపారులు, ఉప్పు, ప్రత్తి, వెండి, కంచు, పశువులు, బెల్లం, పంచదార మొ॥ తెల్లరంగు వస్తువులు కొనుటకు మంచిది.

**3. కుజ :** పాపగ్రహం, కష్టనష్టాలు, చిక్కులు కలుగుతుంటాయి. ఏ మంచిపని ఆరంభించకూడదు. విఘాతం, రక్తదర్శనం అవుతుంది. యుద్ధాలకు, సాహసకృత్యాలకు, భూసంబంధమైన విషయాలు మాట్లాడుకోవడానికి, సువర్ణ, తామ్ర, కంబళ, రస మొదలైన వస్తువులు కొనడానికి మంచిది. ఇందుకు సంబంధించిన వ్యాపారాలకు కూడా మంచిది.

**4. బుధ :** నూతన వర్తకం, దానికి సంబంధించిన వ్యాపారాలకు, విద్యకు సంబంధించిన పనులకు, సమస్త శుభకార్యాలకు, దస్తావేజులు మొదలైన వ్రాతపనులకు మంచిది. నూతన వ్యాపారం, ఆటలు, అప్పుతీర్చడం, ముద్రణ, సువర్ణం, వస్త్రాలు, ప్రత్తి, నూలు, చర్మం మొ॥ వ్యాపారాలకు మంచిది.

**5. గురు :** పిల్లలకు సంబంధించిన ఉయ్యాలలో పెట్టడం, ముక్కు చెవులు కుట్టడానికి, శుభాలకు, గొప్పవారిని దర్శించి బహుమతులు పొందడానికి, ఉద్యోగ సంబంధమైన విషయాలు, బాకీలు వసూలు చేయడానికి, ఏ వస్తువైనా కొనడానికి, లాటరీ పజిల్స్ వేయడానికి, నూతన వస్త్రాలు ధరించడానికి, విద్యాసంబంధమైన సర్వ కార్యాలకు మంచిది. వివాహం, ఉపనయనం, అప్పు తేవడం, తీర్చడం, గ్రంథరచన, ఉద్యోగంలో చేరడానికి, స్త్రీసౌఖ్యానికి మంచిది.

**6. శుక్ర :** సంబంధాలు నిశ్చయించడానికి, సంతకాలు పెట్టడానికి, ఔషధసేవకు, స్త్రీలలో మెలగడానికి, రైలు ప్రయాణానికి, నూతన వస్త్రాలు ధరించడానికి, సమస్త శుభకార్యాలకు, నిశ్చయ తాంబూలా లకు మంచిది. ఈ హోరలో కొనుటకంటె ఏవస్తువైనా అమ్మడం అమ్మడం మంచిది. నువ్వులు, నూనె, మినుములు, ఇనుము, నేతి వస్తువులు మొ॥ వ్యాపారానికి మంచిది.

**7. శని :** భూమి అమ్మడానికి చాలా మంచిది. తైల సంబంధ వ్యాపారాలకు శుభం. మిగతా ఏ వ్యాపారాలకు పనికిరాదు. మద్య శాలారంభం, చౌర్యం, పొగాకు, దున్నలకు కాడిగట్టడం, తైల వ్యాపారాలు, గానుగవేయడం, నీచవృత్తికి మంచిది.

ఈ విధంగా వారాలను అనుసరించి, హోరాక్రమాన్ని అనుసరించి ముహూర్తాలు నిర్ణయించవచ్చు. వేరు వేరు కార్యక్రమాలకు వేరు వేరు హోరలు, వేరు వేరు వారాలు శుభాశుభాలుగా ఉంటుంటాయి.

## ప్రతిదిన హోరా చక్రం

| వారం | 6-7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| మంగళ | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |

సూర్యోదయ కాలం నుండి ఈ సమయాలను ఒక గంటపాటు తీసుకోవడం వల్ల స్పష్టమైన ఫలితాలు ఉంటాయి. పైన కేవలం మధ్యేమార్గమైన సమయాన్ని సూచించడం జరిగింది. హోరాకాలాన్ని గుర్తించి ఆ యా హోరల్లో చేయదగిన పనులు చేస్తూ ఉండడం వల్ల సమయం సద్వినియోగం అవుతుంది. రాత్రి పూట కూడా ఇదే వరుసలో గమనించాల్సిన అవసరం ఉంది. శని, కుజ హోరలు ప్రత్యేకమైన పనులకు మాత్రమే కేటాయించడం మంచిది. శని హోరలో ఆలస్యాలకు, కుజహోరలో ఉద్వేగాలకు ఆస్కారం అధికంగా ఉంది. శుభకార్యాల విషయంలో గురు, శుక్ర, చంద్ర హోరలు, ఆఫీసు విషయాలకు రవి హోర, వ్యాపారానికి బుధహోరలు శుభాన్నిస్తాయి.

**నక్షత్రం :** పంచాంగాలలో మూడవది నక్షత్రం. నక్షత్రాలు 27. చంద్రుని మార్గంలో ప్రతిరోజూ ఆకాశంలో కనిపించేవి నక్షత్రాలు. ఒకరోజు పంచాంగంలో ఏ నక్షత్రమని రాస్తుంటారో ఆ నక్షత్రం ఆకాశంలో చంద్రుని దగ్గరలో కనిపిస్తుంటుంది. దానిని బట్టి ఆ రోజుకు ఆ నక్షత్రంగా నిర్ణయిస్తుంటారు. ఈ 27 నక్షత్రాలు ఇవి.

| | | | |
|---|---|---|---|
| 1. అశ్విని | 2. భరణి | 3. కృత్తిక | 4. రోహిణి |
| 5. మృగశిర | 6. ఆరుద్ర | 7. పునర్వసు | 8. పుష్యమి |
| 9. ఆశ్లేష | 10. మఖ | 11. పుబ్బ | 12. ఉత్తర |
| 13. హస్త | 14. చిత్త | 15. స్వాతి | 16. విశాఖ |
| 17. అనూరాధ | 18. జ్యేష్ఠ | 19. మూల | 20. పూర్వాషాఢ |
| 21. ఉత్తరాషాఢ | 22. శ్రవణం | 23. ధనిష్ట | 24. శతభిషం |
| 25. పూర్వాభాద్ర | 26. ఉత్తరాభాద్ర | 27. రేవతి. | |

వీటికి అధిదైవాలు, ఆకృతులు వేరు వేరుగా ఉంటాయి. వాటి వివరాలను నక్షత్రవిజ్ఞానమనే విభాగంలో తెలియజేయడం జరిగింది.

ఈ నక్షత్రాలలో సాధారణంగా మఘ, మృగశిర, హస్త, స్వాతి, మూల, అనూరాధ, రేవతి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, అశ్విని, చిత్త, ధనిష్ఠ, శ్రవణం, పునర్వసు నక్షత్రాలు దాదాపు అన్ని శుభకార్యక్రమాలకు ఉపయోగపడతాయి.

**యోగాలు 27 :** 1. విష్కంభం 2. ప్రీతి 3. ఆయుష్మాన్ 4. సౌభాగ్యం 5. శోభనం 6. అతిగండం 7. సుకర్మ 8. ధృతి 9. శూలం 10. గండం 11. వృద్ధి 12. ధ్రువం 13. వ్యాఘాతం 14. హర్షణం 15. వజ్రం 16. సిద్ధి 17. వ్యతీపాత్ 18. వరీయాన్ 19. పరిఘా 20. శివం 21. సిద్ధం 22. సాధ్యం 23. శుభం 24. శుభ్రం 25. బ్రాహ్మం 26. ఐంద్రం 27. వైధృతి.

పై వానిలో అతిగండ, శూల, గండ, వ్యాఘాత, వ్యతీపాత్, పరిఘ వైధృతి అనే యోగాలు మంచివి కావు. సూర్య చంద్ర స్ఫుటాలను కలిపితే యోగం వస్తుంది. యోగాలలో పై యోగాలను శుభకార్యాలలో వర్జించగలిగితే మంచిది.

**కరణాలు 11** : 1. బవ 2. బాలవ 3. కౌలవ 4. తైతుల 5. గరజి 6. వణజి 7. భద్ర 8. శకుని 9. చతుష్పాత్ 10. నాగవం 11. కింస్తుఘ్నం.

తిథిని రెండుభాగాలు చేస్తే కరణం వస్తుంది. అమావాస్యకు ముందు వెనుకలలో వచ్చేవి స్థిరకరణాలు. మిగిలిన కరణాలు చరకరణాలు. శకుని, చతుష్పాత్, నాగవం, కింస్తుంఘ్నం అనేవి స్థిరకరణాలు. శుభకార్యాలలో స్థిర కరణాలను పూర్తిగా వదిలివేయాలి.

బవ, బాలవ, కౌలవ, గరజి, వణజి – ఈ ఐదు కరణాలు శుభాలు.

ఈ విధంగా తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం మంచివి అయి వ్యక్తికి అవి యోగ్యమైనవే అయితే పంచాంగశుద్ధి కలిగినట్టే.

పంచాంగశుద్ధి తర్వాత పంచకరహితాన్ని గూర్చి తెలుసుకోవాలి. దీనిలోనూ మతాంతరాలు అధికంగా ఉన్నప్పటికీ సాధారణంగా తెలుసుకోవలసిన పద్ధతి మాత్రం ఇక్కడ వివరించబడుతుంది.

పంచకం అంటే ఐదు విషయాలు అని అర్థం. ఈ ఐదు శుభప్రదమైనవి కావు. వానిని ముహూర్తంలో లేకుండా చూడడమే పంచకరహితం. తిథి వార నక్షత్ర లగ్నాల కలయిక ద్వారా ఈ పంచక రహిత విషయాన్ని పరిశీలించాలి.

ఏరోజు ముహూర్తం పెట్టాలనుకుంటామో, ఏ సమయానికి ముహూర్తం అవసరమో ఆ సమయానికి ఉన్న తిథి, వారం, నక్షత్రం, లగ్నాల సంఖ్యలను కలపాలి. తిథిని పాడ్యమి నుండి, వారాన్ని ఆదివారం నుండి, నక్షత్రాన్ని

అశ్విని నుండి, లగ్నాన్ని మేషం నుండి లెక్కించాల్సి ఉంటుంది. ఈ సంఖ్యలన్నింటినీ కూడి 9తో భాగాహారం చేస్తే శేషం 1 అయితే మృత్యు పంచకం 2 అయితే అగ్ని పంచకం 4 అయితే రాజపంచకం 6 చోరపంచకం 8 రోగపంచకం అవుతాయి. ఈ ఐదు పంచకాలు శేషం రాకుండా చూసుకోవడమే పంచకరహితం.

ఉదాహరణకు శుక్ల పక్ష దశమి గురువారం ఉత్తరా నక్షత్రం మీన లగ్నంలో ఏదైన ఒక ముహూర్తం నిర్ణయిస్తే దానికి పంచకరహితం ఈ విధంగా చూసుకోవాలి.

పాడ్యమి నుండి దశమివరకు -10,
ఆదివారం నుండి గురువారం -5
అశ్విని నుండి ఉత్తరా నక్షత్రం - 12
మేషం నుండి మీనలగ్నం - 12

మొత్తం-39. దీన్ని 9 చేత భాగిస్తే 3 శేషం వస్తుంది. కాబట్టి ఈ ముహూర్తం పంచకరహితమైనట్లు భావించాలి. ఈ నిర్ణయంలో కొన్ని మతాంతరాలు ఉన్నాయి.

లగ్నసంపత్తి అనే అంశం మరో ప్రత్యేకాంశం. ఇది అత్యంత ప్రముఖంగా చూడాల్సినది. ఏ యే ముహూర్తాలకు ఏ యే స్థానాలు శుద్ధిగా ఉండాలో, ఏ ముమూర్తాలకు ఏ యే గ్రహాలు ఏ యే స్థానాల్లో ఉంటే బలవత్తరమైన ముహూర్తం అవుతుందో చూసుకొని నిర్ణయాన్ని ప్రకటించడం గ్రహసంపత్తి అవుతుంది. ఈ నిర్ణయం ఒక్కోసారి జాతక ఫలితం చూడడం కన్నా కష్టతరమైంది. అంత త్వరగా శుభముహూర్త నిర్ణయం సాధ్యం కాదు. ఎందుకంటే గ్రహాలు ఉన్న స్థానాన్ని బట్టి మనం నిర్ణయం తీసుకోవాలి కాని మనకు అనుకూలంగా గ్రహాల ప్రయాణం ఉండదు. పంచాంగాలలో ముహూర్తాలను కూడా గుడ్డిగా

అనుసరించడమూ తప్పే. ఆ యా సమయాలు, దోషాలు, ప్రాంతభేదాన్ని బట్టి కాలమాన సవరణలు అన్నీ కూడా ఈ విషయంలో ప్రత్యేక పరిశీలనాంశాలే.

తిథి కి ఒకగుణం, నక్షత్రానికి 4 గుణాలు, వారానికి 8 గుణాలు, కరణానికి 16 గుణాలు, యోగానికి 32 గుణాలు, తారాబలానికి 60, చంద్రబలానికి 100 గుణాలుంటాయని అథర్వ వేదాంగ జ్యోతిషం చెబుతుంది. అందువల్ల ఏ యే సమయాల్లో ఏ విషయానికి తప్పని సరి ప్రాధాన్యమివ్వాలో, ఏ అంశాలను వదిలి పెట్టవచ్చో నిర్ణయం కొంత లోతుగా అధ్యయనం చేస్తే ఏర్పడుతుంది. వర్జ్యం, దుర్ముహూర్తాదులు చూసి ప్రాంతపరమైన కొన్ని ఆచార వ్యవహారాలు తెలుసుకొని ముహూర్తం పెట్టుకోవడం వల్ల ఆ కార్యక్రమానికి మరింత గట్టిదనం ఏర్పడి ఉత్తమమైన జీవితం ఏర్పడుతుందనడంలో సందేహం లేదు.

శుక్లపక్షంలో పంచమి నుండి కృష్ణపక్షంలో దశమి మధ్యలో మంచి పనులకోసం ముహూర్తాలు పెట్టుకోవచ్చు. ఈ రోజుల్లో వచ్చే నందతిథులు (పాడ్యమి, షష్ఠి, ఏకాదశి), భద్ర తిథులు (విదియ, సప్తమి, ద్వాదశి), జయతిథులు (తదియ, అష్టమి, త్రయోదశి), పూర్ణతిథులు (పంచమి, దశమి, పూర్ణమి) ఏవైనా ఎంచుకోవచ్చు. ఈ సమయాలలో ఉండే నక్షత్రాలలో శుభ నక్షత్రాలు, ఆ రోజున కనీసం వ్యక్తికి తారాబలం సరిపోయేటట్లు చూసుకోవాలి. ఆ రోజున కూడా పంచాంగంలో సూచించిన విధంగా వర్జ్య కాలంలోనూ, దుర్ముహూర్త కాలంలోనూ పనిని ప్రారంభించకూడదు. రాహుకాలాదులు, యమగండాదులు తమిళప్రాంతం వారు అధికంగా అనుసరించేవి కావడం వల్ల ఇక్కడి వారు ప్రత్యేకంగా గమనించాల్సిన అవసరం లేదు.

ముహూర్తాల విషయంలో ఏకవింశతి మహాదోషాలను కూడా గమనించే సంప్రదాయం ఉంది. ఈ దోషాలనన్నింటినీ మనం తీసివేయలేము కాని

తెలిసి ఉండడం వల్ల సాధ్యమైనంత మంచి ముహూర్తం వెతుక్కునే అవకాశం మాత్రం ఉంటుంది. ఆ ఏకవింశతి (21) మహాదోషాలు ఇవి :

1. పంచాంగ శుద్ధి దోషం 2. సూర్య సంక్రమణ దోషం
3. కర్తరీ దోషం 4. షష్ఠాష్టరిఃఫ చంద్రదోష
5. ఉదయాస్త శుద్ధి దోషం 6. దుర్ముహూర్తదోషం
7. గండాంతదోషం 8. పాప షడ్వర్గ దోషం
9. భృగుషట్కదోషం 10. కుజాష్టమదో
11. అష్టమలగ్న దోషం 12. విషఘటీ దోషం
13. కునవాంశదోషం 14. సగ్రహచంద్ర దోషం
15. ఖర్జూర సమాంఘ్రికా దోషం 16. గ్రహణోత్పాత దోషం
17. క్రూరగ్రహవిద్ధదోషం 18. క్రూరసంయుత దోషం
19. అకాలగర్జిత వృష్టిదోషం 20. మహాపాత దోషం
21. వైధృతి, వ్యతీపాత దోషం.

ఈ దోషాలు వివాహాది సుముహూర్తాదులలో గమనించాల్సిన అవసరం ఉంటుంది. అయితే అన్నింటినీ మనం గమనించలేము, అటువంటి ముహూర్తాలు కూడా దొరకడం కష్టం కావడం వల్ల గుణాధిక్యమైనవి, దోషస్వల్పమైన ముహూర్తాలను ఎన్నుకోవడం శ్రేష్ఠం.

స్వల్పమైన దోషాలు ఉన్నప్పటికీ ముహూర్త లగ్నం విషయంలో కొన్ని ప్రత్యేకాంశాలు పాటిస్తే దోష నివారణ ఉంటుంది.

లగ్నంలో బలవంతుడైన బుధుడుంటే ఎన్నో దోషాలు నివారించ బడతాయి. బలవంతుడైన శుక్రుడు లగ్నంలో ఉంటే బుధునికన్నా రెట్టింపు దోషాలకు నివారణ ఉంటుంది. బలవంతుడైన గురుడు లగ్నంలో ఉంటే పదింతల దోషాల నివారణ కలుగుతుంది. రవి ఏకాదశ స్థానంలో ఉండే

ముహూర్తానికి అత్యధిక బలం కలిగి ఎన్నో దోషాలకు నివారకం అవుతుంది.

ముహూర్తకాలమంటే ముఖ్యంగా పూజలు ఆరంభించే కాలమని కాదు. కార్యక్రమ ప్రారంభకాలమని అర్థం. కిరాణాషాపు ముహూర్తమంటే మొదటి వస్తువును అమ్మి సొమ్ము చేసుకునే సమయ మని అర్థం. ఉద్యోగముహూర్తమంటే బాధ్యత తీసుకొని కార్యక్రమం ప్రారంభించడం అని అర్థం. ఉపన్యాసకుడుగా ఒక కళాశాలలో చేరితే ముహూర్త సమయంలో విద్యార్థులకు పాఠం చెప్పేటట్లు చూసుకోవడం మరీ మంచిది. ఇట్లా ముహూర్తం గమనించాలి. జీవితంలో ప్రతి అంశానికీ ముహూర్తం చూసుకోవాల్సిందే. దానివల్లనే శ్రేయస్సు కలుగుతుంది. కార్యక్రమం నిర్విఘ్నంగా సక్రమంగా సాగుతుంది. వాస్తు నిర్మాణం ఏవిధంగా మన చేతిలో ఉన్నదో, ముహూర్తం కూడా మన చేతిలో ఉన్న అంశమే. ప్రస్తుతకాలంలో దీనికి అత్యధిక ప్రాధాన్యం ఉంది. వ్యక్తిప్రాధాన్యానికి లొంగకుండా విషయ, ముహూర్త ప్రాధాన్యానికి వ్యక్తి లొంగితే తప్పనిసరిగా శ్రేయస్సు కలుగుతుం దనడంలో సందేహం లేదు.

## మేలాపకం

మేలాపకమంటే ఇరువురి జాతకాల మధ్య సరియైన అవగాహన ఉంటుందో లేదోనని చూసే ప్రక్రియ. ఇది సాధారణంగా అందరి మధ్య చూడవచ్చుగాని ప్రత్యేకంగా కలిసి కాపురం చేయబోయే వారి మధ్యలో ఈ పొంతన చూడడం వల్ల వారిద్దరి మధ్యలో ఏర్పడే అవగాహన ద్వారా కుటుంబం బాగుంటుంది. ఇరువురి మధ్యలో బావుంటే ఇంట్లో బావుంటుంది. ఇంట్లో బావుంటే విశ్వకుటుంబ భావన ఏర్పడుతుంది. సంతానం ఆనందంగా ఎదుగుతుంది. వారి ద్వారా సమాజానికి మంచి సందేశం అందుతుంది. ప్రజాయై గృహమేధినామ్ అనే వైదిక మంత్రానికి అనుకూలంగా చక్కని సంతానం కలగడానికి కుటుంబమంతా ఆనందంగా ఉండడానికి మూలంగా భార్యా

భర్తల మధ్య అవగాహన సరిగా ఉండాలి. ఆ విషయాన్ని జ్యోతిషపరంగా చూసే ప్రక్రియ మేలాపకం. దీనినే **పొంతనలు** అని, **మ్యాచింగ్** అని పిలుస్తుంటారు. ఈ రకంగా ప్రత్యేకంగా భార్యాభర్తల మధ్యలోనే చూసే ఈ ప్రక్రియకు పూర్వం నుండి అనేక సూత్రాలు ఏర్పడినాయి. ఈ సూత్రాలు ఆ కాలంలోని ప్రాంతీయ, వయోపరమైన వ్యవస్థలకు ప్రతీకగా ఉన్నాయి. కాని ప్రస్తుతం పెరిగిన ఆర్థికస్వాతంత్ర్యం, సామాజిక హోదా, యుక్తవయస్సులో వివాహాలు, విద్యాత్మకస్థితి ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని పాశ్చాత్య ధోరణులు ఇప్పుడిప్పుడే మనపై ప్రభావాలను చూపిస్తున్న నేపథ్యంలో మనం ఈ అంశాలను ప్రత్యేకంగా ఆలోచించాలి. దీనికోసం ఇద్దరి జాతకాలను ప్రత్యేకంగా పరిశీలించాలి.

ముఖ్యంగా ఇద్దరి మధ్య మానసిక బంధం ఏర్పడి ప్రేమ, అనురాగాల కోసం ఇరువురి జన్మరాశుల అధిపతులను పరిశీలించాలి. ఇద్దరి జన్మరాశుల అధిపతులు మిత్రులు కావడం శ్రేష్ఠం. ఆ తర్వాత అష్టకూటాలు, దశకూటాలు చూసే సంప్రదాయం ఉంది. వాటిలో **దినకూటమి, గణకూటమి, మహేంద్ర కూటమి, దృక్ కూటమి, యోని కూటమి, రాశి కూటమి, ఆధిపత్య కూటమి, వశ్యకూటమి, రజ్జుకూటమి, వేధకూటమి, వర్ణకూటమి, నాడీకూటమి** మొదలైన వానిని చూసే సంప్రదాయం ఉంది. వీటిలోనూ వేరు వేరు కూటాల కలయికకు గుణాలుంటాయి. ఈ గుణాలు కలయిక చెందడమే గుణమేళనం. ఎక్కువ గుణాలు కలిస్తే వారి మధ్య వేరు వేరు అంశాలలో అన్యోన్యత ఉన్నట్లు అర్థం.

ఇక్కడ ఈ కూటములన్నింటికీ వేరు వేరు అర్థాలుంటాయి. ఇవి ఇద్దరి భౌతిక జీవనాన్ని, సంతోషజీవనాన్ని, మనస్తత్వాన్ని ప్రేరేపించేవి. ఉదాహరణకు గణకూటమిలో వేరు వేరు నక్షత్రాలనుదేవ, మనుష్య, రాక్షస అనే గణాలుగా విభజిస్తారు. ఒక వ్యక్తి ఒక నక్షత్రానికి చెందినవాడంటే ముఖ్యంగా అతని

మనస్తత్వానికి సంబంధించిన ఒక గుర్తును ఏర్పాటు చేసుకోవడమే. దేవగణ నక్షత్రాలు, మనుష్యగణ నక్షత్రాలు, రాక్షసగణ నక్షత్రాల వారిలో ఒకే గణం కలిగినవారి మధ్యలో వివాహాదికాలు చేసుకోవడం వల్ల ఇబ్బందులు ఉండవు.

**స్వగణంచోత్తమం ప్రీతి మధ్యమం దైవమానుషమ్**
**అధమం దేవ దైత్యానాం మృత్యుర్మానుష రాక్షసమ్**

అనే శ్లోకభావాన్ని అనుసరించి ఏ గణమైన ఒకే గణం వారు చేసుకునే వివాహం వల్ల వారి జీవనం ఆనందమయం. దైవ మనుష్య గణాలవారి మధ్యలో జరిగే వివాహం మధ్యమం. దైవ రాక్షస గణాల మధ్య జరిగే వివాహం అధమం. మనుష్య రాక్షస గణాలవారి మధ్యలో జరిగే వివాహం అత్యంత ఇబ్బందికరం.

వైజ్ఞానికంగా ఇక్కడ దేవగణంవారి శరీర మనస్థితులు సాఫ్ట్‌గా ఉంటాయని, మనుష్యగణం వారి శారీరక మానసిక ప్రవర్తనలు మధ్యస్థంగా ఉంటాయని, రాక్షసగణం వారి శారీరక మానసిక ప్రవర్తనలు కొంత ఉద్వేగంతో తీవ్రతతో ఉంటాయని తెలుస్తుంది. ఇద్దరూ ఒకే గణం వారు వివాహం చేసుకుంటే వారి భౌతిక జీవనంలోని శారీరక సౌఖ్యంలో వారిద్దరి తత్వం ఒకటే కావడం వల్ల ఇబ్బంది పడే అవకాశం లేదు. దానివల్ల సంతోషం అధికంగా ఉంటుంది. వేరు వేరు గణాలకు చెందినవారైతే (రాక్షస-దేవ, మనుష్య-రాక్షస) వారి మధ్యలో జరిగే ప్రేమ, కాముక భావాలలో ఒకరిని మరొకరు భరించలేక పోవడం గాని, ఒకరిని మరొకరు తృప్తిపరచలేకపోవడంగాని సంభవిస్తుంది. అందువల్ల వారు సౌఖ్యాన్ని, సంతోషాన్ని పొందలేరు. కుటుంబవ్యవస్థలోని సంతోషజీవనంలో, వ్యక్తిగత జీవనంలోనూ కలిగే ఈ లోపాలవల్ల సమాజ జీవనంలో వారు సరియైన విధంగా రాణించలేరు. వారు ఏ లోపాన్ని పొందుతుంటారో దాన్ని సాధించడానికి తమ సమయం వెచ్చించడం మొదలు

పెట్టడం వల్ల కుటుంబ వ్యవస్థ, సమాజ వ్యవస్థ రెండూ ఛిన్నాభిన్నమవుతాయి. ఒక చిన్న కూటమే అయినా దాని వెనుక ఉండే అర్థాలను పరిశీలిస్తే జరగబోయే దుష్పరిణామాలు అర్థం చేసుకోవచ్చు. అయితే జాతకంలోని మనస్తత్వాల (చంద్రరాశుల లేదా గ్రహమైత్రి) ఐక్యత ఉంటే ఈ అంశాలలోని లోపాలను, గుణాలను ఇద్దరూ ఒకరికొకరు పంచుకునే అవకాశం కలుగుతుంది.

నాడీ కూటమిలోనూ ఇదే విషయం మనకు కనిపిస్తుంది. మన శరీరంలోని 72 వేల నాడులకు స్పందన ఉంటుంది. అవన్నీ మన చర్మం క్రిందుగా ప్రారంభమవుతాయి. వాటికి కలిగిన స్పందనను అవి గుర్తిస్తే అతి త్వరగా అవి ఆ యా సమాచారాదులను చేర్చవలసిన చోటుకి చేర్చి ఆనందిస్తుంటాయి. అదే విధంగా ఇబ్బంది కలిగితే ఆ సమాచారం కూడా అందిస్తాయి. నాడీకూటమిలో ఒకేనాడి వారి మధ్యలో జరిగే వివాహాలకు ప్రాధాన్యం లేదు. ఇద్దరివీ ఒకే నాడీ తత్వం ఉంటే వారి మధ్య స్పందన అంతగా ఉండకపోవచ్చు. భిన్న నాడులవారైతే ఒకరి భావ, శారీరక స్పందనలు మరొకరికి ఆనందాన్ని కలిగించి వారి బంధాన్ని ఆనందమయం చేస్తుంటాయి. ఇటువంటి అంశాలే ప్రతి కూటమికి అంతరభాగాలలో ఉంటుంటాయి. గమనించి మేలాపకం చూసుకుని వివాహాదికాలు చేసుకోవడం వల్ల మేలు కలుగుతుంది. కోరుకున్న కోరికలు తీరి ఆనందమయమైన జీవనం కొనసాగించే అవకాశం కలుగుతుంది.

జాతకాలు రెండింటిలోనూ ప్రత్యేక కలయికలున్నప్పుడు వారిద్దరి అంతర్గత కుటుంబ జీవితం ఆనందంగా సాగుతుంది. ఈ గుణాలు కలయిక లేకున్నప్పుడు కూడా వచ్చే ఇబ్బందులు తెలుసుకుంటూ ఒకరికొకరు సర్దిచెప్పుకుంటూ కూడా ఆనందజీవనాన్ని కొనసాగించవచ్చు. అయితే కనీసం చూడాల్సిన కూటములలో ఈ రోజుల్లో గ్రహమైత్రి ప్రధానం. సమాజంలోని

అన్ని వర్గాలవారికి కూడా ఈ కాలంలో ఈ అంశంలో భేదంలేదు. అన్నీ అందరికీ చూడవలసిందే. గ్రహమైత్రినే ఆధిపత్యకూటమి అంటారు. ఇరువురి రాశుల అధిపతులు మిత్రులు కావడం గ్రహమైత్రి. ఇది కలిస్తే ఇతర కూటములలో ఏవైనా లోపాలున్నా ఒకరి భావాలు మరొకరికి పంచుకొని అవసరమైన రీతుల్లో ఒకరిని మరొకరు తీర్చి దిద్దుకునే అవకాశం ఈ తత్వానికి ఉంది. వయస్సు బాగా పెరిగిన తర్వాతనే నేడు పెండ్లిండ్లకోసం ఇష్టపడడం, శరీర సంబంధమైన విజ్ఞానాదులు చిన్నప్పుడే పుస్తకాల ద్వారా అధ్యయనం చేయడం, మీడియా ప్రభావాలు ... మొదలైన అంశాలకు ప్రభావితులై ఉండడం వల్ల జంటలు పరస్పరం ఒకరి భావాలు మరొకరు పంచుకోవడం, శారీరక మానసిక విషయాలలో తాము పొందే ఇబ్బందులను, సంతోషాలను వ్యక్తీకరించుకోవడం వల్ల ఒకరికి అనుగుణంగా మరొకరు ప్రవర్తించే అవకాశం ఉంటుంది. గ్రహమైత్రి కనీసం లేకుంటే ఈ పంచుకునే అవకాశం కూడా ఉండక ఒకరు మరొకరికి లొంగి ఉండాలని, వారు అనుకున్నట్లే వారి వారి జీవనగమనం సాగాలని అనుకోవడం వల్ల కుటుంబ వ్యవస్థ ఇబ్బందులకు గురయ్యే ప్రమాదం ఏర్పడింది.

అన్ని కూటములు అందరికీ కుదరకపోయినా ముఖ్యమైన మనస్తత్వం ఐక్యత ఉంటే వారిద్దరి మధ్య అవగాహన పెరిగి ఆనందించే అవకాశం ఉంటుంది. పూర్వం బాల్యవివాహాలు కావడం వల్ల తమకు కలిగే ఇబ్బందులను పంచుకునే అవకాశాలు చిన్నవయస్సుల్లో ఉన్న వారికి లేకపోవడం వల్ల ఇటువంటి కూటములు ఎక్కువశాతం కలిస్తే బావుంటుందని చెప్పేవారు. ప్రస్తుతం కూడా అది మంచిదే కాని, ఒకవేళ అన్నీ కుదరక పోయినప్పటికీ వాటిస్థానాల్లో ఆధునిక కాలంలో ముఖ్యంగా జాతకంలో అష్టకవర్గురీత్యా లగ్న సప్తమ స్థానాల బిందువుల పరిశీలన, సంతాన స్థానాదుల పరిశీలన,

మొదలైనవి చూడాలి. అవి లోపించడం వల్ల ఇబ్బందులు ఎక్కువగా ప్రస్తుత సమాజంలో కనిపిస్తున్నాయి.

అన్యోన్యత్వం, ప్రేమ అనేది చంద్రరాశినుండి చూడవచ్చు. శరీరాదులు సుఖపడడానికి ఇరువురి లగ్న రాశి అధిపతుల మిత్రత్వాన్ని గమనించాలి. అదేవిధంగా ఇద్దరిమధ్య ఆత్మీయత అనేది తప్పని సరిగా చూడాల్సిన అంశం. ఆత్మీయత సూర్యుని నుండి ఏర్పడుతుంది. ఆత్మకారకుడు సూర్యుడు. ఇరువురి జాతకాలలోని రవిరాశుల అధిపతులు మిత్రులుగా ఉన్నప్పుడు ఈ ఆత్మీయత సాధ్యమవుతుంది. లేకుంటే ఆత్మీయత ఏర్పడదు. ఒకరి మనసులో భావాన్ని మరొకరు చెప్పకుండానే గ్రహించి ఒకరికి అనుకూలంగా మరొకరు మెలగడమే ఆత్మీయత. ఇది పంచిపెట్టేదే కాని మాటలతో చెప్పేది కాదు. అందువల్ల ఈ కాలంలో ఈ మేలాపకాలను అత్యధికంగా చూసి ఫలిత నిర్ణయాలను జాగ్రత్తగా చూడాల్సిన అవసరం గతంలో కన్నా ఎక్కువగా కనిపిస్తుంది. కేవలం రాశి అధిపతులనే కాక ఇరువురి జన్మలగ్న నక్షత్రాలకూ, ఇరువురి రవిస్థిత నక్షత్రాలకు మధ్యలో ఏర్పడే ఈ మైత్రి, కూటముల విస్తరణ వారి భవిష్య జీవనాన్ని ఆనంద సాగరానికి చేర్చుతుంది.

## కుజదోషం : వివాహవ్యవస్థలో దాని పరిశీలన

-ఈ కాలంలో కేవలం కుజదోషం అనే పేరుతో ఎన్నో జాతకాలను వ్యతిరేకిస్తున్న వారున్నారు. అయితే కుజదోషాన్ని గుర్తించడం, దానివల్ల కలిగే ఇబ్బందులను ఒకసారి గమనించే ప్రయత్నం చేద్దాం.

**కుజదోషం ఏర్పడే విధానం :** జాతకంలో లగ్నం నుండి గాని, చంద్రుని నుండి గాని, శుక్రుని నుండి గాని (1) 2, 4, 7, 8, 12 స్థానాల్లో కుజుడు ఉంటే కుజదోషంగా చెప్పబడుతుంది. మూడు గ్రహాల నుండి దాదాపు 18

స్థానాలలో కుజుడుంటే ఈ దోషం ఏర్పడే అవకాశం ఉంటుంది. ఈ కుజదోషం స్త్రీలకు ఉంటే భర్తను కోల్పోతారని, పురుషులకుంటే వారి భార్యను కోల్పోతారని చెప్పడం జరిగింది.

పురుషులకు ద్వితీయ, సప్తమ స్థానాల్లో ఉన్న కుజుడు, స్త్రీలకు చతుర్థ, అష్టమ స్థానాల్లో ఉన్న కుజుడు, ఇద్దరికీ అష్టమస్థానంలో ఉన్న కుజుడు అధికంగా ఇబ్బందులను కలిగిస్తాడని చెప్పబడింది.

**కుజదోషం - పరిహారం :** దోషం ఏర్పడడానికి ఎంత అవకాశం ఉంటుందో దోష పరిహారానికీ అంతే అవకాశం ఉంది. అవి -

1. సింహ, కర్కాటక రాశులవారికి కుజదోషం లేదు.

2. కుజునికి స్వక్షేత్రాలైన మేష, వృశ్చికరాశుల్లో జన్మించినవారికి, ఉచ్చ స్థానమైన మకరరాశిలో జన్మించిన వారికి, మిత్రులైన గురు, రవుల రాశులగు ధనుస్సు, మీన, సింహరాశుల్లో జన్మించినవారికి కుజదోషం లేదు.

3. వృషభం కాని సింహం కాని లగ్నమై లగ్నాత్తు ద్వితీయ(2) స్థానంలో అంటే మిథునరాశిలోగాని, కన్యారాశిలోగాని కుజుడుంటే దోషం లేదు.

4. మకరంగాని సింహంగాని లగ్నమై లగ్నాత్తు చతుర్థ (4) స్థానంలో అంటే మేషరాశిలోగాని, వృశ్చికరాశిలోగాని కుజుడుంటే వారికి కుజదోషం ఉండదు.

5. మకర, కర్కాట రాశుల్లో జన్మించినవారికి సప్తమ (7) స్థానంలో కుజుడుంటే కుజదోషం లేదు.

6. సింహంగాని, వృషభంగాని లగ్నమై లగ్నాత్తు అష్టమ (8) స్థానంలో అంటే మీనం రాశిలోగాని, ధనుస్సురాశిలోగాని కుజుడుంటే కుజదోషం లేదు.

7. కుంభ, సింహ రాశి జాతకులకు కుజదోషం గూర్చి ఆలోచించాల్సిన అవసరం లేదు.

8. అశ్విని, మృగశీర్ష, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, ఉత్తర, స్వాతి, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాల్లో పుట్టినవారికి కుజదోషం లేదు.

9. కుజుడు గురువుతో కలిసి ఉన్నా, గురుదృష్టి కుజునిపైనున్నా ఆ జాతకులకు కుజదోషం లేదు.

10. సప్తమంలో పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు, శుక్రులలో ఎవరైనా ఉన్నా లేక వీరి దృష్టి సప్తమస్థానంపై పడినా దోషరహితం.

11. సప్తమస్థానాధిపతితో పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు లేక శుక్రులలో ఎవరైనా కలిసి ఉన్నా దోషరహితం.

12. సప్తమస్థానాధిపతి పూర్ణచంద్ర, బుధ, గురు లేక శుక్రుల దృష్టి కలిగి ఉన్నా దోషరహితం.

13. 10వ స్థానంలో శుభగ్రహం ఉంటే కుజదోష ప్రభావం ఉండదు.

14. కుజుడు కేంద్రకోణాల్లో ఉన్నా దోషం ఉండదు.

ఈ దోషాలను, పరిహారాలను ఇన్నింటినీ గమనిస్తే వీటన్నింటిలోనూ పాక్షిక సత్యాలే తప్ప పూర్ణ సత్యాలు లేవని అర్థమవుతున్నది.

ఇక్కడ ప్రధానంగా చర్చించాల్సిన అంశమేమిటంటే అసలు ఈ దోషం వల్ల కలిగే ఇబ్బందుల గూర్చి. కుజుడు లగ్నంలో / రాశిలో ఉంటే ఉద్వేగాన్ని అధికంగా ఇస్తాడు. ద్వితీయంలో ఉంటే కుటుంబంపై దుష్ప్రభావాన్ని కలిగిస్తాడు. 4వ స్థానం సౌఖ్య స్థానం కావడం వల్ల సుఖాన్ని అధికంగా కోరుకుని పొందలేక ఇబ్బందులకు గురికావడం జరుగుతుంది. సప్తమంలో ఉంటే కళత్రంపై దాని ప్రభావాలను కలిగించడం వల్ల కష్టాలకు శ్రీకారం చుట్టినవారవుతారు. అష్టమంలో ఉంటే ఆకస్మికమైన నష్టాలకు గురవుతారు. 12వ స్థానంలో ఉంటే శయ్యాసౌఖ్యాన్ని, నిద్రను కోల్పోతారు.

పై అంశాలన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తే కుజదోషం వ్యక్తిలో నిగూఢంగా ఉండే కాముకాది అంశాలకు సంబంధించినదిగా కనిపిస్తుంది. కుజదోషం ఉన్న పురుషునికి, కుజదోషం ఉన్న స్త్రీతో వివాహం చేయడం ఒకరకంగా ఒకేగణం వారికి వివాహం చేయడం వంటిదే. దోషం ఇద్దరికీ ఉంటే పరిహార మవుతుంది అనే భావం ఇద్దరిలోనూ ఉండే తీవ్ర స్వభావాలు, వ్యక్తిగత జీవితంలో, సాంసారిక అనుబంధంలో వారు తృప్తిపడడానికి అవకాశాన్నిస్తాయి. అదే ఒకరికి దోషం ఉండి మరొకరికి లేకపోవడం వల్ల వ్యక్తి సౌఖ్యహీనుడై, కుటుంబలోపాలతో ఇబ్బందులకు గురి అవుతుంటాడు. అవగాహనను కోల్పోవడం వల్ల నిద్ర లేక నిరాశకు గురవుతాడు. అందువల్ల కుజదోషం ఉన్నవారు కుజదోషం ఉన్నవారిని వివాహం చేసుకోమని సూచించడం జరిగి ఉండవచ్చు.

అయితే ఈ సూత్రాలన్నీ ఏర్పరిచిన కాలాన్ని మనం గమనిస్తే బాల్య వివాహాల కాలం. రజస్వలకు పూర్వమే వివాహమై, వ్యక్తిగత జీవితంపై ఆలోచన గాని, సాంసారిక జీవనాన్ని గూర్చిగాని తెలియని వ్యక్తుల మధ్యలో జరిగే వివాహాల సమయంలో ఈ సూత్రాలకు కొంత అర్థం ఏర్పడుతుండవచ్చు. ఆ సమయాలలో వారి ప్రాథమికమైన కలయికలలో అవగాహనా రాహిత్యమైన కలయికల వల్ల వ్యక్తిగత ఆనందం పొందడంలోని లోపాన్ని చెప్పుకోలేక నిస్సారంగా జీవితం మొత్తం వెళ్ళదీయడం ఒకరకంగా మారకమే. మరణం అని సూత్రాలలో ఇవ్వడమంటే కేవలం ప్రాణం పోవడమనే అర్థం మాత్రమే తీసుకోనవసరం లేదు. వ్యక్తికి ఏ వయస్సుల్లో ఏం కావాలో అది పరిపూర్ణంగా, ఆనందంగా పొందలేక పోవడం, తన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేని జీవనాన్ని అనుభవించవలసిరావడం కూడా మారకమే.

బాలారిష్ట దోషంలాంటి దోషంగా కుజదోషాన్ని గుర్తించడమే మంచిది. ఆ యా సమయాలలో వారు వారి భావాలు వ్యక్తీకరించుకోలేక సంసార జీవితంలో పాల్గొనవలసి రావడం వల్ల కలిగే మానసిక క్షోభనే దోషంగా పరిగణించవచ్చు.

ప్రస్తుత కాలంలో వివాహం పరిణతమైన వయస్సుల్లో, శరీరం పరిపూర్ణంగా ఎదిగిన తర్వాత, వివాహజీవన విషయంలో అవగాహనను ఏర్పరచుకున్న వారి మధ్యనే జరగడం వల్ల ఈ దోషానికి అంత ప్రాధాన్యం లేదు. ఇది అన్ని కూటముల లాగే మరో కూటమిగా భావిస్తే చాలు. అంతేగాని ప్రత్యేకంగా కుజదోషం అని భయపెట్టడం గాని, కుజదోషం ఉండడం వల్ల వివాహానికి ఇబ్బంది అనిగాని ఆలోచించాల్సిన అవసరం లేదు. ఏవో పరిహారాలు చేసినంత మాత్రాన అంతర్గతంగా ఉండే గ్రహప్రేరితమైన భావాలను తీసిపారవేయడం అంత సులభం కాదు. దానికి సమాజజీవనం, సంస్కారం, ఎదుటివారి అభిప్రాయాన్ని గౌరవించడం వంటి పనులు తెలిసి ఉండాలి. ఇది ఉంటే ఇతరదోషాలనుండి ఎప్పటికీ విముక్తి పొందగలిగి ఆనందాన్నే పొందుతాడు.

కాబట్టి కుజదోషం అంటూ ప్రస్తుతం జాతకాలను వ్యతిరేకించడం అవసరంలేదు. నియమబద్ధమైన జీవితాన్ని కలిసి పంచుకునే ఏర్పాటు చేసుకుంటే అవగాహన ఏర్పరచుకుంటే ఈ దోషాలు ఏవీ ఇబ్బందిని కలిగించేవి కావు.

## వివాహానికి దోషనక్షత్రాలు - అవగాహన

ప్రస్తుత సమాజంలో కొన్ని నక్షత్రాలలో పుట్టినవారిని వివాహం చేసుకోకూడదనే భావాలు ప్రచారం అవుతున్నాయి. ఈ భావన పూర్వం ఉన్నదేమీ కాదు. బాలారిష్ట దోషాలలో కొన్ని నక్షత్రాలు మాత్రమే ప్రస్తుతం వివాహానికి

పనికిరాని నక్షత్రాలుగా గుర్తిస్తున్నారు. ముఖ్యంగా మూల, ఆశ్లేష, జ్యేష్ఠ మొదలైన నక్షత్రాలలో పుట్టినవారి విషయంలో కొందరు ఈ అభిప్రాయాలను అధికంగా వ్యక్తీకరిస్తూ మూఢంగా ప్రవర్తిస్తున్నారు.

బాలారిష్టదోషాలు ఉండేవి కేవలం 12 సంవత్సరాలే అని గ్రంథ ప్రమాణాలున్నాయి. అయితే పూర్వం ఈ లోపలే వివాహాలు జరగడం వల్ల ఆయా నక్షత్ర సంబంధమైన దోషాలు వివాహదోషాలుగా పరిగణించి ఉండవచ్చు. కాని ఇప్పుడు ఆయా వ్యక్తులు వివాహం చేసుకుంటున్న వయస్సులను, మారిన సమాజాన్ని, కాలాన్ని పరిగణనలోకి తీసుకుంటే ఈ సూత్రాలు అసలు ఆచరించాల్సిన అవసరమే లేదు. అంతేగాక ఈ నక్షత్రాలలో పుట్టి వివాహం చేసుకున్న తర్వాత ఆయా ఇండ్లలోని పెద్దలు ఆప్తతతో, ఆనందంగా బ్రతుకుతున్న వారి సంఖ్య కోకొల్లలు. తెలియకుండా ప్రతి విషయాన్ని మూఢంగా ప్రచారం చేయడం గాని, దానిని విని అదేవిధంగా ఆచరించడంగాని రెండూ సమాజం దృష్టిలో తప్పే. దోషనక్షత్రాలనే భావనతో వివాహ సంబంధాలు కలుపుకోకుండా ఉండే ఆలోచనకు స్వస్తి చెప్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

## కాలసర్ప దోషం - అవగాహన

లగ్నం తప్ప మిగిలిన గ్రహాలన్నీ రాహుకేతువుల మధ్యలో ఉంటే దానిని కాలసర్పదోషం లేదా కాలసర్పయోగం అని అంటారు. కేతు, రాహువుల స్థానాలను బట్టి ఇవి అపసవ్య కాలసర్పదోషం, సవ్య కాలసర్పదోషం అని రెండు రకాలు. అయితే ఈ కాలసర్పదోషాన్ని దేశానికి సంబంధించిన దేశగోచార సంబంధమైన యోగాలలో పరిగణనలోకి తీసుకోవడం గతంలోని సంప్రదాయం. ప్రస్తుతకాలంలో వ్యక్తిగతమైన జాతకాలలో దానిని గమనించడం ద్వారా జాతకులకు ఇబ్బందిని కలిగించే రీతిలో పరిహారక ప్రక్రియలను తెలుపుతూ దోషశాంతులు చేస్తున్నారు.

నిజానికి కాలసర్ప దోష సమయంలో కొన్ని లక్షలు లేదా కోట్ల మంది పుట్టే అవకాశం ఉంటుంది. ఆ సమయంలో పుట్టినవారందరి జీవితాలలోనూ ఈ కాలసర్పదోషం వల్ల వారికందరికీ ఈ దోషాన్ని ఆపాదింపజేయడం ద్వారా సమాజానికి మంచి చూపాల్సిన జ్యోతిషం, వక్రమార్గాన్ని చూపిస్తూ అనవసరమైన ఇబ్బందులకు గురి చేస్తుందనడం స్పష్టం. దేశగోచార సందర్భంలో ఆ యా రాహుకేతువులున్న భావాలకు సంబంధించిన దేశాలు, లగ్నానికి సంబంధించిన దేశాలు ఆ స్థలాలలో జరుగబోయే అంతర్గత, భౌతికపరమైన ఇబ్బందులను తెలియజేయడానికి ఈ దోషాలున్నాయి. కాబట్టి ఆ విశేషాలను దేశానికి సంబంధించినవిగా పరిగణించడమే మంచిది.

ఆధునికంగా పరిశీలన చేస్తున్న సందర్భంలో ఈ గ్రహాలు లగ్నం నుండి ఏ యే భావాలలో ఉన్నాయో పరిశీలించి ఫలితాలను తెలియజేసే మార్గం ఉంది. ఇది పూర్వం నుండి ఉన్న భావ వివరణలే అయినప్పటికీ పేర్లు వేరుగా పెట్టబడ్డాయి. రాహుకేతువుల మధ్యలో ఉన్న గ్రహాల స్థితిగతులను బట్టి ఈ యోగాలు ఎన్నో ఉన్నాయి. ప్రస్తుతం కేవలం వేరు వేరు భావాలలో రాహు కేతువులున్నప్పుడు వాటి ఫలితాలను, ఆ యా దోషాలకు సంబంధించిన పేర్లను తెలుసుకుందాం. రాహువు కేతువు పరస్పరం 7వ స్థానంలో మాత్రమే ఉంటాయనే విషయం అందరికీ తెలిసిన సత్యమే.

రాహుకేతువులు ఉండేస్థానం లగ్నం నుండి 1 – 7 స్థానాలలో ఉంటే అది అనంత కాలసర్పదోషం అవుతుంది. దానివల్ల దాంపత్య జీవితంలో సమస్యలు ఏర్పడతాయి.

1-7 అనంత – దాంపత్య జీవితంలో ఇబ్బందులు.

2-8 గుళిక – ఆర్థిక, వాక్, కుటుంబ సమస్యలు

3-9 వాసుకి –బంధువులతో బాధలు, అనవసర ప్రయాణాలు

4-10 శంఖపాల- భూ, గృహ, వాహనాల వల్ల సమస్యలు
5-11 పద్మ - సంతానం వల్ల, ఆందోళన వల్ల సమస్యలు
6-12 మహాపద్మ - ఆర్థిక, శారీరక ఇబ్బందులు, నిద్రలేమి
7-1 తక్షక - వ్యాపారంలో సమస్యలు, భార్య/భర్తతో విభేదాలు
8-2 కర్కటక - ఆకస్మిక ప్రమాదాలు, నష్టాలు
9-3 శంఖచూడ - పెద్దల వల్ల, పుణ్యలోపం వల్ల సమస్యలు
10-4 ఘటక -గౌరవం, హోదా, ఉద్యోగ సమస్యలు
11-5 విషక్త - వ్యాపార లాభ సమస్యలు
12-6 శేషనాగ - అధిక వ్యయం వల్ల ఇబ్బందులు.

ఈ విధమైన అంశాలను పరిశీలిస్తే ఈ రాహుకేతువులు వేరు వేరు స్థానాలలో ఉన్నప్పుడు ఆ యా భావాలకు సంబంధించిన లోపాలు మాత్రం ఏర్పడుతున్నాయి. వాటికి పరిహారం చేసుకోవడమే అవసరం. అంతేగాని అనవసరంగా దోషాన్ని ఆపాదించుకుని వివాహ జీవితాన్ని పాడు చేసుకోవడం గాని, వివాహాదులు కావనుకోవడం కాని అసంబద్ధం.

## పరిహారక ప్రక్రియలు (రెమిడీస్)

జ్యోతిషంలో పరిహారక ప్రక్రియలకు ప్రత్యేకమైన పరిశీలన ఉంది. వీటినే శాంతులు అంటారు. ఈ శాంతివిధానం లేకుండా ఎన్ని ఫలితాలు చెప్పినా వాటివల్ల కలిగే ప్రయోజనం అంతంత మాత్రమే. ఫలితమార్గంలో రెండు అంశాలు ప్రత్యేకంగా గమనించాల్సి ఉంటుంది. అవి శుభకాలం, అశుభకాలం. మంచిసమయాన్ని సద్వినియోగం చేసుకోవడం, ఇబ్బందికరమైన కాలంలో జాగ్రత్తలు తీసుకోవడం ఈ శాస్త్రం చెపుతున్న ముఖ్యమైన అంశం. ఈ జాగ్రత్తలు తీసుకునే విధానాన్నే జ్యోతిషం శాంతి పేరుతో విశదీకరించింది. శాంతి విధానం జ్యోతిషంలోని సంహితాంతర్గతభాగం. జ్యోతిషరీత్యా గ్ర

రాశులు, భావాల ద్వారా కలిగే దశాఫలితాలను విశ్లేషించడం వల్ల - ఏ భావం ఎంత కాలంవరకు బలహీనంగా ఉందో తెలుస్తుంది. అటువంటి సందర్భంలో ఆ గ్రహం, రాశి, భావానికి సంబంధించి ప్రత్యేకంగా శాంతి చేయించుకోవలసిన అవసరం ఉంటుంది. గ్రహాలు, రాశులు, భావాల ద్వారా మనకు కలిగే మంచి చెడులను కేవలం తెలుసుకోవడం ఒక విభాగమైతే, దోషాలను తగ్గించుకోవడానికి చేసే ప్రయత్నమే శాంతి విధానం. దోష పరిహారం కోసం చేసే ప్రక్రియలే పరిహార ప్రక్రియలు (రెమెడీస్).

ఆ యా గ్రహాలు దోషకారకాలు అన్నప్పుడు ఆ గ్రహాలకు దోషాన్ని ఆపాదించాల్సిన పని లేదు. కాని ఆ గ్రహం వల్ల శరీరం, మనస్సు ఏ రకంగా ప్రభావితమవుతుందో గమనించాలి. ఈ ప్రభావాన్ని గమనించాలంటే ప్రకృతి స్వభావం తెలిసి ఉండాలి. భూమిపైనున్న ప్రకృతి స్వభావంలో వచ్చే మార్పులకు గ్రహాలగతుల ప్రభావాలు, చంద్ర సూర్యుల ప్రభావాలు పరోక్షంగా కారణాలవుతున్నాయి. వైజ్ఞానికంగా చెప్పే ఈ మాటలు అందరికీ అర్థం కావడం కష్టం. అందుకే దోషాన్ని, గుణాన్ని కలిగించేవి గ్రహాలని చెపుతుంటారు. వేరు వేరు స్థానాలలో ఉన్న గ్రహాల దశలు శుభ, అశుభఫలితాలనిచ్చే సమయాలను గమనించాలి. ఉదాహరణకు అష్టమభావంలో చంద్రుడుంటే దోషం. ఇది ఆరోగ్యంపై ముఖ్యంగా మానసిక ఆరోగ్యంపై వ్యతిరేక ప్రభావాన్ని చూపిస్తుంది.

చంద్రుడు మనఃకారకుడు. అష్టమభావం ఆరోగ్యానికి ప్రతీక. అష్టమంలోకి చంద్రుడు వచ్చే సమయం, అక్కడ నుండి వెళ్ళిపోయే సమయాన్ని పంచాంగం ద్వారా జ్యోతిషం సూచన చేస్తుంది. ఆ సమయంలో ఆరోగ్యరీత్యా ఏవిధంగా జాగ్రత్తగా ఉండాలో సూచన చేసేదే శాంతి విధానం. ఆ సమయానికి శరీరానికి అనారోగ్యం కలుగుతుందనే భావన ఉంటే శరీరాన్ని రోగనిరోధక శక్తివంతంగా చేసుకోవడం. మనస్సుకు అనారోగ్యం కలిగే భావన ఉంటే

మనస్సును వ్యతిరేక ఆలోచనలనుండి తాత్కాలికంగానైనా మళ్ళించుకొని భగవంతుని ప్రార్థనలో, నలుగురికీ సేవలు చేయడంలో నిమగ్నమై మనసును నిగ్రహించుకోవడం వంటి చర్యలు చేపట్టే విధానమే శాంతి.

కేవలం ఆలయాలలో పూజలు జరపడం వల్ల, దోష ప్రభావిత వ్యక్తి ప్రత్యక్షప్రభావం పొందకుండా చేయించుకునే జపాదుల వల్ల కలిగే అనుకూలత తక్కువగానే ఉంటుంది. అంటే **ఇబ్బందిపడే వ్యక్తి తనంతట తాను శాంతిమార్గాన్ని పాటిస్తే మరింత శ్రేయస్కరమైన ఫలితాలనిస్తుంది. దాని కోసం ఆ వ్యక్తి తాను స్వయంగా జపాదులు చేసుకుంటూ ప్రశాంతతకోసం ప్రయత్నం చేయడం, ఔషధాలను స్వీకరించడం, దానాదులు చేయడం వంటి వానివల్ల శాంతి కలుగుతుంది.** తనకు దెబ్బ తాకినప్పుడు తాను మందు పెట్టుకోవాలి కాని, ప్రక్కవాళ్ళు మందు పెట్టుకుంటే శాంతి కలుగదు. నొప్పి తగ్గదు.. అందుకే ఎవరికి ఇబ్బంది ఉందో వారే ప్రత్యక్షంగా శాంతి విధానంలోని వేరు వేరు పద్ధతులు పాటించాలి. ఇది స్పష్టంగా ఒక వైద్య ప్రక్రియే.

శరీరానికి రోగం వచ్చినప్పుడు చేసుకోవలసినది శారీరకమైన శాంతి. ఇది ఎక్కువభాగం ఔషధాలవల్ల, యోగ మొదలైన ప్రకృతిచికిత్సల వల్ల చేకూరుతుంది. ఏ ఇబ్బందికి ఎటువంటి మందును వేసుకోవాలో, ఎటువంటి శరీరవ్యాయామం చేయాలో, ఎటువంటి ఆసనాలు వేయాలో ముందుగా తెలుసుకొని పాటిస్తూ ఉండడం వల్ల ఆ ఇబ్బంది శరీరానికి రాకుండా ఉండటం, రానివ్వకుండా ప్రయత్నించడం జరుగుతుంది.

మానసికమైన ఇబ్బందులను తొలగించుకోవడానికి, మనస్సుపై పడే దుష్ట ప్రభావాలను తగ్గించుకోవడానికి చేసే ప్రయత్నమే మానసిక శాంతిప్రక్రియ. నిరంతరం చేసుకునే జపాదులు, ఎదుటివారికి మంచి జరగాలనే తత్త్వం పెంచుకోవడం వంటివి ఈ మానసిక ఇబ్బందులనుండి దూరం చేస్తాయి.

సక్రమమైన ఆహారాన్ని కాలానుగుణంగా, దేహానుగుణంగా, ప్రాంతానుగుణంగా తీసుకోవడం ద్వారా అన్నమయకోశానికి, ప్రాణాయామం ద్వారా ప్రాణమయ కోశానికి, ధ్యానం ద్వారా మనోమయకోశానికి, ప్రకృతివిజ్ఞానం, నూతనాంశాల పరిశీలనలు చేయడం ద్వారా విజ్ఞానమయకోశానికి శాంతి కలుగుతుంది. ఇవన్నీ జీవితంలో సరియైనవిధంగా ఆచరిస్తే ఆనందం కలుగుతుంది. ఆనందమయకోశం పరిపూర్ణమవుతుంది.

**ప్రకృతినుండి కలిగే వ్యతిరేకమైన ప్రభావాన్ని గ్రహీత అనుకూలంగా మార్చుకోవడమే శాంతి.** దశలపరంగా కాని, గోచారపరంగా కాని ఈ వ్యతిరేకత ఏర్పడవచ్చు. అనుకూలంగా మార్చుకునే ఈవిధానాలు మాత్రం కోకొల్లలుగా ఉన్నాయి. వాటిలో ఆ యా ప్రాంతాలను, వయస్సులను, ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొని శాంతిమార్గాలు సూచించాల్సి ఉంటుంది. అనుసరించాల్సి ఉంటుంది.

కర్మసిద్ధాంతం ప్రకారం కూడా పూర్వకర్మకృతాదులు వ్యాధిరూపంలో ఇబ్బందిని కలిగిస్తాయని, అవి రాకుండా నివారించుకోవాలంటే ఔషధాలను స్వీకరించడం, దానాదులు చేయడం, జపాలు, హోమాలు నిర్వర్తించడం వంటి ప్రక్రియలు చేయాలి. ఈ సమయాలను సరియైన విధంగా తెలుసుకొనే విధానం జ్యోతిషం సూచిస్తుంది. ఏ సమయంలో ఎటువంటి పనులు చేయడం ద్వారా వ్యక్తి మానసిక, శారీరక, సామాజికపరమైన ఇబ్బందులనుండి దూరమై ప్రకృతికి, సమాజానికి అనుగుణంగా తనను తీర్చిదిద్దుకునే అవకాశం ఉంటుందో శాంతిప్రక్రియలు తెలియజేస్తాయి.

శాంతి ప్రక్రియల్లోనూ వైజ్ఞానిక ధోరణులు వివరించే విధానం ఈ విధంగా ఉంటుంది. ఉదాహరణకు గోచారరీత్యా ఏలినాటి శని కాని, దశారీత్యా శని దశాంతర్దశలు కాని జరుగుతున్నప్పుడు శరీరంలో కొంత మందత్వం

ఏర్పడుతుంది. శరీరంలో ఏర్పడే ఈ మందత్వం వల్ల సాధారణంగా బద్ధకం బాగా కలుగుతుంటుంది. శరీరాంతర్గతంగా మలబద్ధకం కూడా ఇటువంటిదే. దీనివల్ల అనేక రకాల రోగాలకు వ్యక్తి గురవుతుంటాడు. శని వాతతత్వ గ్రహం కావడం వల్ల శరీరమంతా వాయువు లాంటి పొర చేరి కీళ్ళనొప్పులకు, గ్యాస్‌ట్రబుల్స్‌కు కారణమవుతుంది. శరీరంలోనూ మనస్సులోనూ ఏర్పడే ఈ బద్ధకంవల్ల వ్యక్తి అన్ని కార్యక్రమాలను సరియైన సమయంలో చేయలేక క్రమక్రమంగా ఆయా కార్యక్రమాలను, వ్యాపార లావాదేవీల విషయాలను వదిలివేస్తుంటారు. క్రమపరిణతిలో ఈ భావనలు ఇలాగే పెరుగుతుంటే ఆ వ్యక్తి వ్యాపారస్థుడైతే తన వ్యాపారంలో నష్టాలను తీసుకొస్తుంది. కార్యక్రమాలేవీ సరియైన సమయంలో నిర్వర్తించలేకపోతారు. అన్నివిధాల ఇబ్బందులకు గురయ్యే భావన కలుగుతుంది. ఇన్నింటికీ కారణంగా శని గ్రహాన్ని చూపిస్తుంటారు జ్యోతిష్కులు. అయితే ఈ విషయం స్పష్టంగా తెలుసుకుంటే శని గ్రహదోషం వల్ల కలిగే బద్ధకాన్ని వదిలించుకునే మార్గం మనం వెతుక్కోవాలి. ఈ వెతుక్కునే మార్గంలో చేయాల్సిన శ్రమ పూర్తిగా వ్యక్తిదే.

శని బద్ధకాన్నిచ్చేవాడు కావడం వల్ల సరియైన సమయానికి హార్మోన్ల విడుదల కూడా ఉండదు. ఈ ప్రక్రియలో మందత్వం ఏర్పడడం అనేది ముఖ్యపాత్ర వహిస్తుంది. కాబట్టి శరీరానికి వేడినిచ్చే విధంగా నువ్వులనూనెతో వంటికి మర్దన చేస్తూ ఉండడం వల్ల శరీరం తేలిక అవుతుంది. దానివల్ల లోపలి శరీరాంగాలకు ఒక ప్రేరణ కలుగుతుంది. కొంత ఇబ్బంది తొలగిపోతుంది. అన్నమయకోశానికి సంబంధించి ఆహారంలో మొదటి ముద్దగా నువ్వుల పొడిని వాడటం వంటి వాని వల్ల శరీరం తేలిక అవుతుంది. తప్పనిసరిగా ప్రాణాయామాన్ని చేస్తూ ఉండడం వల్ల ఊపిరితిత్తులు, మెదడు, గుండె, రక్తప్రసరణ వ్యవస్థ శుద్ధమై వ్యక్తిలో చైతన్యం పెరుగుతుంది. బద్ధకపు భావన తొలగి సాధారణ జీవితం గడపగలిగే అవకాశం కలుగుతుంది. అందుకే

శరీరానికి నువ్వులనూనెతో మర్దన చేసుకోవడం, నువ్వులపొడి ఆహారంలో వాడడం, ప్రాణాయామం చేయడం అనేవి సాధారణమైన ప్రక్రియలుగా శనిదశ, ఏలినాటి శనిదోషాదులు కలిగినప్పుడు చేసుకోవడం మంచిది. అష్టమశని దోషం ఉన్నప్పుడు చేసుకునే ఈ శాంతి ప్రక్రియలు, అర్ధాష్టమశనిలో సగం చేసుకోవాలని మాత్రం కాదు. దోషం దోషమే. శాంతి అన్ని వేళల్లోనూ పూర్తిగా నిర్వర్తించవలసిందే.

పై ప్రక్రియలు బాహ్య అంతఃశరీరాలను శుద్ధి చేయగలవు కాని, మానసికమైన భావాన్ని శుద్ధి చేయలేవు. దానికోసం శని గ్రహానికి నిర్దేశించబడిన స్తోత్రాదులను జపం చేస్తూండడం, భగవత్ ధ్యానం, అధిదైవపూజ, అభిషేకాదులు చేసుకోవాలి. మరింత తృప్తిని కలిగించడానికి గృహ వాతావరణంలో శుద్ధిని చేసుకోవడానికి హోమాదులు కూడా జరిపించు కోవచ్చు. ఈ విధంగా ఒక శాంతివిధానం వెనుక శారీరక, మానసికమైన వైద్యప్రక్రియ ఇమిడి ఉంటుంది. ఏ సమయంలో ఎటువంటి వైద్యప్రక్రియ మనకు మంచిని కలిగిస్తుందో జ్యోతిష్కుని సూచనను అనుసరిస్తే మనకు తెలుస్తుంది. అందుకే శాంతి ప్రక్రియలు జ్యోతిషంలో అంతర్భాగంగా మారి ఒక ప్రత్యేకమైన శాఖగా ఆవిర్భవించాయి. అన్ని గ్రహాలకు, అన్ని రకాల ఇబ్బందులకు వేరు వేరు రకాలైన నివారక మార్గాలను ఎన్నో ఈ విధంగా చెప్పుకోవచ్చు.

ఈవిధంగా గ్రహదోషాలంటే గ్రహాలు చెడ్డవనీ, పీడాకారులనీ కాదు. గ్రహాలు తమ వాతావరణానికి అనుగుణంగా విభిన్న కాంతులను భూమిపై ప్రసరిస్తాయి. గ్రహ సంబంధమైన కాంతులు శరీరంపై సరిగా లేకపోవడం వల్ల ఆ శరీరంలో ఆయా కాంతులకు సంబంధించిన ధాతువుల వృద్ధి ఆగిపోతుంది. వివిధ శక్తి కేంద్రాలనుండి హార్మోన్ల విడుదల, శక్తి ప్రవాహం తగ్గుతుంది. ఈ శక్తిని తిరిగి తెచ్చుకునే ప్రక్రియే శాంతిప్రక్రియ.

ఈ శాంతి ఒకరకంగా వైద్య ప్రక్రియ. హోమ, జప, రత్నధారణ, దానాదులు ఆధునిక కాలంలో హోమథెరపీ, మంత్రథెరపీ, జెమ్‌థెరపీ అంటూ వేరు వేరు పేర్లతో పిలుస్తున్నారు. ఇంకా సంగీత సంబంధమైన వైద్యం, నక్షత్ర గ్రహానుకూలమైన చెట్లను పెంచడం ద్వారా వైద్యం వంటి అనేకానేక ప్రాకృతిక వైద్యాలు శాంతి సంబంధమైనవిగా పరిగణిస్తున్నారు. ఈవిధానాలకు నేడు అధికమైన ఆదరణ కూడా ఉంది.

ఒక గ్రహం శరీరంలోని ఒక తత్వానికి ప్రతీకగా భావించి ఆ గ్రహం ద్వారా కలిగే మంచి చెడులకు ఆ గ్రహసంబంధమైన పరిహారకప్రక్రియలను జ్యోతిష్కుడు సూచించవలసిన అవసరం ఉంది.

బుధుడు బలహీనమైతే నర్వస్ సిస్టమ్ ఇబ్బందులకు గురవుతుంది. దానివల్ల శరీరంలో నాడీ వ్యవస్థద్వారా ఒక భాగం నుండి మరోభాగానికి అందే సమాచారం లోపిస్తుంది, స్ఫురణశక్తి, జ్ఞాపకశక్తి లోపిస్తుంటుంది. ఆలోచనలు బలహీనంగా ఉండి అన్ని వ్యాధులు తమకే ఉన్న భావన కలుగుతుంది. ఇటువంటి వారికి బుధ గ్రహ ప్రభావితమైన మెలకెత్తుతున్న పెసలు (గ్రీన్‌గ్రామ్) ధాన్యాన్ని ఉదయమే కొన్ని తీసుకునే ఏర్పాటు చేయాలి. రత్నాలలో చిటికెన వ్రేలుకు ఆకుపచ్చ పెట్టుకునే ప్రయత్నం చేయాలి. విష్ణువు బుధగ్రహానికి అధిదైవం కావడం వల్ల విష్ణువుకు సంబంధించిన పూజ చేయాలి. విష్ణుసహస్రనామం వినడం, పారాయణం చేయడం కూడా ఉత్తమమే. స్ఫురణశక్తి కోసం హయగ్రీవ స్తోత్రం పారాయణం లేదా హయగ్రీవ నామ స్మరణ చేయడం వల్ల బుధగ్రహ సంబంధమైన దోషాలు తొలగుతాయి.

శరీరంలో వేరు వేరు భాగాలకు వేరు వేరు గ్రహాలు ప్రతీకలుగా నిర్ణయించి ఆ యా శరీరాంతరభాగాల సముద్ధరణకు పరిహార ప్రక్రియలను సూచిస్తే శరీరం, మనసు ఆనందప్రదమవుతాయి. వాటిలో కొన్నింటిని గూర్చి ఇక్కడ పరిచయం చేసుకుందాం.

## గ్రహాలు - పూజలు చేయాల్సిన అధిదైవాలు

రవి – సూర్యనారాయణుడు

చంద్రుడు – లలిత, గౌరి (శక్తిలో సౌమ్య రూపాలు)

కుజ – సుబ్రహ్మణ్య / నరసింహస్వామి

బుధ – విష్ణు, కృష్ణ, నారాయణ

గురు – దత్తాత్రేయ, గురు సంబంధమైన సాయిబాబా, రాఘవేంద్రాదులు

శుక్ర – లక్ష్మీదేవి, ఇంద్రాణి

శని – విష్ణు / రుద్రుడు

రాహువు – దుర్గాదేవి

కేతువు – విఘ్నేశ్వరుడు.

గ్రహదోషాలలో గ్రహజపంతో పాటు పైన సూచించిన దేవతల స్తోత్రాదులు, శ్లోకాదులు జపం చేయడం ద్వారా దోషనివారణ జరుగుతుంది. అదేవిధంగా ఈ గ్రహజపాలు చేసుకునే సందర్భాల్లో ఆ యా దేవతల ఆలయాలలోకి వెళ్ళి ప్రదక్షిణలు చేస్తూ ఈ జపాలు చేయడం వల్ల మరింత బలం చేకూరుతుంది. పైన సూచించిన దేవతలకు ఆ యా గ్రహాలకు సంబంధించిన వారాల్లో ప్రత్యేక పూజలు నిర్వహిస్తూ ఉండడం కూడా దోష నివారణకు మార్గమవతుంది. ఆ శ్లోకాలు ఈ విధంగా ఉంటాయి.

## గ్రహాలు - అధిదైవ ధ్యాన శ్లోకాలు

రవి : ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తి
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపుః ధృతశంఖ చక్రః

చంద్ర : సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే

**కుజ** :గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం జ్ఞానశక్తిం కుమారం
బ్రహ్మణ్యం స్కందదేవం గుహమమలగుణం రుద్రతేజస్స్వరూపం
సేనాన్యం తారకఘ్నం గురుమచలమతిం కార్తికేయం షడాస్యం
సుబ్రహ్మణ్యం మయూరధ్వజరథ సహితం దేవదేవం నమామి.

**బుధుడు :** విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనం
హరిం నరహరిం రామం గోవిందం దధి వామనం

**గురుడు :** నమస్తే భగవన్ దేవ దత్తాత్రేయ జగత్ప్రభో
సర్వబాధా ప్రశమనం కురు శాంతిం ప్రయచ్ఛమే
దత్తాత్రేయం గురుం వందే భవబంధ వినాశనం
సర్వరోగ హరం దేవం భుక్తిముక్తి ఫలప్రదం

శుక్ర : ప్రజ్ఞామాయుర్బలం విత్తం ప్రజామారోగ్య మీశతాం
యశః పుణ్యం సుఖం మోక్షమిందిరేష్టం ప్రయచ్ఛతు

**శని :** గాధిశ్చ కౌశికశ్చైవ పిప్పలాదో మహామునిః
కోణస్థః పింగళో బభ్రుః కృష్ణో రౌద్రోంతకో యమః
సౌరిః శనైశ్చరో మందః పిప్పలాదేన సంస్తుతః
ఏతాని దశనామాని ప్రాతరుత్థాయ యః పఠేత్
శనైశ్చర కృతా పీడా న కదాచిద్భవిష్యతి
సూర్యపుత్రో దీర్ఘదేహః విశాలాక్షః శివప్రియః
మందచారః ప్రసన్నాత్మా పీడాం హరతుమే శనిః

తాండవం సహజం యస్య పరమాణు స్వరూపిణః
దివ్యరూపం శివం శాంతం వందే శంభుముమాపతిం

**రాహు :** దుర్గేస్మృతా హరసి భీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి
దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా

**కేతువు :** ధూమ్రవర్ణం ద్విబాహుంచ కేతుంచ వికృతాననం
గృధ్రాసనగతం నిత్యం ధ్యాయేత్సర్వ ఫలాప్తయే
శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే.

గ్రహాలు సరియైన ఫలితాలను ఇవ్వనప్పుడు ఇతరులతో జపాదులు చేయించుకోవడం కూడా పరిపాటి. తాము స్పష్టమైన జపాలను శ్లోకరూపంలోగాని, దేవాలయ ప్రదక్షిణలు, పూజల రూపంలోగాని ప్రయత్నాలు చేస్తూ ఇతరుల సహకారాన్ని (సపోర్ట్) మాత్రం తీసుకోవడానికి చేసే ప్రయత్నమే ఇతరులతో జపాదులు చేయించుకోవడం. తామేమీ ప్రయత్నం చేయకుండా కేవలం ఇతరులపై ఆధారపడడం వల్ల ప్రయోజనం ఉండదు. మంత్రాలు, బీజాక్షరాలతో కూడుకున్న ఈ జపాదులు ఇతరులు చేస్తున్నప్పుడు మాత్రం దానికి సంఖ్యానియమం పాటించడం శ్రేష్ఠం. పూర్వకాలంలో దశానుకూలంగా వేరు వేరు గ్రహాలకు సంవత్సరానికి 1000 సంఖ్య జపం చేసుకోవాలని భావించేవారు. కానీ కలియుగంలో ఫలితం తక్కువౌతున్న రోజుల్లో పూర్వ నిర్ణయ జపసంఖ్యకు నాలుగింతలు జపం చేయాలని ప్రస్తుత నిర్ణయం. దాని ద్వారా సత్ఫలితాలు వస్తున్నాయి. అందుకే వ్యక్తి శ్లోకరూపంలో నైనా తనంతట తాను నిరంతరం నడుస్తున్న దశాంతర్దశలకు, దోషాలున్న గ్రహాలకు సంబంధించిన అధిదైవ శ్లోకాలను నిత్యం జపం చేసుకోవడం అవసరం. ఈ క్రమంలో పూర్వం నుండి చెప్పబడుతున్న జపసంఖ్య మాత్రం ఇక్కడ తెలియజేస్తున్నాను. దీనికి నాలుగింతలు చేస్తే దోషశాతం తగ్గిపోతుంది.

| గ్రహం | జపసంఖ్య | దానం |
|---|---|---|
| రవి | 6 వేలు | గోధుమలు |
| చంద్ర | 10 వేలు | బియ్యం, వరిధాన్యం |
| కుజ | 7 వేలు | కందులు |
| బుధ | 17 వేలు | పెసలు |
| గురు | 16 వేలు | శనగలు |
| శుక్ర | 20 వేలు | బొబ్బర్లు / అలచందలు |
| శని | 19 వేలు | నువ్వులు |
| రాహు | 18 వేలు | మినుములు |
| కేతు | 7 వేలు | ఉలువలు. |

## శిశుజననం - దోషాలు - పరిహార ప్రక్రియలు

శిశువు జన్మించినపుడు పుట్టిన నక్షత్రం దోషమైనదా, గుణమైనదా అని తెలుసుకొని దోష నివారణకు వేరు వేరు ప్రయత్నాలు చేయడం పరిహారక ప్రక్రియలలో ప్రారంభకార్యం. పరిహార ప్రక్రియల అవసరం ఇక్కడినుండే మొదలవుతుంది. అసలు ఈ లోకంలోకి వ్యక్తమైన ఆ శిశువు నక్షత్ర సంబంధమైన దోషాలను తొలగించుకోవాలని, దైవానికి, పెద్దలకు నమస్కారం చేస్తూ ఎందరికో వేరు వేరు రూపాలలో దానాదులు నిర్వహించే ప్రక్రియే బాలసారె (బారసాల). కాలక్రమంలో దాని రూపంలో వేరు వేరు మార్పులు వచ్చాయి. దోషనక్షత్రాలు కొన్నింటికి మాత్రం ప్రత్యేక శాంతులు నిర్వహిస్తున్నాం. ఆ నక్షత్రాలలో కొన్ని ఉగ్రనక్షత్రాలు, కొన్ని గండాంత నక్షత్రాలు, కొన్నింటికి అధిదైవాలు సరియైనవి కాకపోవడం మొదలైన అంశాలు ప్రాతిపదికలుగా ఉన్నాయి. ఆ యా దోష నక్షత్రాలు - చేసుకోవలసిన శాంతివిధానాలు ఈ విధంగా ఉంటాయి.

**శాంతి నక్షత్రాలు :** అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, పుష్యమి, ఆశ్రేష, మఘ, ఉత్తర, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి.

**ఇతర దోషాలు :** తల్లిదండ్రుల లేదా సోదరీ సోదరుల జన్మనక్షత్రంలో శిశుజన్మమైనా, వర్జ్యం, దుర్ముహూర్తం, గ్రహణాదుల్లోకాని, అమావాస్యనాడు గాని, ప్రేగులు మెడకు చుట్టుకుని జన్మించినా, నక్షత్రజపం, నవగ్రహశాంతి, దానాలు, హోమశాంతి, రుద్రాభిషేకం, కుంకుమార్చనలు, సువర్ణదానాదులు వారి వారి స్థాయికి అనుగుణంగా, మనస్ఫూర్తిగా నిర్వహించాల్సి ఉంటుంది.

**బాలారిష్ట గ్రహాలు :** పై దోషాలే కాక పుట్టగానే వేసిన జాతకచక్రంలో వేరు వేరు గ్రహాలున్న స్థానాలను బట్టి బాలారిష్టాలు కలుగుతుంటాయి. ఆ అరిష్టాలను కలిగించే గ్రహాలకు శాంతులు చేయాల్సి ఉంటుంది. అవి :

| | | | |
|---|---|---|---|
| **చంద్రుడు** | - 8వ స్థానంలో | **కుజుడు** | - 7వ స్థానంలో |
| **రాహువు** | - 9వ స్థానంలో | **శని** | - 1వ స్థానంలో |
| **గురువు** | - 3వ స్థానంలో | **రవి** | - 5వ స్థానంలో |
| **శుక్ర** | - 6వ స్థానంలో | **బుధ** | - 4వ స్థానంలో |

**కేతువు** - 12వ స్థానంలోనూ ఉంటే జాతకుడు మరణిస్తాడని సంప్రదాయం. అయితే శుభగ్రహం యొక్క పరిపూర్ణ దృష్టి ఉన్నా, లగ్నం నుండి కేంద్రస్థానాలలో శుభగ్రహమేదైనా ఉన్నా ఆ లోపం తగ్గిపోయి శుభత్వం ఏర్పడుతుంది.

శిశుజననమైన తర్వాత దోషశాంతి నిర్వహించేటపుడు ఈ గ్రహాలను కూడా గమనించి ఆ గ్రహాలకు కూడా దోషనివారక శాంతులను చేయాల్సి ఉంటుంది. బాలారిష్టదోషాలకు గ్రహజపాదులు, నక్షత్ర దోషాలకు ఆ యా నక్షత్ర జపాలతో పాటు వేరు వేరు రూపాలలో శాంతులను నిర్వర్తించాలి. అవి : **1. ఆజ్యావేక్షణము :** పిల్లవాని ముఖ ప్రతిబింబాన్ని తండ్రి నూనెలో ముందుగా చూసిన తర్వాతనే అసలు రూపాన్ని చూడడం.

**2. రుద్రాభిషేకం :** శివునికి అభిషేకం వేరు వేరు రూపాలలో చేయడం.

**3. సూర్యనమస్కారాలు :** ఇవి మంత్రోక్తంగా అరుణమంత్రాలతో పారాయణం చేస్తూ చేయడం శ్రేష్ఠం. సాధారణంగా యజమాని సూర్యోదయ సమయంలో సూర్యునికి ఎదురుగా నిలుచుని నామ స్మరణచేస్తూ కూడా చేయవచ్చు. వాటి ద్వారా కూడా శరీరం, మనసులకు సరియైన చైతన్యం కలిగి ఆనందం సిద్ధిస్తుంది.

**4. మృత్యుంజయ జపం :** ఈ జపం నిరంతరం చేస్తూ ఉండడం వల్ల యజమానికి, శిశువుకు మరణము లేదా మరణ సదృశభావాలనుండి దూరమయ్యే అవకాశం ఉంటుంది.

**5. నక్షత్ర జపం :** నక్షత్ర దోష తీవ్రతను బట్టి 1000 నుండి 10000 వరకు ఈ నక్షత్ర జపం చేయాల్సి ఉంటుంది. జపసంఖ్య ఆధారంగా తర్పణం, హోమం, అన్నదానాదులు నిర్వర్తించాలి.

**6. నవగ్రహజపం :** ముఖ్యంగా బాలారిష్టాది దోషాలు తొలగడానికి ఈ నవగ్రహ జపం చేయించడం అవసరం. ఆ యా గ్రహాలను గుర్తించి వాటికి తగిన సంఖ్యలో జపం చేయించాలి.

**7. హోమం :** హోమం కూడా చక్కని వైద్యప్రక్రియే. ఇంట్లోకి చెడు గాలులు రాకుండా కాపాడుతుంటుంది హోమం. అందువల్ల ఆ యా గ్రహ దోషాలు తెలిసినప్పుడు ఆ గ్రహాలకై నిర్దేశించబడిన సమిధలు, ధాన్యం మొదలైన వన్నింటినీ ఆహుతి చేస్తూ ఆ వాయువు గృహవ్యాప్తం కావడం ద్వారా ఇతరమైన అనారోగ్య సమస్యలనుండి దూరం కావచ్చు.

అన్నదానాదులు నిర్వహించడం, వ్రతాదుల ద్వారా భగవత్పూజలు నిర్వహించడం, అందరినీ సంతృప్తులను చేయడం వంటి ప్రక్రియలు వ్యక్తికి, శిశువుకు, తల్లికి అందరికీ ఆనందాన్నిస్తుంటాయి.

అదేవిధంగా వేరు వేరు జీవిత కార్యకలాపాలైన అన్నప్రాసన, అక్షరాభ్యాస, విద్యాభ్యాసాది సమయాలలోనూ, పుట్టినరోజులలోనూ ఇటువంటి దానాదులు, పూజలు నిర్వహించడం వల్ల మేలు కలుగుతుంది. విద్యాభ్యాస సమయంలో విద్యనభ్యసించలేనివారికి ఆర్థికంగా సహకరించడం, పుట్టినరోజు పండుగలనాడు బీదలకు అన్నదానం, వస్త్రదానాదులు చేయడం, సేవా కార్యక్రమాలను పిల్లలకు జీవితంలో అలవాటు చేయించడం వంటి ధార్మిక ప్రక్రియలు దోషనివారణలకు హేతువులవుతుంటాయి.

## వివాహం - వైవాహికజీవన సమస్యలు - పరిహారప్రక్రియలు

జాతకాలలో దోషాలు ఏర్పడినప్పుడు, సరియైన సమయంలో ప్రయత్నం చేయక, భావం బలహీనమైనప్పుడు ప్రయత్నాలు ఫలించనప్పుడు, ఆలస్య వివాహాలు జరిగే అవకాశం ఏర్పడుతున్నప్పుడు వివాహ సిద్ధికై స్త్రీలు పురుషులు క్రింది శ్లోకాలు నిరంతరం జపం చేసుకోవడం మంచిది. దానివల్ల అనుకున్న సమయంలో కార్యక్రమం పూర్తి కావడమే కాక దానివల్ల ఆనందప్రదమైన జీవనం కూడా దొరుకుతుంది.

వివాహం సరియైన సమయంలో సిద్ధించాలంటే వివాహం కావలసిన వారు క్రింది శ్లోకాన్ని విధిగా రోజూ 3 గంటలు జపం చేయాలి.

**దేవీంద్రాణి నమస్తుభ్యం దేవేంద్ర ప్రియభాషిణి**
**వివాహం భాగ్యమారోగ్యం పుత్రలాభంచ దేహిమే**

ఈ శ్లోకం తమ పనులన్ని చేసుకుంటూ కూడా చేసుకోవచ్చు. అయితే ముఖ్యంగా సరియైన సమయంలో ఏ కార్యక్రమమైనా జరగట్లేదంటే పూర్వపుణ్య లోపంగా గుర్తించి ఇష్టదైవప్రార్థన, పూజలు, దేవాలయ సందర్శన, జపాదులు, దానాదులు చేస్తూ ఉండడం శ్రేష్ఠం. ఈ కార్యక్రమాల ద్వారా తాము కోరుకున్న

కార్యం అతి త్వరగా సఫలం అయ్యే అవకాశం ఉంటుంది. జపం చేస్తూ ఈ కార్యక్రమాలు నిర్వహించడం వల్ల సత్వర ఫలితాలు కలుగుతుంటాయి.

అదేవిధంగా వివాహం అయిన వారు కూడా గృహంలో ఇబ్బందులు ఎదుర్కొంటున్న వారు కోకొల్లలు. సాంసారిక సుఖం లేకపోవడం, భర్త లేదా భార్యతో ఆత్మీయత పెరగక పోవడం, అనురాగం ఉండక పోవడం, ఒకరి మనసును మరొకరు గమనించకుండా ఉండడం వల్ల అసంతృప్తి ఉండడం ఇటువంటి దోషాలు వైవాహిక జీవనంలో అధికమౌతున్నాయి. ఇవి పూర్వకాలంలో కొంత తక్కువైనా ప్రస్తుత కాలంలో అధికమవడమే కాక విడాకుల వరకు దారి తీస్తున్నాయి. ఇతర సంబంధాలు పెంచుకోవడానికి కూడా ఇవే హేతువులై ఇబ్బందులకు గురి చేస్తున్నాయి. ఇటువంటి లోపాలన్నీ నివారణ కావాలంటే క్రింది శ్లోకం నిరంతరం జపం చేసుకుంటూ ఉండడం మంచిది.

**శ్రీరామచంద్రః శ్రిత పారిజాతః**
**సమస్త కల్యాణ గుణాభిరామః**
**సీతాముఖాంభోరుహ చంచరీకః**
**నిరంతరం మంగళ మాతనోతు**

ఈ జపం చేసుకోవడం వల్ల అన్ని విషయాలలోనూ ఆనందమే పరమావధి అవుతుంది. అదేవిధంగా సాంసారిక సౌఖ్యాలకోసం –

**హరిస్త్వామారాధ్య ప్రణతజన సౌభాగ్య జననీ**
**పురానారీభూత్వా పురరిపు మపిక్షోభమనయత్**
**స్మరోపిత్వాం నత్వా రతినయన లేహ్యేన వపుషా**
**మునీనామప్యంతః ప్రభవతి హి మోహాయ మహతాం**

అనే శ్లోకాన్ని జపం చేస్తూ ఉండడం వల్ల మంచి ఫలితాలు కలుగుతాయి.

అదేవిధంగా అందరు భార్యాభర్తల మధ్య చక్కని అనురాగం ఉండాలని మనసులో భావించడం, శయ్యాదానాదులు అవసరమైన వారికి చేయడం వంటి ప్రక్రియలు కూడా ఈ రకమైన దోషాలను నివారించే మార్గాలే.

## సంతానం - సంతాన సమస్యలు - దోష నివారణలు

జీవితంలో అతి ప్రధానమైన అంశాలలో సంతానం ఒకటి. వివాహమైన చాలాకాలం వరకు సంతానం కలుగకపోవడం, గర్భపాతాలు కలుగడం వంటి ఇబ్బందులు ఏర్పడడం ప్రధానదోషాలు.

సంతానం కలుగడానికి కృష్ణ, విష్ణు సంబంధమైన పూజలు చేయడం, జపం చేసుకోవడం అవసరం. గర్భపాతం కలుగకుండా దుర్గా జపం చేయడం, రావిచెట్టుకు ప్రదక్షిణాదులు చేయడం ద్వారా శరీరం చుట్టూ ఉండే కాంతి కిరణ పుంజం (ఆరా) పెంచుకునే ప్రయత్నం మొదలైనవి చేయాలి. సత్సంతాన ప్రాప్తికి కృష్ణ సంబంధమైన ఈ శ్లోకం భార్యాభర్తలిరువురు జపం చేయడం మంచిది.

**దేవకీ సుత గోవింద వాసుదేవ జగత్పతే**
**దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః**

విష్ణుసహస్రనామం వినడం, పారాయణం చేసుకోవడం కూడా సంతానార్థులు నిత్యం చేయాల్సి ఉంటుంది. అదేవిధంగా గర్భపాతాలు కలుగకుండా –

**నమోదేవ్యై మహాదేవ్యై దుర్గాయై సతతం నమః**
**పుత్రసౌఖ్యం దేహి దేహి గర్భరక్షాం కురుష్వనః**

అనే శ్లోకం నిత్యం జపం చేసుకుంటూ ఉండాలి. ప్రతి గర్భవతి కూడా ఈ జపం చేయడం వల్ల గర్భరక్షణ జరుగుతుంటుంది.

ఇద్దరి జాతకాలలోనూ సంతాన సంబంధమైన పంచమభావంలో ప్రస్తుత కాలంలో ఇబ్బందులు లేకుండా, బలంగా ఉండి ఉంటేనే సంతానం తేలికగా కలుగుతుంది. ఆ విషయాన్ని ముందుగా జ్యోతిష్కులకు చూపించుకోవడం అవసరం. వారి సలహామేరకు సమయాసమయాలను తెలుసుకుని తగురీతిలో ప్రవర్తించడం వల్ల మేలు కలుగుతుంది.

## విద్యార్థులకు - స్ఫురణశక్తికి, పోటీ పరీక్షలలో విజయానికి

ప్రస్తుత కాలంలో విద్యార్థుల భవిష్యత్తు వారు వ్రాసే పోటీ పరీక్షలలో పొందే విజయంపైననే ఆధారపడి ఉంది. ఆ పోటీపరీక్షలు వ్రాయడానికి స్ఫురణశక్తి ప్రధానం. ఆ స్ఫురణశక్తి కోసం విద్యార్థులు **శ్రీ హయగ్రీవాయ నమః** అనే నామ స్మరణ నిరంతరం చేయడం అవసరం.

అదేవిధంగా పిల్లలకు స్పష్టమైన వాక్కు రాక వాగ్దోషాలు కలుగుతుంటే వారికి –

> **అశేష వాగ్జాడ్య మలాపహారిణీ నవం నవం స్పష్ట సువాక్ ప్రదాయినీ**
> **మమైహి జిహ్వాగ్ర సురంగ నర్తకీ భవ ప్రసన్నా వదనేచ మేశ్రీః**

అనే జపం వల్ల వాక్కుకుండే జడత్వం పోయి చైతన్యం సిద్ధిస్తుంది. అదేవిధంగా ఉద్యోగం కోసం, ఉద్యోగంలో లోపాలు రాకుండా ఉండడం కోసం మరింత గౌరవం కోసం **శ్రీ రాజమాతంగ్యై నమః** జపం చేయాలి.

త్వర త్వరగా పనులు పూర్తి కావడానికి, శ్రమ ధనం కాలం వ్యర్థం కాకుండా ఉండడానికి ప్రతి ఒక్కరు తప్పనిసరిగా చేయవలసిన జపాలు ఈ క్రింద సూచించబడుతున్నాయి. ముఖ్యంగా వ్యాపారస్థులకు తమ తమ వ్యాపారాలలో ఇబ్బందులు ఎదుర్కోకుండా ఉండాలంటే, తక్కువ శ్రమతో ఎక్కువ ప్రయోజనం పొందడానికి అనుకూలమైన జపం ఇది.

**సుమంతో సుమంతో శ్రీ కార్తవీర్యార్జునాయ నమః**

**శ్రీరామ జయరామ జయజయ రామ రామ**

పై జపాలను ప్రతిరోజూ నిరంతరం చేసుకుంటూ ఉండడం వల్ల అనేక విధాలుగా మేలు పొందే అవకాశం ఉంటుంది.

మనసు కీడు శంకించినపుడు, వాహన ప్రయాణాలలోనూ, భయపడుతున్న సమయంలో, చెడ్డ కలలు వస్తున్నప్పుడు మేలు కోరుకునే వాడు ఎప్పటికీ –

**ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం**

అనే జపం చేసుకుంటూ ఉండడం వల్ల ధైర్యం కలిగి, సంపదలు కురుస్తాయి.

ఆరోగ్యంలో ఇబ్బంది కలిగినప్పుడు ఆ యా శరీర భాగాలను స్పర్శిస్తూ **క్రీం అచ్యుతానంత గోవింద** అనే జపం చేస్తూ ఉండడం వల్ల మేలు కలుగుతుంది.

అప్పులు, ఆర్థిక బాధలు తీరడానికి **శ్రీగణేశ ఋణం ఛింది, సుమంతో సుమంతో శ్రీ కార్తవీర్యార్జునాయ నమః** వంటి జపాలు చేస్తూ ఉండాలి.

ఈ విధంగా పరిహార ప్రక్రియలు అనేక విధాలుగా ఉండడమే కాక వాటిని తామే ముందు చేసుకోవడం వల్ల శుభఫలితాన్ని పొందే అవకాశం ఉంటుంది. నడుస్తున్న గ్రహ దశాంతర్దశలకు కూడా నిత్యం జపం చేసుకోవడం వల్ల ఆ యా గ్రహదోషాలు శరీరంపై, మనసుపై చూపించే ప్రభావాలలో పాజిటివిటీ కలుగుతుంది.

## దానధర్మాలు : పూర్వపుణ్యబలం : నవమభావం

దానం కూడా పూర్వపుణ్యాన్ని పెంచేందుకు వినియోగపడేది. జాతక చక్రంలోని ద్వాదశభావాల్లో పూర్వపుణ్యం ఒక్కటి మాత్రం మనచేతుల్లోనిది కాదు. మిగిలిన అన్ని భావాలకు వ్యక్తి ప్రయత్నం అధికమైన ప్రాధాన్యం వహిస్తే నవమభావ లోపానికి మాత్రం దానధర్మాలు, సత్ప్రవర్తన, పాజిటివ్‌గా ఆలోచించడం, నలుగురికీ మంచి చేయడం, సహకరించడం వంటి కార్యక్రమాల వల్ల మాత్రమే సాధ్యమవుతుంది. నవమభావం బలంగా లేకపోతే వ్యక్తికి ప్రయత్నాలు ముందుకు సాగకపోవడం, అనుకున్న సమయంలో పనులు పూర్తి కాకపోవడం, ఒకే పనికోసం అనేకసార్లు ప్రయత్నం చేసి విసిగిపోవడం, ఎన్ని రకాలైన ప్రయత్నాలు చేసినా తృప్తి లేకపోవడం ముఖ్యమైన లోపాలుగా కనిపిస్తుంటాయి. అన్ని భావాలలో బలం ఉన్నా ఈ భావలోపం తీరడానికి కేవలం ఇతరులకు వేరు వేరు రూపాలలో మంచి చేయడం ద్వారా కలిగే పుణ్యబలమే ప్రధానం. ఎదుటివారు తృప్తిపడడం ద్వారా వారిచ్చే ఆశీస్సులే ఈ భావం పరిపూర్ణం అవడానికి, దోషం తొలగడానికి హేతువులవుతాయి. అందుకే ఈ భావాన్ని బలం చేసుకునే మార్గాలలో ఇష్టదేవతోపాసన, జపం చేస్తూ ఉండడం, అందరికీ మంచి జరగాలని కోరుకోవడం, అందరికీ ధనం బాగా కలగాలని కోరుకోవడం, మనసులో తమ శత్రుమిత్రాదులందరికీ తాము ధనాన్ని దానం చేస్తున్నట్టు భావన చేయడం, అందరూ ఆరోగ్యవంతులు కావాలని భావిస్తూ ఆసుపత్రులన్నింటిలోనూ ఎవరూ రోగులు లేకుండా ఉండాలని కోరుకోవడం, లోకం అంతా శాంతిగా ఉండాలని నిరంతరం భావిస్తూ ఉండడం కొన్ని మార్గాలవుతాయి.

అదేవిధంగా సాధ్యమయినన్ని విధాలలో దానాదులను చేస్తూ ఉండడం, ఆ యా దానాలు అవసరమైన వ్యక్తులకు, ఉపకరించేవిధంగా చేస్తూ ఉండడం,

సామూహిక ధర్మకార్యాలను నిర్వహించడం వంటి పనులు చేయడం వల్ల మాత్రమే నవమభావ లోపాన్ని పూర్తిచేయగలం. అందుకే **పరోపకారాయ పుణ్యాయ, పాపాయ పరపీడనం** అని అన్నారు. **పరోపకారార్థ మిదం శరీరం** అని కూడా అన్నారు.

## రత్నశాస్త్రం

శాంతి ప్రక్రియలలో ఒక భాగం రత్నాలద్వారా అందించే వైద్యం. ఇది అనేకరూపాలలో ఉన్నప్పటికీ శరీరంపైన ధరించే ఉంగరాలలో పెట్టుకోవలసిన రత్నాలను తెలుసుకొని, వాటిని ధరించడమే రత్నశాస్త్రంగా భావించబడుతుంది. దీనికి మూలం జ్యోతిషంలోని గ్రహాలు, దశలపైననే ఆధారపడి ఉంటుంది. రత్నాలు, ఉపరత్నాల విజ్ఞానం జ్యోతిష్కునికి తెలిసి ఉండాలి. ఏ రత్నం ఏ దోషానికి, ఎంతకాలం పెట్టుకోవాలో తెలపడం వల్ల ఆ వ్యక్తికి అది శ్రేయస్సును కలిగిస్తుంది. అయితే రత్నధారణవల్ల మాత్రమే సమస్యలు తీరిపోతా యనుకోవడం కేవలం భ్రమ మాత్రమే. అనేక రత్నాలను చేతినిండా పెట్టుకొన్నా ఒక్కోసారి ఏమాత్రం ఫలితం ఉండదు. అందుకే ఎప్పుడు, ఎటువంటి వానిని ధరించాలో తెలుసుకోవాలి. వ్యతిరేకమైన కాంతులు కలిగిన రత్నాలకు అవసరం లేని సమయాల్లో ధరించడం వల్ల వ్యతిరేక ఫలితాలు కూడా కలగడం మనం గమనించవచ్చు.

**'ముల్లును ముల్లుతోనే తీసివేయాల'**న్నది తెలుగు సామెత. మనిషి శారీరక, మానసిక స్థితులపై అధికంగా ప్రభావం చూపించే వివిధ కాంతుల ప్రభావం సరిగా లేనప్పుడు వాటిని గుర్తించి సూక్ష్మీకృత కాంతిని శరీరానికి అందజేసే రత్నాల ద్వారా వైద్యం చేసే విధానాన్ని రత్నశాస్త్రం తెలియజేస్తుంది. ఒక్కో [illegible] కాంతికి అనుగుణంగా ఒక్కో రత్నం పనిచేస్తుంది.

కాంతికి సంబంధించిన లోపాన్ని కాంతితోనే పూరించాలన్న వైజ్ఞానిక దృక్పథం రత్నశాస్త్ర ఆవిర్భావానికి దారితీసింది. జాతకాదుల పరీక్ష ద్వారా ఏ గ్రహ సంబంధమైన దోషం వుందో గమనించి ఆ గ్రహ సంబంధమైన రత్నం ధరింపజేయడం వల్ల దోషనివారణ జరుగుతుంది. ఈ అంశాలను గమనించే విధానమే నేడు **'జెమ్‌థెరపీ'** అంటున్నారు. ఈ విషయ సంబంధమైన వైద్య ప్రక్రియను **'స్టెల్లార్ హీలింగ్'** అని అంటారు.

నడుస్తున్నదశాదులలో కలిగే లోపాలను, గుణాలను అనుసరించి ప్రేరణ సూక్ష్మీకృత కాంతి ద్వారా పొందడానికి మాత్రమే రత్నం ఉపయోగపడుతుంది. జీవితాంతం ఉపయోగించవచ్చుననే రత్నాలేమీ ఉండవు. అవి అందరికీ ఒకేవిధంగా ఉండవు కూడా. జన్మలగ్నాధిపతి అనుసారంగా, జన్మరాశి అధిపతి అనుకూలంగా, పుట్టిన నక్షత్ర అధిపతి అనుకూలంగా రత్నాలను ధరించే సంప్రదాయం ఉంది. అదేవిధంగా న్యూమరాలజీ ప్రకారంగా పుట్టిన తేదీ తదితర అంశాల ఆధారంగా కూడా రత్నాలు ధరిస్తుంటారు. కాని నడుస్తున్న దశానుకూలంగా రత్నాలను ఉపయోగించే విధానం శ్రేష్టమైనటువంటిది. అనారోగ్యాల నివారణకు రత్నాల వినియోగం శుభఫలితాలనిస్తుంది. వేరు వేరు అనారోగ్యాలకు ఆ రోగనిరోధాన్ని కలిగించే దిశలో రత్నాన్ని ధరించడం మేలును కలిగిస్తుంది. అనారోగ్యనివారణకు ఎడమచేతికి, అభివృద్ధికోసం కుడిచేతికి రత్నాన్ని ధరించాలనే సంప్రదాయం కూడా ఉంది.

సాధారణంగా గ్రహదోషాలకు ఉపయోగించే రత్నాలలో భాగంగా

**రవికి – కెంపు (సన్‌సితార)**
**చంద్రునికి – ముత్యం, మూన్‌స్టోన్**
**కుజునికి – పగడం (తెలుపు మరియు ఎరుపు పగడం)**
**బుధునికి – మరకతం(అక్వామెరిన్, పెరిడాట్ , ఫైరోజ్, జేడ్)**

**గురునికి – పుష్యరాగం, టోపాజ్**

**శుక్రునికి – వజ్రం (ఓపల్)**

**శనికి – నీలం (ఎంథిస్ట్)**

**రాహువుకు – గోమేధికం**

**కేతువుకు** – వైడూర్యం ఉపయోగించడం సంప్రదాయం. వీనిలోనూ ఉపరత్నాలున్నాయి. అత్యంత ఖరీదు కలిగినవి, తక్కువ ఖరీదు కలిగినవి కూడా ఉంటాయి. ఆ విషయాలలో ఒక స్పష్టత లేనివారిచ్చే రత్నాలపై ప్రత్యేక దృక్పథం లేనివారు తీవ్రంగా మోసపోయే అవకాశం ఉంటుంది. ఈ రత్నాలను గాని ఉపరత్నాలను గాని తక్కువ క్యారెట్లలో, చక్కని రంగు కలిగినవి, దోష రహితమైనవాటిని జ్యోతిష సలహా మేరకు ధరించవచ్చు.

నవరత్నాలను ధరించకూడదనే భావనను కొందరు టీవీ మాధ్యమాల ద్వారా ప్రచారం చేస్తున్నారు. ఈ విషయం పూర్తి సత్యదూరమైనదే. అన్ని రత్నాలు తక్కువ క్యారెట్లలో ఉంటూ సమాజంలో అన్ని వర్గాలవారు తమకు అనుకూలించాలనే భావంతో ఏర్పాటుచేసిన ఈ రత్నాలను పెట్టుకోకూడదంటూ చేసే ప్రచారాలన్నీ లాభాపేక్షతో చేసేవే. సమాజంలో ఆలోచనావర్గం బుధ, శుక్ర, చంద్రులవంటివారు. నిర్వహణా వర్గం గురు, రవి, కుజులు. సేవక వర్గం రాహు, శని, కేతువులు. అందరూ అనుకూలించాలనే భావనే నవరత్నాల విషయంలో ప్రధానం. ఇది పెట్టుకోకూడదంటూ చేసే ప్రచారం సత్యదూరం. ఇంకా కేవలం లక్కీస్టోన్ అని, పవర్ స్టోన్ అనీ చెప్తూ దానివల్ల మీ జీవితమే మారుతుందనే ప్రకటనలకు మాత్రం దయచేసి మోసపోకండి. అధికమైన ఖర్చుతో కూడిన ఈ అంశం ద్వారా మిమ్మల్ని మభ్యపెట్టడమే ఇందులోని ప్రధాన లక్ష్యం. ఒక్కరాయి జీవితాన్ని మార్చేయడమనే అంశం ఉండదు.

ఈ విషయంలో ఒక ప్రత్యేక సూచన ఏమిటంటే–

**రత్నంవల్లనే జీవిత గమనం మారిపోతుందనే మాటలకు భ్రమపడకండి. మీరు చేసే శ్రమకు అదనంగా కొంత బలాన్నివ్వాడానికి మాత్రమే రత్నం పనిచేస్తుందనే భావాన్ని విశ్వసించండి.**

# స్వప్నం

కాంతియొక్క సూక్ష్మీకృత రూపమే మనసు. సకల జీవరాశుల అంతశ్చేతన ఒక్కటేనని మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. మనిషి నిద్రించినా మనసు నిద్రించదు. దానికున్న శక్తి అమోఘం. అందువల్ల నిద్రలో కూడా అది స్మృతులను వెలికి తీస్తుంటుంది. మనసుకు భవిష్య జ్ఞానముండి స్వప్నం ద్వారా అది వ్యక్తీకరింపబడుతుంది. స్వప్నంలో కనిపించే వివిధ అంశాలకు వివిధ ప్రతీకలున్నాయి. ఇవి ప్రాంతపరంగా భౌగోళిక పరిస్థితుల ఆధారంగా విభేదిస్తాయి.

జాతకాలలోని మంచిదశలలో కలిగే మంచిఫలితాలను అనుభవించడం కోసం తగిన ప్రయత్నం చేయాలి. లేకుంటే ఆ మంచి మన అనుభవంలోకి రాదు. అదేవిధంగా చెడు దశలలో కలిగే వ్యతిరేక ఫలితాలను తగ్గించుకునే దిశలో ప్రయత్నించాలి. ఈ ప్రయత్నం లేకుంటే వ్యక్తి తాను అనుభవించాల్సిన మంచి చెడులు సరియైన కాలంలో అనుభవించలేడు. అంటే మంచి జరగవలసిన కాలంలో కాలయాపన చేయడం, చెడుజరిగే కాలంలోనూ నిరోధించుకోలేక పోవడం, శాంతులు జరుపుకోకపోవడం వల్ల వ్యక్తి ఆనందానికి దూరం అవుతున్నాడు. మంచి జరగాల్సిన సమయంలో ప్రయత్నలోపం వల్ల జరగవలసిన మంచి **కలల్లో** జరుగుతుందని, చెడు జరగాల్సిన సమయంలో నిరోధప్రక్రియ లేనందువల్ల జరగాల్సిన చెడు **ఇలలో** జరుగుతుందని భావన. అందుకే మంచి కలలు వస్తే ఇలలో ఆ మంచి ఇక జరుగదనే భావనతో

శుభస్వప్నాలకు అశుభమైన ఫలితాలను చెప్తారు. అదేవిధంగా నిరోధించాల్సినంత విధంగా శాంతి ప్రక్రియలు చేసుకుంటే ఆ చెడు కలల్లో జరిగిపోతే ఇలలో మంచి జరుగుతందని భావిస్తుంటారు. శుభస్వప్నాలకు చెడుఫలితాలు, అశుభస్వప్నాలకు శుభఫలితాలివ్వడంలోని ఆంతర్యమిదే. ఈవిధంగా కలలను అధ్యయనం చేస్తూ శుభాశుభాలను పరిశీలన లోనికి తీసుకోవడం ద్వారా ప్రమాదాలనుండి రక్షించుకోవచ్చు. ఈ భావంతో వృద్ధి పొందిన శాస్త్రం స్వప్నశాస్త్రం. దీన్ని ప్రాంత విభేదం, పరిశీలనా భేదాన్ని అనుసరించి ప్రాచ్య పాశ్చాత్య భావాలుగా అధ్యయనం చేస్తున్నారు.

## వృష్టి - వాతావరణ జ్యోతిషం

వ్యవసాయదారునికి ముఖ్యంగా కావల్సింది వర్షం. దాని ప్రకారమే అతడు విత్తనాలు వేసి పంటలు పండిస్తాడు. అకాలంలో వేసిన పంట మొలకెత్తదు, పండదు. అది తనకే గాక దేశానికి కూడా నష్టమే. అందుకే వర్షవిజ్ఞాన పరిశోధన అత్యంతావశ్యకం. సూర్యుని వివిధ కార్తెల ప్రవేశం, చంద్రపరివేషం మొదలైన అంశాలు ప్రకృతిని ప్రేరేపిస్తున్నాయని, దానికి అనుగుణంగా వర్షాలు పడుతున్నాయని గ్రహించారు. ఈ విషయాలపై బాగా అవగాహన పెంచుకున్న మన జానపద వ్యవసాయదారులు ఆ సమయ నిర్దేశమాధారంగానే తమ పనులు చేసుకుంటున్నారు. ఈవిధమైన పరిశీలన రెండురకాలుగా సాగుతుంది.

**సద్యోవృష్టి :** జంతుజాలాల ప్రవర్తనా మార్పులవల్ల కురియబోయే వృష్టిని 'సద్యోవృష్టి' గా పరిశీలిస్తారు. అప్పటికప్పుడు ఎంత వర్షం కురుస్తుందనేది ఇందులో ప్రత్యేకం. గాడిదలు చెవులు రిక్కించుకోవడం, పిల్లి తన గోళ్ళతో భూమిని గీరుతుండడం, పశువులు ఇంటినుండి బైటకు పోవడానికి ఇష్టపడక పోవడం, పశువులు చెవులు, పాదాలను లేపుతూండడం, కుక్క ఇంటిపైన కూర్చుని ఆకాశాన్ని చూస్తూ మొరగడం, చీమలు తమ గుడ్లను వేరు వేరు

ప్రాంతాలకు తీసుకు వెళ్తుండడం, పాములు చెట్టెక్కడం, గోవులు పరుగెత్తడం వంటి ఎన్నో అంశాలు సద్యోవృష్టిని సూచిస్తుంటాయి.

**ప్రవర్షణ :** జ్యేష్ట శుద్ధ పూర్ణమి తర్వాత పూర్వాషాఢానక్షత్రం నుండి వరుసగా 27 నక్షత్రాలు దాటేవరకు ఏరోజులో ఎంత వర్షం ఏ ప్రదేశంలో పడుతుందో గమనించి దాని ప్రకారం ఆ సంవత్సరం వర్ష ఫలితాన్ని తెలుసుకునే విధానం 'ప్రవర్షణ' అనే అంశంగా అధ్యయనం సాగుతుంది.

ప్రతి సంవత్సర ఫలితాంశాలలో ముందుగా రాజు, మంత్రి, సేనాధిపతి అనే నవనాయక నిర్ణయంలోనూ ఎక్కువభాగం వర్షానికి సంబంధించిన అంశాలతో ముడివడి ఉంటుంది. ఈ అంశాలను గమనిస్తే సంవత్సరంలో పడబోయే వర్షాన్ని గమనించడం, దానికి అనుగుణంగా సంవత్సరంలో ఏ పంటలు అధికంగా పండించవచ్చో, ఏవి పండించకూడదో, ఏ నేలలు శ్రేయస్కరంగా పండుతాయో, వేటిలో ఇబ్బందులుంటాయో, అతి, అనావృష్టుల ఇబ్బందులు, ఏ వస్తువులను జాగ్రత్తగా వాడుకోవాలో, వేటిని యథేచ్ఛగా వినియోగించవచ్చో ఒక ప్రణాళికను ఏర్పరచుకోవచ్చు. అదేవిధంగా పశుసంపదను జాగ్రత్తగా చూసుకోవడం, వాటికి ఇబ్బందులు రాకుండా చూసుకోవడం, వాటికి గడ్డి సరియైన విధంగా లభిస్తుందో లేదో గమనించడం వంటి అంశాలు దీనిలో ప్రత్యేకంగా గమనించాలి. ఈ విధంగా సంవత్సర ప్రణాళిక ద్వారా రైతులు, జానపదులు అధికదిగుబడులతో ఆనందపడే అవకాశం ఏర్పడుతుంది.

ఇవే కాక వృష్టి నిర్ణయంలో మేఘాలు గర్భందాల్చే సమయం, అవి వర్షించే సమయాలు, ఆ యా సమయాలలో వాతావరణ పరిశీలన ద్వారా ఆ సంవత్సర వర్షాన్ని నిర్ణయించే అవకాశం, తుఫానులు, వాయుగుండాలు మొదలైనవి తెలుసుకునే అవకాశం కూడా జ్యోతిషం ద్వారా ఉంటుంది.

రోహిణీయోగం, స్వాతీయోగం, ఆషాఢీయోగాదులలో వాతావరణ పరిశీలన ప్రస్తుతం బాగా జరుగుతుంది. ఈ అంశాలపై పరిశోధనాత్మక కృషి ఆవశ్యకత ఎంతో ఉంది. ప్రకృతి శాస్త్రమైన జ్యోతిషం, వాతావరణశాస్త్రంగా ప్రత్యేకవిభజన పొంది ప్రస్తుతం మెటీరియాలజీ పేరుతో అధ్యయనం చేయబడుతున్న రెండింటి సమాహార రూపాన్ని చూస్తే లోకానికి మంచి ఫలితాలను అందించే అవకాశం ఉంటుంది. అదేవిధంగా పాశ్చాత్య పద్ధతుల రీత్యా దేశగోచారాన్ని కూడా గమనిస్తూ గ్రహసంచారాన్ని పరిశీలిస్తే వాతావరణాన్ని తెలియజేయవచ్చు. జ్యోతిషంలోని ఈ విభాగం కూడా అతి పెద్ద విభాగాలలో ఒకటి.

## సాముద్రికం

కాంతి ప్రభావాల వల్లనే వేరువేరు శరీరతత్త్వాలు, రేఖలు ఏర్పడడం, శరీరాంగాల వృద్ధిక్షయాదులు సాధ్యమని సాముద్రికశాస్త్రం చెబుతుంది. శరీర అంగాలు, హస్తంలోని రేఖలు వాని ప్రభావాలను నిరంతరం అధ్యయనం చేయడంవల్ల ఈ రేఖలు మొదలైనవి భవిష్యత్తును సూచిస్తున్నాయనే భావం ఏర్పడింది. అందువల్ల ఇది ప్రస్తుతకాలంలో ప్రత్యేకమైనశాస్త్రంగా అధ్యయనం చేస్తున్నారు. శరీరాంగాలకు సంబంధించి పూర్వకాలం నుండీ ప్రత్యేకమైన అధ్యయనం సాగుతుంది. అనేక గ్రంథాలు ఈ విభాగంలో వెలువడ్డాయి. అయినా పాశ్చాత్య సాముద్రిక నిపుణుడు కీరో వ్రాసిన గ్రంథాలు లోకంలో ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయి. శుభలక్షణాలతో ఉన్న శరీరం మంచి పనులు చేయడానికి అనువుగా భగవంతుడు అందించినట్లు దీని వెనుక భావన. ఇబ్బందులు, కొన్ని అంగాలు కోల్పోవడం, తగ్గి ఉండడం వంటి అంశాల వెనుక ఆ యా భావనా లోపాలు కనిపిస్తున్నాయి. ఇందులో మరింత సూక్ష్మంగా పరిశీలించేది హస్త సాముద్రికం. దానిలో సూక్ష్మమైన రేఖల మార్పులను

ఎప్పటికప్పుడూ తెలుసుకో గలగాలి. రేఖల పరిమాణాలలో కలిగే మార్పులను, తాత్కాలికంగా ఆ రేఖలు ఏర్పరచే కోణాదులను అధ్యయనం చేస్తే రాబోయే మంచి చెడుల సూచన తెలుస్తుంది. నిరంతర పరిశీలన వల్ల ఇది సాధ్యమవుతుంది.

హస్త, అంగ, తిలక, ముఖ, పశుసంబంధమైన అంశాలు ఇందులో ప్రత్యేక విభాగాలుగా రూపుదిద్దు కున్నాయి. హస్తరేఖల ఆధారంగా భవిష్యత్తును సూచించడం హస్త సాముద్రికం. శరీరాంగాల ఆధారంగా వ్యక్తియొక్క విశేషాలను తెలియజేసేది అంగ సాముద్రికం. శరీరంపైగల పుట్టుమచ్చల ఆధారంగా ఫలితాలు తెలిపేది తిలక సాముద్రికం. ముఖం ఆధారంగా ఫలసూచన ముఖసాముద్రికంగా భావింప బడుతుంది. పశువుల మీది సుడులు, వాటి ప్రత్యేక లక్షణాలను ఆధారంగా వాటిలో మంచివానిని నిర్ణయించడానికి ఏర్పడిన శాస్త్రం పశుసాముద్రికం.

## వాస్తు

వస్తుగతమైంది వాస్తు. ఈ ప్రకృతిలో భూమిపై ఆనందంగా, ఆరోగ్యంగా నివసించడానికి ఒక ప్రత్యేకమైన సదుపాయాలు కలిగి, ప్రకృతి శుభాశుభ కిరణాలకు, భూ అయస్కాంత తరంగాలకు అనువుగా జీవనం సాగిస్తే అది వ్యక్తి అభివృద్ధికి హేతువవుతుంది. ప్రకృతికి వ్యతిరేకమైన జీవనం పతనం చేస్తుంది.అనుకూలమైతే ఆనందాన్నిస్తుంది. ఈ విషయాలకు శాస్త్రీయమైన రూపమే వాస్తుశాస్త్రం. దీనిలో 'కళారాధన' అనే అంశం కూడా చేరి అందం అనే అంశానికి ప్రాముఖ్యం కలిగింది. అందంగా ఉండి వ్యక్తి ఆనందమయ జీవనమార్గానికి హేతువయ్యేది వాస్తుశాస్త్రం. ఈ శాస్త్రాన్ని ఆలయ, శిల్ప, గృహ, యంత్ర అనే విభాగాలుగా అధ్యయనం చేస్తున్నారు. ప్రస్తుత కాలంలో

దీనిపై అత్యంత శ్రద్ధ పెరిగి, ఆర్కిటెక్చర్, ఇంటీరియల్ డెకరేషన్, వాస్తు ఇంజనీరింగ్ విభాగాలుగా అధ్యయనం చేస్తూ నూతనాంశాలను ఆవిష్కరణకు ప్రయత్నం చేస్తున్నారు.

తమ తమ నివాస గృహాలను తాము నిర్మించుకోవడం, అమరికలను మార్చుకోవడం అందరు చేయగలిగే సులువైన శాంతి ప్రక్రియ. వాస్తు వల్లనే అన్ని మార్పులు జరుగుతుంటాయని కొన్ని గ్రంథాలు మనకు చెపుతుంటాయి. ఆ గ్రంథాలు మూల జ్యోతిషాంశాలను, వాస్తు అంశాలను మాత్రం వెల్లడించవు. మౌలికమైన సూత్రాలతో కూడుకొని ఇంట్లో ఉండే భార్య, భర్తలకు అనువైన, అనుగుణమైన ముఖద్వారాదులు నిర్ణయించాలి. దీనికి కూడా అనేక పద్ధతులున్నాయి. మొత్తం ఎనిమిది దిక్కులను అ, క, చ, ట, త, ప, య, శ అనే ఎనిమిది వర్గులుగా విభజిస్తాం. వ్యక్తి పేరులోని మొదటి అక్షరం లేదా అందరూ పిలిచే పేరులోని మొదటి అక్షరం ఏ వర్గులోకి చేరుతుంటుందో తెలుసుకోవాలి. తూర్పుకు – అ వర్గు (అ నుండి అః వరకు), ఆగ్నేయానికి – క వర్గు (క,ఖ,గ,ఘ), దక్షిణానికి – చవర్గు (చ,ఛ,జ,ఝ), నైరుతికి – ట వర్గు (ట,ఠ,డ,ఢ,ణ), పశ్చిమానికి – త వర్గు (త,థ,ద,ధ,న), వాయువ్యానికి – ప వర్గు (ప, ఫ, బ, భ, మ), ఉత్తరానికి – య వర్గు (య, ర, ల, వ), ఈశాన్యానికి – శ వర్గు (శ, ష, స, హ) ఉంటాయి. వీటిలో నామ ప్రథమాక్షరం ఏ దిశకు చెందిందో అది ఆ వ్యక్తికి చెందిన స్వస్థానం అవుతుంది. వ్యక్తి తన స్వస్థానంలో నివసించాలి. అంటే గ్రామాలలో అయితే బొడ్రాయికి ఆ దిశవైపు తానుండాలని అర్థం. పట్టణాలలో అయితే తమ బెడ్‌రూమ్స్ ఆ వైపుగా ఉండేట్లు చూసుకోవాలి. అయితే దీనిలోనూ కొన్ని జాగ్రత్తలు, సాధారణంగా అనుసరించాల్సిన అంశాలూ ఉంటాయి. తమ స్వస్థానానికి ఐదవ స్థానం శత్రుస్థానం అవుతుంది. అంటే –

సరళ అనే పేరు కలిగినవారికి స్వస్థానం ఈశాన్యం అయితే అక్కడనుండి ఐదవస్థానం అయిన నైరుతి శత్రుస్థానం అవుతుంది. ఇటువంటి వారికి నైరుతి బెడ్‌రూమ్స్‌లో నిద్రించడానికి అనుకూలత ఉండదు. ఆ విషయాలను గమనించాలి. అయితే భార్య, భర్త ఇద్దరి పేర్లను బట్టి నిర్ణయాలు తీసుకునేటప్పుడు మిత్రస్థానాల లోని బెడ్‌రూమ్‌లను ఉపయోగించాలి. శతృస్థానంలో ముఖద్వారం కాని, బెడ్‌రూమ్ కాని ఉండకూడదు.

ఇంటికి సాధారణంగా చుట్టూ ఖాళీ స్థలం కొంతైనా, కనీసం మనిషి తిరగడానికి అనువుగా ఉండాలి. చుట్టూ ఖాళీ స్థలాన్ని వదలడాన్ని పిశాచస్థల పరిత్యాగం అని అంటారు.

పశ్చిమం కన్నా తూర్పువైపు, దక్షిణం కన్నా ఉత్తరం వైపు ఎక్కువ స్థలాన్ని వదిలిపెట్టాలి.

భూమి నైరుతి నుండి ఈశాన్యం వైపుకు తిరుగుతూ ఉండడం వల్ల నీటి వాలు కూడా అదేవిధంగా ఉండడం మంచిది.

ఇంటినుండి నీరు పూర్తిగా బైటికి వెళ్ళే మార్గాలు ఆ విధంగా ఉండడం శ్రేష్ఠం. అన్ని గదులలోనూ ఇదేవిధంగా ఉండాలనే నియమం లేదు. అవకాశం ఉంటే చేసుకోవచ్చు.

ఓవర్‌హెడ్ వాటర్ ట్యాంక్‌లను పశ్చిమం వైపుగా పెట్టుకోవడం క్షేమాన్నిస్తుంది. సాధారణంగా బాత్‌రూమ్‌లు మొదలైన నీటి వినియోగ ప్రదేశాలు నైరుతివైపు లేకుండా ఉండాలి.

ఇంట్లో డబ్బులుండే బీరువాలను ఉత్తరం వైపు పెట్టుకుంటే మనం ఉత్తరం చూస్తూ ధనం తీసుకోవడం, అక్కడ పెట్టుకోవడం ద్వారా ధనం మనకు వినియోగమవుతుంది.

ఇంటికి సంబంధించిన నియమాలు ఆలోచిస్తున్నకొద్దీ అధికంగా కనిపిస్తూనే ఉంటాయి. అనుమానాలు అధికంగానే వస్తాయి. ప్రస్తుతకాలంలో వాస్తు తెలియని వారే లేరు. ఇంట్లోకి రాగానే ఎక్కడెక్కడ ఏ దోషాలున్నాయా అని గమనిస్తూ చూడడం వారందరికీ అలవాటై పోయింది. అంతేగాక ఇంటివారు ఏదైనా సమస్యల్లో ఉంటే ఆ సమస్యకు ఇంట్లో ఉన్న ఏదో వాస్తు దోషానికి అంటగట్టడం పరిపాటి. అన్నివిధాలుగా దోషం లేని ఇల్లు ఎలాగూ ఉండదు. ఏవో కొన్ని చిన్న చిన్న లోపాలుంటూనే ఉంటాయి. అయితే ఆ యా సమస్యలు ఆ యింట్లో ఒకే వ్యక్తికి సంబంధించి ఎక్కువగా వస్తూ ఉంటే అది వారి జాతకదోషమవుతుందేమో ముందు గమనించుకోవడం మంచిది. ఆది కాకుండా ఇంటికి వచ్చిన ప్రతివారూ ఒక్కో దోషం సూచించి పోవడం వల్ల ఇంటివారు ఏ మార్పు చేసుకోవాలో అర్థం కాక మరింత ఆందోళన చెందే అవకాశం ఉంటుంది. అందరి మాటలు వినడమూ తప్పే. అన్నీ ఆచరిస్తూ పోతే ఇంటిని ఏవిధంగా మార్పుచేసుకోవాలో మనకే అర్థం కాదు. అందుకే ఒకరిని నమ్ముకొని వారి భావనల మేరకు మంచి చెడుల నిర్ణయం చేసుకొని ధైర్యంగా ముందుకు సాగవలసి ఉంటుంది.

వాస్తు కేవలం 20 శాతం వరకు మాత్రమే ఫలితాన్నిస్తుంది. జాతకం బలంగా ఉండి, సామర్థ్యం అధికంగా ఉండే దశ సాగుతుంటే ఇటువంటి ఎన్ని దోషాలున్నా వ్యక్తి వాటిని అధిగమించగలుగుతాడు. అట్లా కాకుండా జాతకంలో దోషం ఉన్నప్పుడు మాత్రం వాస్తు కూడా దోషప్రదమైతే మరింత ఇబ్బంది కలుగుతుంటుంది. అటువంటి సమయాల్లో జాతక దోషనివారణకు శాంతి విధానాలు ఏవిధంగా అవసరమో గృహ దోషనివారణకు గృహాన్ని ఆనందంగా మార్చుకోవల్సిన అవసరం కూడా ఏర్పడుతుంది. గృహాన్ని ముందుగా మనం ప్లాన్‌చేసుకొని కట్టవచ్చు కాబట్టి ముందు జాగ్రత్తలతో కట్టడం వల్ల ఎప్పటికీ అది ఆనందాన్నే ఇస్తుంది.

ఒక ఇంట్లో అందరికీ ఒకేసారి ఇబ్బందులు ఎదురు కావడం అంటే పెద్దవారికి అనారోగ్యం, మధ్యవయస్సువారికి ఉద్యోగాదుల్లో కలిగే ఇబ్బందులు, చిన్న వయస్సువారికి విద్యాదుల్లో రాణించలేకపోవడం వంటి వాని వల్ల ఆ గృహానికి ఆయువు తీరినట్లుగా భావించవచ్చు. అటువంటి సమయాల్లో గృహానికి పునఃచైతన్యం కలిగించే ఏ ప్రక్రియ చేసినా మంచిదే. అట్లా కాకుండా ఆ గృహంలో కేవలం ఎవరో ఒకరికి మాత్రమే కలిగే ఇబ్బందులను ఇంటి వాస్తుకు ముడిపెట్టి ఆలోచించడం వల్ల అధికమైన ఫలితాలు ఉండకపోవచ్చు. బజారులో దొరికే అన్ని వాస్తుపుస్తకాలు ముందరపెట్టుకున్నా మనం నిర్ణయించే అంశం ఏదీ ఉండదు. అందువల్ల సరియైన, నిర్ణయశక్తి కలిగిన, తాము నమ్మిన వారిని వాస్తు విశేషాల కోసం సలహాలు తీసుకోవడం వల్ల మంచి జరుగుతుంది. ఏది ఏమైనా చక్కని వెలుగు, గాలి వచ్చే వాతావరణాన్ని, చైతన్యం ఇంట్లో పెరిగే విధమైన వాతావరణాన్ని ప్రకృతి నుండే పచ్చేటట్లుగా ప్రయత్నం చేస్తూ, వ్యతిరేకతలు ఇంట్లోకి చేరడాన్ని నిరోధిస్తూ మానవ మనోభావాలపై ఆనందముద్రలు పడేవిధమైన గృహనిర్మాణం ఇంటికి, ఇంటిలోనివారికి నిరంతరం మంచిని కలిగిస్తుంటుంది.

వాస్తు కేవలం గృహవాస్తు మాత్రమే కాకుండా, ఆలయ వాస్తు, యంత్ర వాస్తు, శిల్పవాస్తు అని అనేక రకాలుగా విభజింపబడింది. ఆ యా విభాగాలన్నింటికీ ప్రత్యేకమైన పరిశీలన ఉంది. ఆధునిక ఆర్కిటెక్చర్‌ను, ఇంటీరియల్ డెకరేషన్‌ను కూడా తెలుసుకోవడం వల్ల మరింత ఉత్తమమైన గృహ నిర్మాణం చేయవచ్చు.

ఇవి ఎన్నో విభాగాలు. ఇట్లా ఎన్నింటినో జ్యోతిషం రీత్యా పరిచయం చేస్తూ పోవచ్చు. ఈ విభాగాలన్నీ అధ్యయనం చేయడం ద్వారా జ్యోతిషంపై ఒక అవగాహన ఏర్పడి ముందుకు సాగాలనే ఆకాంక్ష. జ్యోతిషాన్ని అధ్యయనం

చేయడానికి ప్రస్తుతం అవకాశాలు మెండుగా ఉన్నాయి. మనస్సులో ఎవరికి వారు భావనలు స్థిరం చేసుకోవడమే తరువాయి.సరియైన జ్యోతిష్కుని సంప్రదింపు, సరియైన విధమైన శాంతి విధానాలను పాటించడం ఎప్పటికీ మంచి ఫలితాలనే ఇస్తాయని మరవకండి. జ్యోతిషంపై అతి విశ్వాసాన్ని, అవిశ్వాసాన్ని రెండింటినీ విడనాడి ఆత్మవిశ్వాసాన్ని పెంచుకునే మార్గాన్ని అన్వేషించండి.

జ్యోతిష విజ్ఞానమంతా జీవితానికి మార్గదర్శకత్వాన్నిచ్చేదే. అటువంటి సమయంలో ఐహికంగా సుఖంగా ఉండడానికి, ఈ జీవనంలో చేసే మంచి పనుల వల్ల తరువాతి జన్మలు సుఖంగా ఉండడానికి ప్రయత్నం చేయడమే భారతీయుని ప్రథమ లక్ష్యం. ఇది ఆధ్యాత్మ జీవన విధానం. అయితే జ్యోతిషం ద్వారా సరియైన కాలాదులు తెలుసుకుని మంచి పనులు, దానాదులు, సత్కర్మాచరణల ద్వారా ఎక్కువమందినుండి పాజిటివిటీని పెంచుకుంటే వ్యతిరేకతలను తగ్గించుకోవచ్చు. ఈ అనుకూలతలను అనుసరించి ఉత్తమ జీవనాన్ని గడపాలి. జ్యోతిషం మాత్రమే దీనికి సరియైన మార్గదర్శకత్వం ఇస్తుంది. వ్యక్తి ఆనందపథానికి జ్యోతిషపథమే శరణ్యం.

**ఆత్మాత్వం గిరిజామతిః పరిజనాః ప్రాణాశ్శరీరం గృహం**
**పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధి స్థితిః**
**సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాంగిరో**
**యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్**

